# మృత్యుంజయుడు

( న వ ల )

హిందీమూలం :

శ్రీ శివసాగర్ మిశ్ర




ప్ర కా శ కు లు :

ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ

హై ద రా బా దు - 500 034.

# మృత్యుంజయుడు



హిందీమూలం :

శ్రీ శివసాగర్ మిశ్ర

తెనుగుసేత :

కుమారి వాసిరెడ్డి సీతాదేవి




ప్రకాశకులు :

ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ

హైదరాబాదు - 500 034.

# హిందీ అకాడమీ పక్షాన....

'మృత్యుంజయుడు' ఆంధ్ర ప్రదేశ్ హిందీ అకాడమీ పక్షాన తెలుగులో ప్రకటించబడిన ద్వితీయ అనువాద గ్రంథం. ప్రముఖ హిందీ నవలాకారునిగా ప్రఖ్యాతి గడించి యిప్పటికి 40 కి పైగా హిందీలో మౌలిక గ్రంథాలు రచించి హిందీ ప్రజల మన్ననల నందుకున్న శ్రీ శివసాగర్ మిశ్ర రచించిన 'అక్షత్' నవలకు కుమారి వాసిరెడ్డి సీతాదేవిగారు చేసిన తెలుగు సేత యీ మృత్యుంజయుడు.

తెలుగు సాహిత్య సంస్కృతీ విశేషాలను హిందీ భాష ద్వారా తెలుగు వారికి అందజేయడం, ఇతర ప్రాంతాల సాహిత్య సంస్కృతీ విశేషాలను తెలుగు భాష ద్వారా తెలుగు వారికి తెలియజేయడం హిందీ అకాడమీ కార్యక్రమాలలో ఒక భాగం. ఆ ప్రకారం హిందీ రచయిత శ్రీ మిశ్రగారు హిందీలో వ్రాసిన మౌలిక నవలను తెలుగులో ఆంధ్ర ప్రదేశ్ ప్రజలకు అందజేస్తున్నాం.

ఈ నవలను తెలుగులోకి అనువదించి ప్రకటించేందుకు అనుమతించిన శ్రీ శివసాగర్ మిశ్రగారికి, యీ గ్రంథాన్ని తెలుగులోకి అనువదించి యిచ్చిన ప్రఖ్యాత తెలుగు రచయిత్రి కుమారి వాసిరెడ్డి సీతాదేవి గారికి, యీ గ్రంథాన్ని ముద్రించి యిచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్ వారికీ ఆంధ్ర ప్రదేశ్ హిందీ అకాడమీ పక్షాన ధన్యవాదాలు సమర్పిస్తున్నాం.

హైదరాబాద్
ది. 25-3-1988.

వేమూరి రాధాకృష్ణమూర్తి
అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ



శ్రీ శివసాగర్ మిశ్ర

శ్రీ శివసాగర్ మిశ్ర ప్రసిద్ధ హిందీ నవలాకారులు. కథానికా రచయిత. జన్మస్థలం బీహార్ ప్రాంతం సమస్తీపూర్ జిల్లా శ్రీరామ్‌పూర్ గ్రామం. జాతీయ భావావేశంతో నిండిన గంభీర స్వభావం. చదువుకొనే రోజుల్లోనే జాతీయోద్యమంలో ప్రవేశించి విజృంభించి పని చేశారు. తత్ఫలితంగా లాఠీల కొరడా దెబ్బల శిక్షలు అనుభవించారు. బీహారు ప్రాంతాన్నుంచి చాలాకాలం బ్రిటిష్ ప్రభుత్వం వీరిని బహిష్కరించింది. కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో చేరి ఉన్నతవిద్య నభ్యసించిన తరువాత సాహిత్య రంగాన్ని వరించారు. 1950 నుండి ఆకాశవాణిలో చేరి వివిధ హోదాలలో 23 సంవత్సరాలు పనిచేశారు. సాహిత్యసృజనకు పూనుకొని సుమారు 40 సంవత్సరాలు హిందీ సాహిత్య ప్రగతికి విస్తారంగా కృషి చేశారు. వీరు రచించిన సుమారు 40 హిందీ గ్రంథాలు ఇప్పటికి వెలువడ్డాయి.

1973 లో భారత ప్రభుత్వ రైల్వే మంత్రిత్వశాఖలో రాజభాషా విభాగం డైరెక్టరు పదవి స్వీకరించారు. శ్రీ శివసాగర్ మిశ్ర గారి అకుంఠిత దీక్షవల్ల భారత ప్రభుత్వ మంత్రిత్వశాఖల్లో రైల్వేశాఖ రాజభాషా ప్రచార ప్రసారాలు విస్తారంగా కావించింది.

శరత్‌బాబు రచనల యందలి శ్రీ చైతన్యం, ప్రేమచంద్ రచనల యందలి గ్రామ్య జీవనవిధానం, హజారీప్రసాద్ ద్వివేదీ రచనల యందలి ప్రజల జీవన సంవేదనాసరళి, చారిత్రిక మానవ భావనావికాస సమన్వయ విధానం శ్రీ శివసాగర్ మిశ్ర రచనల్లో మూర్తీభవించివుంటాయి. గ్రామ్య జీవన విధానాన్ని చిత్రించిన వీరి రచనల్లో నేటి భారత సమాజం పడుతున్న వ్యథల కథల సజీవ చిత్రణం చోటు చేసుకొనివుంటే, వీరి చారిత్రిక రచనల్లో యీనాటి సమాజానికి అవసరమైన చైతన్యదీప్తి స్ఫూర్తి నిండివుంటాయి. వీరి ప్రముఖమైన కొన్ని రచనల వివరం -

నవలలు - అభియాన్, రాజతిలక్, మగధ్‌కీ జై, కాగజ్‌కా లంగర్, జనమేజయ్ బచో, అజన్మావహ్, సలీబ్‌ఢోతేలోగ్ మొదలగునవి.

కథానికా సంపుటి - కహేం గాంవ్‌కీ గాథా.

వ్యాస సంపుటి - హిందీ హమ్ సబ్‌కీ.

సంస్మరణలు - వేలడేంగే హజార్ సాల్.

బాలల రచనలు - లడాయీ ఏక్ రోషినీకీ, బహాదుర్ లడకా.

శ్రీ శివసాగర్ మిశ్ర రచనల్లో జ్ఞాన్‌పీఠ్ ఎవార్డు గ్రహీతగా, జాతీయ మహాకవిగా కీర్తిప్రతిష్ఠలు ఆర్జించిన కీ॥ శే॥ రామ్‌ధారీసింహ్ దిన్‌కర్ గారి సంస్మరణా గ్రంథం అపూర్వమైనది. దిన్‌కర్‌గారి అల్లుడుగా, సాహితీపరుడుగా, భక్తిశ్రద్ధలతో వారికి బహు దగ్గరగా వుండి వారి ఆలోచనాసరళిని, ఆచరణా విధానాన్ని, సాహితీవిశేషాల్ని విమర్శనా దృష్టితో పరిశీలించి సునిశితమైన శైలిలో దిన్‌కర్ సంస్మరణా గ్రంథాన్ని రూపొందించారు శ్రీ శివసాగర్ మిశ్ర.

# మృత్యుంజయుడు

గాఢ నిద్రనుంచి అప్పుడే మేల్కొన్నట్టుగా కన్పించింది రాజదేవ్‌కు. కళ్ళు తెరవడానికి ప్రయత్నించాడు. తెరవలేకపోయాడు. కనురెప్పలు బరువుగా వున్నాయి. అటు నిద్రా, ఇటు మెలుకువా కాని ఓ వింత అనుభవం – ఆ స్థితినుంచి బయట పడాలనే ప్రయత్నం.

అతడికి తనొక ఎత్తు పల్లాలుగల ప్రదేశంలో పడివున్నట్టుగా తోచింది. యాంత్రికంగా అతడు కుడిచేతితో తడుముతూ పరిసరాలను తెలుసుకో ప్రయత్నించాడు. వేళ్ళకు పదునుగావున్న ముళ్ళు గుచ్చుకున్నాయి. ఒక్క ఉదుటున చెయ్యి పైకెత్తాడు. కెవ్వున అరిచాడు. చేతినిండా రక్కసిముళ్లు గుచ్చుకున్నాయి.

ఒక్కసారిగా కళ్ళు తెరుచుకున్నాయి. నలువైపులా దృష్టి సారించాడు. ఏమీ కన్పించలేదు. నలువైపులా కాటుక పూసినట్టు చీకటి. ఎంత ప్రయత్నించినా అతని కళ్ళకు ఏమీ కన్పించలేదు.

తన శరీరం ఏదో చాలా బరువైన వస్తువుకింద వున్నట్టు అన్పించింది రాజదేవ్‌కు.

ఏమిటిది ? రాతిబండా ? రాతిబండకింద తనెలాపడిపోయాడు ? అసలు తను ఎక్కడున్నాడు ? ఇక్కడికి తను ఎలా వచ్చాడు? ఊహూ ! ఏమీ గుర్తురావడంలేదు. ఇది వాస్తవమా ? పీడకలా ? రాజదేవ్ లేచి కూర్చోవడానికి ప్రయత్నించాడు.

ఇదేమిటి తన కుడికాలు, మోకాలుదగ్గర విరిగిపోయిందా ? వెన్నెముక క్రింది భాగం విరిగిపోతున్నట్టుగా బాధ.

లేచి కూర్చోవాలనే ప్రయత్నం విరమించుకొన్నాడు.

తను చచ్చిపోయాడా ?

చచ్చిపోతే ఎలా ఆలోచించగలుగుతున్నాడు? తను చచ్చిపోలేదు. కాని మరణాసన్న స్థితిలో ఉన్నాడు. మృత్యుముఖంలో వున్నాడు.

ఇంతకూ తనెవరు?

తన పేరేమిటి?

తన పేరు...పేరు...ఆఁ రాజదేవ్ గదూ ? తను లలిత భర్తే గదూ? అవును! తను రాజదేవే!

మరి ఇక్కడ ఈ స్థితి ఎలా సంభవించింది? తను ఏదో దుర్ఘటనలో చిక్కుకున్నాడు.

మరోసారి కళ్ళు వెడల్పు చేసుకొని పరిసరాలను చూడటానికి ప్రయత్నం చేశాడు. ఒక్క వస్తువు కూడా లీలామాత్రంగానైనా కన్పించలేదు. గుచ్చిగుచ్చి చూశాడు. కళ్లు మూసీ తెరిచీ చూశాడు. అంతా చీకటి.

ఏమీ కన్పించదేం? తను...తను గుడ్డివాడైపోయాడా? దుర్ఘటనలో తన కళ్ళు పోయాయా? తన కళ్ళ వెలుగు ఆరిపోయిందా?

తను గుడ్డివాడైపోయాడనే భావం అతడి వెన్నెముకలోకి జర జర పాకింది. నిలువెల్లా కంపించిపోయాడు. భయంకరం. గుడ్డివాడిగా బ్రతకడంకంటే చావడమే మేలు. కుడిచేతి వేళ్ళను గుప్పెడుగా ముడిచి, అంతకుముందు ముళ్లు గుచ్చుకొన్నవైపుకు విసురుగా చెయ్యి విసిరాడు.

బాధతో కెవ్వున అరిచాడు.

రక్తం కారుతున్న చేతిని ముఖంపైగా ఎత్తి చూడడానికి ప్రయత్నించాడు. ముఖంమీద ఆకులు పడ్డాయి. రక్తపుబొట్లు పడ్డాయి. ముఖం

తుడుచుకోబోతుండగా చేతికున్న వాచీ రేడియం డయల్‌లో అంకెలు తళుక్కుమన్నాయి.

అరే! తను చూడగలుగుతున్నాడు. తన చూపు పోలేదు. తను గుడ్డివాడు కాదు.

ఆనందంతో ఉక్కిరిబిక్కిరై పోయాడు. ఆ ఆనందంలో శారీరిక బాధనూ, మృత్యు భయాన్నీ మర్చిపోయాడు.

మరోసారి పరిసరాల్ని తెలుసుకోవడానికి చూపులు నలువైపులా సారించాడు. తారు పులిమిన చిత్రపటంలా వుంది ప్రకృతి.

రాజదేవ్‌కు పూర్తిగా స్పృహ వచ్చింది.

ఒక భీకరారణ్యంలో, మృత్యువుకు చేరువుగా పడివున్నట్టు అర్థం చేసుకున్నాడు.

ఏమైంది తనకు? దుర్ఘటనకు గురి అయ్యాడా ?

తను అవసానదశలో వున్నాడా? మృత్యుదేవత కఠోరబంధంలో ఇరుక్కున్నాడా?

అసలు ఏం జరిగింది?

ఇక్కడికి తను ఎలా వచ్చాడు?

టైం ఎంతయిందో ?

చెయ్యి ముఖంపైగా ఎత్తి గడియారం చూశాడు. మూడు గంటలు కావస్తోంది. గడియారం పని చేస్తుందో లేదోనని అనుమానం వచ్చి చెవి దగ్గిరగా పెట్టుకొని శ్రద్ధగా విన్నాడు. గడియారం నడుస్తోంది.

తనమీదవున్న వస్తువు ఏమైవుంటుందా అని ఆలోచించసాగాడు. ఏదో పెద్ద కొండరాయి వున్నట్టు భావించాడు. ఎడంకాలు కదిలించాడు.

తేలిగ్గానే కదిలింది. పైకెత్తాడు. ఎడంకాలు పనిచేస్తోంది. కుడికాలు కదిలించబోయాడు. మోకాలునుండి తొడవరకు అమితమైన బాధకలిగింది. కాలు పైకి లేవడంలేదు. బరువుగా వుంది.

తన ఎడంకాలు పైకి లేచింది. కుడికాలు కదిలించలేకపోతున్నాడు. అంటే తనమీద బరువైన వస్తువు ఏదీ లేదు. కాలు విరిగి వుండాలి.

రాజదేవ్ లేచి కూర్చొనే ప్రయత్నం మానేశాడు.

గతాన్ని గుర్తు చేసుకోసాగాడు.

గతం తాలూకు చిత్రాలు సినిమా రీల్‌లా అతడి మనోనేత్రం ముందుకు వచ్చాయి......

రాజదేవ్ విమానంలో పయనిస్తున్నాడు. జపాన్ వెళ్తున్నాడు. జపాన్ వెళ్ళాలవే తన కోరిక నెరవేరుతుందని విమానం ఎక్కేంతవరకూ అతడికి నమ్మకం లేదు.

జపాన్ ప్రభుత్వం తనను ఆహ్వానించడం, పాస్‌పోర్టు తీసుకోవడం, విమానాశ్రయానికి వెళ్ళడం అంతా ఒక కలలా అన్పించింది.

రాజదేవ్ అనేక పదవులు నిర్వహించాడు. ఏ పదవిలో వున్నా నిజాయితీతో కష్టపడి పనిచేశాడు. అందువల్లనే పైపదవులకు వెళ్ళే అవకాశాలు లభించాయి. అతడికి మంచిపేరు కూడా వుంది. సామాన్య తెలివితేటలు వున్న వ్యక్తి కూడా కృషివల్ల రాణిస్తాడనే సత్యాన్ని రాజదేవ్ నిరూపించాడు. అయినా అతడి విదేశాలు వెళ్ళాలనే కోరిక చాలా కాలం నెరవేరలేదు.. అతడికి కుట్రలు చెయ్యడంరాదు. తిమ్మిని బమ్మిని చేసే తెలివితేటలులేవు. అందువల్ల పదవీ నిర్వహణలో అతడికి కొన్ని ఇబ్బందులు తప్పలేదు. ముఖ్యంగా విదేశాలు వెళ్ళే అవకాశాలు వచ్చినట్టే వచ్చి ఇట్టే జారిపోయేవి. చివరి నిముషంలో ఆ అవకాశాన్ని ప్రతిసారీ మరొకడు

కొట్టేసేవాడు. కుట్ర జరుగుతున్నట్టుగా రాజదేవ్‌కు అనుమానం కూడా వచ్చేదికాదు. ప్రతిసారీ అవకాశం తనకే వచ్చినట్లు భావించడం, చివరకు కుట్రతో మరొకడు ఆ ఛాన్సు కొట్టెయ్యడం మామూలు అయిపోయింది. అందువల్లనే విమానంలో ఎక్కేంతవరకూ అతడికి తను జపాన్ వెళ్ళగలననే నమ్మకం కుదర్లేదు.

ఈ సారి పోటీకి ఎవరూ రాకపోవడంవల్లనే ఆ ఛాన్స్ రాజదేవ్‌కు లభించింది. దొరక్క దొరక్క, చిరకాలంగా ఎదురు చూసిన అవకాశం దొరికింది. అందువల్లనే భార్యకు జబ్బుగావున్నా ప్రయాణం అయ్యాడు. మనసు బరువుగానే వుంది. ఈ ఛాన్సువదులుకుంటే మళ్ళీ ఈ జన్మకు విదేశాలు వెళ్ళే అవకాశం తనకు లభించదని అతడికి తెలుసు. అతడి భార్యకూడా అడ్డుచెప్పలేదు ఎత్తిపొడుపు మాటలతో అతడ్ని కించపర్చలేదు. సాధారణంగా లలిత భర్తతో వ్యంగ్యంగాగాని మాట్లాడదు.

ఆమె వ్యంగ్యోక్తులు అతడి మనసును జల్లెడలా చేశాయి.

"నన్ను వదిలించుకోవడానికి చూస్తున్నావ్ గదూ ? అసలు నేను బ్రతికి వుండటమే నీకు ఇష్టంలేదు. ఎప్పుడు చస్తుందా, పీడ విరగడౌతుందా అని నా చావుకు ఎదురు చూస్తున్నావు. అసలు నీ దృష్టిలో నేను ఒక పురుగును..." లలిత భర్తతో ఈ ధోరణిలో తప్ప మాట్లాడదు

రాజదేవ్ ప్రయాణం అయి భార్య మంచం దగ్గిర మౌనంగా నిలబడ్డాడు.

ఆమె అతడి ముఖంలోకి చూస్తూ వుండిపోయింది. రోగంతో క్షీణించిపోయిన ఆమె ముఖంలో గాంభీర్యం కన్పించింది. ఆమె కళ్లల్లో, పెదవులపైన, వేదనాభరితమైన హాసరేఖ లీలగా కదిలింది.

లలిత మౌనంగా తన కుడి చేతిని ముందుకు చాచింది. రాజదేవ్ ఆమె చెయ్యి అందుకొన్నాడు.

"నా గురించి బాధపడకండి. నేను బాగానే వున్నాను. ఉత్తరాలు రాస్తూ వుండండి. అవే నాకు మందుగా పనిచేస్తాయి" అన్నది లలిత.

రాజదేవ్‌కు ఏం మాట్లాడాలో తెలియలేదు. భార్య ముఖంలోకి చూస్తూ వుండిపోయాడు.

అతడి అంతరాంతరాల్లో ఏదో కదిలినట్టయింది. క్షణకాలం, ప్రయాణం మానెయ్యాలనిపించింది.

ఏమేమో చెప్పాలనిపించింది. చెప్పలేకపోయాడు. ఎంతోకాలంగా గుండెలో గూడుకట్టుకొనివున్న ఆవేదనను శబ్దాల్లో బంధించి ఆమెముందు వుంచాలనిపించింది. కాని ఒక వాక్యం కూడా మాట్లాడలేకపోయాడు. తను నోరు విప్పితే ఆమె అగ్నిపర్వతంలా బద్దలౌతుందని అతడికి తెలుసు. అప్పుడు ఆమెలో కన్పిస్తున్న ఆ ప్రశాంతత వెనక ఎంత అగ్ని వుందో అతడికి బాగా తెలుసు. ఆ ప్రశాంతతను భగ్నం చెయ్యడం ఇష్టం లేకనే అతడు నోరు విప్పలేదు.

ఆ భార్యాభర్తల మధ్య ఆ అడ్డుగోడ ఎప్పుడు లేచిందో వారికే తెలియదు. కాలక్రమేణా పడిపోవలసిన ఆ గోడ రోజురోజుకూ దుర్భేద్యంగా తయారైంది.

ఇద్దరు వ్యక్తుల మధ్య అనుమానం తలెత్తకూడదు ఒకరిమీద ఒకరికి నమ్మకం పోయాక, వారిద్దరి మధ్య వున్న బంధం ఎలాంటిదైనా కృత్రిమంగా తయారౌతుంది. కృత్రిమమైనది ఏదీ కూడా అందంగా వుండదు. మధురమైన బంధంకూడా సౌందర్యరాహిత్యంలో అసహజంగా మారుతుంది. కృత్రిమబంధం చిరాకునూ, విసుగునూ కలిగిస్తుంది. సరళంగా, సాఫీగా నడుస్తున్న జీవితం ఒక్కసారిగా కుంటిదైపోతుంది. అలాంటి బంధంలో ఇద్దరు వ్యక్తులు ఒక్కరు కాలేరు. ఇద్దరుగా, విడివిడి

గానే మిగిలిపోతారు. ఆ పరిస్థితుల్లో ఇద్దరిలోనూ అహంకారం తల ఎత్తుతుంది.

రాజదేవ్ దుస్సహమైన జీవితాన్ని గడుపుతూ వచ్చాడు. అయినా అతడు ఆ జీవితాన్ని తెంచుకొని పారిపోవాలని భావించలేదు.

రాజదేవ్ ప్రేమకోసం, స్నేహంకోసం, ఆత్మీయతకోసం తహ తహలాడిపోయాడు.

తన కష్టసుఖాలను పంచుకొనే హృదయంకోసం తల్లడిల్లిపోయాడు. ఒకనాడు తనకు జీవితంలో ఏమీ లేదని బాధపడ్డాడు. అన్నీ లభించాక ఆత్మీయతకోసం, ప్రేమకోసం విలవిల్లాడాడు.

ఇంటా, బయటా ఎన్నో బాధల్ని, అవమానాల్ని భరించాడు. అయినా అతడు ఏ క్షణంలోనూ చావును కోరుకోలేదు.

ఇప్పుడు? ఇప్పుడు తనకు లలిత కావాలి. లలితకు తను కావాలి.

రాజదేవ్‌కు విమాన యాత్ర గుర్తొచ్చింది అతడి ముందున్న సీట్లలో ఒక యువతీ, యువకుడు కూర్చుని వున్నారు. వారిని చూసి నవదంపతులై వుంటారని భావించాడు. వాళ్ళను చూస్తుంటే వాళ్ళిద్దరూ ఒకరికోసం ఒకరు పుట్టినట్టుగా అన్పించింది.

యువతి అందమైన పెద్ద పెద్ద కళ్ళతో యువకుడ్నే చూస్తోంది. ఆ కళ్ళు వింతకాంతితో మెరిసి పోతున్నాయి. ఆమె ఎడమ చెయ్యి వెనక నుంచి సీట్ల అంచుల మీదుగా సాగి యువకుడి భుజాలమీద వున్నది. భర్త మీదకు వంగి గుస గుస మాట్లాడుతోంది సన్నగా. సన్న జాజులు రాలు తున్నట్టుగా నవ్వుతోంది. ఆ యువకుడు ఆమె ముఖంలోకి మత్తుగా చూస్తున్నాడు.

వాళ్ళను చూస్తుంటే, ఏ క్షణంలోనైనా వాళ్ళిద్దరూ బిగికౌగిలిలో కరిగి పోవచ్చుననిపించింది రాజదేవ్‌కు. అంతమంది మధ్య వాళ్ళు ఆ

పని చెయ్యలేరు. యువకుడు యువతి కుడిచేతిని తన రెండు చేతులతో గోముగా నిమురుతున్నాడు. రాజదేవ్ అలా చూడటం మంచిది కాదనుకొంటూనే వాళ్ళను పరిశీలనగా చూస్తున్నాడు.

"ఎప్పటికీ నీ ప్రేమ ఇలాగే వుంటుందా లేక..." ఆ యువతి యువకుడ్ని సన్నగా చిన్నగా అడిగింది.

ఆ వాక్యం రాజదేవ్ గుండెమీద సుత్తిదెబ్బలా తగిలింది.

లలిత......

లలిత రాజదేవ్ ఇంటికి, ఎదురుగా వున్న ఇంట్లో ఆమె అన్న ముఖేశ్‌తో వుండేది. అతడు కూడా తన అన్న పుష్కర్ దగ్గర వుండి ఎం.ఏ. చివరి సంవత్సరం పరీక్షలు వ్రాస్తున్నాడు.

లలిత బి.ఏ. చదువుతున్నది.

పగలంతా రాజదేవ్ ఇంటిముందున్న వటవృక్షం క్రింద కూర్చుని చదువుకొనేవాడు.

ఒకరోజు చెట్టుక్రింద కూర్చుని కళ్లు మూసుకొని హిస్టరీకి సంబంధించి ముఖ్యమైన సంవత్సరాలనూ, తేదీలనూ మననం చేసుకుంటున్నాడు. ఒక్కసారి మధురమైన కంఠస్వరం విన్పించింది. అతని హృదయం పులకించింది. ఆ స్వరం అతడికి ఎంతోకాలంగాఊహ తెలిసినప్పటినుంచీ విన్నట్టుగా అన్పించింది. తృళ్ళిపడి కళ్ళు తెరిచాడు.

సన్నగా అందంగా వున్న ఆడపిల్ల కన్పించింది. ఆమెకు పదహారు పదిహేడేళ్లుండవచ్చు.

"మీ దగ్గర హిమాలయ పత్రిక వుందా?" ఆ పిల్ల అడిగింది.

రాజదేవ్ ఆశ్చర్యంలో తల మునకలైపోతూ ఆమెను చూస్తూ వుండిపోయాడు.

ఆమె ఎవరు ? ఎక్కడ్నుంచి వచ్చింది. ఏమంటున్నది? అతడికి అయోమయంగా వుంది. ఆ కంఠం...జన్మ జన్మాంతరాలనుంచి వింటూ వస్తున్న అనుభూతి కలిగింది. ఆ కంఠస్వరం మంత్రంలా నాభిమండలానికిచేరి సుషుప్త కుండలిని కదిలించిన అనుభూతి...ఆ కఠస్వరంలోనే కోరికలన్నీ ఏకాకారం చెందిన అనుభూతి...మంత్రముగ్ధుడిలా ఆమెను చూస్తూ వుండిపోయాడు.

ఆమెను అలా ఎంతసేపు చూస్తూ వుండిపోయాడో అతడికే తెలియదు.

"హిమాలయ పత్రిక, ఈ నెలది, మీదగ్గరుంటే మా అన్నయ్య తీసుకురమ్మన్నాడు."

అతడు తృళ్ళిపడ్డాడు.

అంతసేపు ఆమెను అలా చూస్తూవుండిపోయినందుకు తడబాటు చెందాడు. దొంగతనం చేస్తూ పట్టుబడిపోయినట్టుగా అన్పించింది.

"ఆఁవుంది ఇస్తాను. కూర్చోండి." అంటూ హడావిడిగా లోపలకు వెళ్ళాడు.

పత్రిక తీసుకొని బయటికి వచ్చాడు. నిల్చుని వున్న ఆమెతో "అయ్యో మీరు నిల్చునే వున్నారా!" నొచ్చుకుంటూ అన్నాడు.

కుర్చీలో పుస్తకాలు చూస్తూ "సారీ ! నేను పుస్తకాలు కుర్చీలో పెట్టి వెళ్ళాను." అన్నాడు.

ఆ పిల్ల కిలకిల నవ్వింది-జలతరంగిణి మోగినట్టుగా అన్పించింది. రాజదేవ్ శరీరంలో అణువణువూ అపూర్వమైన అనుభూతితో పులకించింది.

"అలాగే పట్టుకొని వుండిపోయారేం ! ఇలా ఇవ్వండి, ఇందులో రవీంద్రనాధుని "తాజమహల్" కవిత అనువాదం వచ్చిందట" చాలా బాగుంటుందని మా అన్నయ్య చెప్పాడు, మీరు చదివారా ?"

రాజదేవ్ తృళ్ళిపడ్డాడు. యాంత్రికంగా పత్రిక అందించాడు. యువతి పత్రిక అందుకొని, రెండు చేతూలూ జోడించి "నమస్కారం" అని చరచరా రోడ్డుదాటి తన ఇంట్లోకి వెళ్ళిపోయింది.

రాజదేవ్ ఆమె వెళ్ళిన వైపే చూస్తూ వుండి పోయాడు. ఆమె నవ్వు మధుర ఆలాపనలా అతని చెవుల్లో మెలగుతూ వుంది చిత్రమైన ఆ మధుర అనుభూతి మనసును చుట్టుకొనే వుంది. అలా ఎంతసేపు నిల బడిపోయాడో అతడికే తెలియదు. పూర్తిగా తనను తాను మర్చిపోయిన స్థితిలో వుండిపోయాడు.

కుర్చీలో కూర్చున్న తర్వాత తను ఆ యువతి పేరు కూడా అడగలేదనే విషయం గుర్తొంచింది. ఆమె మీదనుంచి మనసు మళ్ళించు కోవడానికి హిస్టరీ తేదీలను గుర్తుచేసుకోవడానికి ప్రయత్నించసాగాడు. ఎంత ప్రయత్నించినా గుర్తురావడం లేదు. బుర్రనిండా ఆమె ఆలోచనలే మనసునిండా ఆమె రూపమే. తల విదిలించుకున్నాడు. మళ్లీమళ్లీ విదిలించుకొన్నాడు. బుర్రను తినేస్తున్న ఆలోచనల్నీ, మనసులో తిష్ఠ వేసిన ఆమె రూపాన్నీ బయటికి నెట్టేసే ప్రయత్నంతోనే తలవిదిలించు కున్నాడు. కాని ప్రయత్నించిన కొద్దీ ఆమెరూపం ఇంకా స్పష్టంగా మనసుమీద తిష్ఠవేసింది. ఆలోచనల తీవ్రత పెరిగింది.

ఆ రాత్రంతా నిద్రలేదు. కల్పనాలోకంలో విహరిస్తూ తనకు తానే అనేక ప్రశ్నలు వేసుకొన్నాడు.

ఇదేనా ప్రేమంటే ?

నారీరూపాన్ని మాయగా వర్ణిస్తారు ఇందుకేనా ?

ఇది మాయ ఎలా అవుతుంది ?

మాయ అంటే భ్రమేకదా ?

ఇది భ్రమా ? కాదు. కానేకాదు.

కొద్దిక్షణాల భావసమాధి జన్మజన్మాంతరాలను పరిచయం చేసింది.

ఏదో పొందాలనే లాలస లేదు. పరిపూర్ణ సమర్పణ చేయాలనే కోరిక మాత్రం వుంది ఇదేనా ప్రేమ? నిజమైన ప్రేమలో స్వార్థం వుండదంటారు. త్యాగం మాత్రమే వుంటుందంటారు.

అంటే...అంటే తను ఆమెను ప్రేమిస్తున్నాడు. తన ప్రేమకు త్యాగం మాత్రమే తెలుసు. అందులో స్వార్థం లేదు.

ఆమె రూపం అతడి చేతన, అర్థచేతన, అవచేతనలలో నిండిపోయింది. ఆ రూపాన్ని అతడినుంచి ఏ శక్తి విడదీయ లేదన్నంతగా అతడి మనసు పెనవేసుకు పోయింది

ఆ రోజునుంచి చెట్టు కింద కుర్చీ వేసుకుని కూర్చున్నంతసేపూ ఆమెకోసం ఎదురుచూసేవాడు. కళ్ళయితే పుస్తకంలోని పుటల మీదనే వుండేవి. చెవులు ఆమె అడుగుల చప్పుడు వినడానికి తహతహలాడేవి.

ఈ విధంగా కొన్ని రోజులు గడిచిపోయాయి. అయినా ఆమె రాలేదు. నెల రోజులు గడిచిపోయాయి ఆమె జాడ లేదు.

ఎందుకు ఆమె రాలేదు. కనీసం పత్రిక తిరిగివ్వడానికైనా రాలేదు. కారణం? ఆమె ఊళ్ళో లేదా? జబ్బుపడిందా? ఏమైంది ఆమెకు?

వాళ్ళ అన్నతో తనకు పరిచయంలేదు. ఇరుగు పొరుగు వాళ్ళను ఎలా అడగడం?

రాజదేవ్‌కు అభిమానం ఎక్కువ. అది అహంభావం వరకూ ఎదిగింది. అందువల్ల ఇరుగు పొరుగు వాళ్ళతో కూడా పెద్దగా మాట్లాడే వాడు కాడు.

ఎదురింట్లో డెప్యూటీ కలెక్టర్ వుంటున్నాడని మాత్రం విన్నాడు. ఎప్పుడూ అతడ్నిగురించి పట్టించుకోలేదు. అతడి చెల్లెలే ఆ యువతి.

డెప్యూటీ కలెక్టర్ బయటకు వెళ్ళడం, ఇంటికి రావటం చాలా సార్లు చూశాడు.

"మహాశయా ? మీ చెల్లెలు ఏమైంది ? నా పత్రిక తిరిగి ఇవ్వ లేదు." అని అడగాలనుకునేవాడు. కాని ధైర్యం చాలేదికాదు.

ఒక రోజు బజార్లో పాన్ దుకాణం దగ్గర నిల్చున్న రాజదేవ్‌కు ఎదురుగా వున్న అద్దంలో డెప్యూటీ కలెక్టరు కన్పించాడు. గిరునతిరిగి పలకరింపుగా చిరునవ్వు నవ్వాడు.

"నాపేరు ముఖేష్" చేతులు జోడించి అన్నాడు డెప్యూటీ కలెక్టర్.

రాజదేవ్ సిగ్గుపడ్డాడు. న్యాయంగా తనే ముందు నమస్కరించి వుండాల్సింది అనిపించింది. ప్రతి నమస్కారంచేస్తూ 'నా పేరు రాజదేవ్' రండి, పాన్ తీసుకోండి" అన్నాడు.

"థ్యాంక్స్, చాలాకాలంగా మీతో మాట్లాడాలనుకుంటూనే మాట్లాడ లేక పోయాను. బొత్తిగా తీరిక చిక్కని ఉద్యోగం. మా లలిత మీ హిమాలయ పత్రిక తెచ్చింది తెలుసుగా లలిత మా చెల్లెలు. క్షమించండి. పత్రికను వెంటనే తిప్పి పంపించలేక పోయాను. నేను పంపిస్తానంటే లలిత వొప్పుకోలేదు. మొండిఘటం. తనే ఇస్తానని పట్టుపట్టింది."

"అయ్యో దానికేముందండీ? తొందరేంలేదు. నిదానంగానేఇవ్వండి" అన్నాడు అతడికి ఎంతో ఆనందంగా వుంది. ముఖ్యంగా లలిత తనే తీసు కెళ్ళి పత్రిక ఇస్తానని పట్టు పట్టడం......అతడి గుండెలో ఆనందం ఉప్పొంగింది.

"ఆ పత్రిక నేను ఎప్పుడో చదివేశాను. ఆలస్యానికి కారణం లలిత ఆకస్మిక అస్వస్థత." అన్నాడు ముఖేశ్ పాన్ నములుతూ.

రాజదేవ్‌కు వొక్కసారి నెత్తిమీద బలమైన దెబ్బ తగిలినట్టు దిమ్మెరపోయాడు. ఏదో అడగాలను కొన్నాడు. గొంతు పెగల్లేదు. పెద వులు తడారి పోయినట్టయింది. రకరకాల భయాలతో గుండె వేగంగా

కొట్టుకోసాగింది. ఎంతో ప్రయత్నంమీద నిలదొక్కుకొన్నాడు. ఏమైంది? ఇప్పుడు ఎలా వుంది? సీరియస్ కాదుకదా? ఇంకా ఏదో అనబోయి అకస్మాత్తుగా ఆగిపోయాడు.

తను హద్దుతప్పి మాట్లాడటంలేదు కదా? ముఖేశ్ తనను అపార్థం చేసుకొన్నాడా ?

ముఖేశ్ నవ్వుతూ అన్నాడు-"టైఫాయిడ్. ముందు తెలుసుకోలేకపోయాం. చాలా భయపడిపోయాం. టైఫాయిడ్ అని నిర్ధారించాక సరైన చికిత్స జరిగింది. మొదట జబ్బు కనుక్కోకపోవడంవల్ల తప్పు చికిత్స జరిగింది. అందువల్ల కోలుకోవడానికి చాలాకాలం పట్టింది. మరో పదిపదిహేను రోజులు మంచంలో పడివుండకతప్పదు. చాలా నీరసించిపోయింది నేనే వచ్చి రెండు మూడు రోజులక్రితం మీ పత్రిక ఇచ్చేద్దామని బయలుదేరాను. కాని లలిత తను తెచ్చింది కనక, తనకు తగ్గాక తనే తిరిగి ఇస్తానని అన్నది. అందుకే ఇవ్వలేదు. మీరొకసారి మా ఇంటికి రాకూడదూ?"

"పత్రిక తిరిగి ఇవ్వడం పెద్ద సమస్య కాదు. నేను ఇవ్వాళే వస్తాను లలితగార్ని చూడడానికి" అన్నాడు.

రాజదేవ్‌కు ఇప్పుడే మీతోనే వస్తానని అనాలని వుంది. కాని ముఖేశ్ అప్పుడే ఇంటినుంచి బయటికి బయలుదేరడం అతడు చూశాడు. అందువల్ల ఆ మాట అనలేకపోయాడు.

"వీలుంటే ఇవ్వాళే లలితగార్ని చూట్టానికి వస్తాను. ఆమె జబ్బు గురించి విన్నాక నాకు బాధగా వుంది. నావల్ల ఏదైనా సహాయం కావాలంటే సంకోచించక చెప్పండి. ఈ రోజుల్లో డాక్టర్లు చాలా బాధ్యతారహితంగా ఉంటున్నారు. రోగ నిర్ధారణ చెయ్యకుండా చికిత్స ప్రారంభిస్తారు. పాట్నాలో డాక్టర్లకు ముఖ్యంగా తమ వృత్తిపట్ల శ్రద్ధ లేదు.

ఆసుపత్రులలో పనిచేస్తుంటారు. కాని చికిత్స మాత్రం తమ ప్రైవేటు క్లినిక్స్‌లోనే చేస్తారు. కేవలం డబ్బు సంపాదనే..."

"అలాంటిదేం కాదు. లలితకు చికిత్స చేసిన డాక్టరు మాకు బంధువు బాగా కావాల్సినవాడు. ప్రారంభంలో టెంపరేచర్ ఎక్కువ లేదు. పైగా దగ్గు ఒకటి. ఫామిలీ డాక్టర్లతో ఇదే ఇబ్బంది. ముందు జబ్బును సీరియస్‌గా తీసుకోరు. అందువల్లనే మా డాక్టరు కూడా ఏదో మామూలు జ్వరం అనుకొన్నాడు. టైఫాయిడ్ అని తెలుసుకొని చాలా బాధపడ్డాడు. పేరున్న డాక్టరే. మీరు కూడా అతని పేరు వినే వుంటారు. డాక్టర్ విమల్‌నాథ్".

"ఆయన పేరు వినకపోవడమేమిటి? అతను రోగనిర్ధారణ చెయ్యలేకపోవడం ఆశ్చర్యంగానే వుంది. మీరిప్పుడు ఇంటికి వెళ్తున్నారా?" కాదనితెలిసీ అడిగాడు రాజదేవ్.

"లేదు. మురాదాపూర్ వెళ్తున్నాను. రెండు గంటల్లో తిరిగొస్తాను. మీరు ఇంటి దగ్గరే వుంటారా?"

వాస్తవానికి రాజదేవ్ ఇంటినుంచే తోచక పాన్‌షాపుకు వచ్చాడు. అక్కడి నుంచి తిరిగి ఇంటికే వెళ్ళాలి.

కాని "యూనివర్సిటీలో కాస్త పనివుండి బయలుదేరాను. త్వరలోనే తిరిగి వస్తాను. బహుశా మీరు వచ్చేసరికి ఇంటి దగ్గరే వుంటాను." అనేశాడు.

ముఖేష్ చూస్తుండగానే ఇంటివైపుకుకాకుండా రెండోవైపుకు నడవ సాగాడు. అబద్ధం చెప్పినందుకు మనసు అదోలా అయింది.

తను అబద్ధం ఎందుకు చెప్పాడు?

పాన్‌కోసం వచ్చాను - ఇంటికే వెళ్తున్నానంటే తన గౌరవం పోతుందా? ఎందుకలా అనాలనిపించింది? తన మనసులో దొంగ వున్నాడు. అందుకే అబద్ధం ఆడాడు.

రాజదేవ్ లలితను చూసిన ప్రథమదృష్టిలోనే తన హృదయాన్ని పారేసుకున్నాడు. మరొకరికొరకు సంపూర్ణ సమర్పణ చెయ్యాలనే ఆరాటమే ప్రేమ అయితే రాజదేవ్ లలితను ప్రేమిస్తున్నాడనే చెప్పాలి. రాజదేవ్ లలిత ప్రేమపాశంలో గట్టిగానే ఇరుక్కుపోయాడు.

అతడుగానీ, ఆమెగానీ లేని జీవితం నిరర్థకం అన్పించడం, ఆ ఆకర్షణలోనే జీవితానికి ఓ అర్థం ఏర్పడిందనే అనుభూతి కలగడం, స్మృతిమాత్రంచేత హృదయం సాగరంలా ఉప్పొంగడం, ఆ అస్తిత్వంలో విలీనం అయిపోయి తన అస్తిత్వాన్నే మర్చిపోగలగడం శుద్ధ, సహజ ప్రేమ యొక్క లక్షణాలు.

రాజదేవ్ తను లలితను ప్రేమిస్తున్నట్టు ముఖేశ్ పసికట్టకుండా వుండడానికి ప్రయత్నించాడు. ముఖేశ్‌కు ఆ విషయం తెలిస్తే లలితకు ఏదైనా హాని జరుగుతుందనే అతడి భయం. ఏది ఏమైనా ముఖేశ్ పరిచయం, అతడు తనను వారి ఇంటికి ఆహ్వానించడం, రాజదేవ్‌ను ఆనందాంబుధిలో ముంచేసింది.

ఆలోచిస్తూ రాజదేవ్ పాట్నా కాలేజీ ముందుకెళ్ళి నిలబడ్డాడు. ఆ రోజుల్లో పాట్నా కాలేజీ ఎదురుగా "పింటూ హోటల్" వుండేది. ఆ హోటల్లో నలుగురైదుగురు విద్యార్థులు టీ తాగుతూ కన్పించారు. వాళ్ళందరికీ రాజదేవ్‌తో పరిచయం వుంది. వారి దృష్టిలో పడటం ఇష్టం లేక గిర్రున తిరిగి మఛువాటోలీ వైపుకు వేగంగా నడకసాగించాడు.

కల్పనాలోకంలో విహరిస్తూ నడుస్తున్న రాజదేవ్‌కు తన కాళ్ళకు రెక్కలు వచ్చినట్టుగా అన్పించింది. రకరకాల ఆలోచనలతో బుర్ర నిండిపోయింది.

ఇవాళ తను లలితను చూస్తాడు. ఆమె ఆరోగ్యం గురించి పరామర్శిస్తాడు. ఆమె కిలకిల నవ్వుతుంది. మనిషి సుఖంగా బ్రతకడానికి ఆరోగ్యం ఎంత ముఖ్యమైందో వివరిస్తాడు. ఆరోగ్య సూత్రాలమీద చిన్న పాటి ఉపన్యాసం దంచుతాడు. తన దగ్గర అనేక పత్రికలున్నయ్. స్పెషల్ ఇష్యూస్, ముఖ్యమైన వ్యాసాలు వచ్చిన కాపీలు పట్టుకెళ్ళి ఆమెకు ఇస్తాడు. ఈ విధంగా ఆమె మధ్యా తన మధ్యా రాకపోకలు పెరుగుతాయి. ఆఁ తను మర్చిపోయాడు. తాను రోగిని చూడబోతున్నాడు. పళ్లు తీసుకెళ్ళాలి.

ఆ ఆలోచన రాగానే పళ్ళ దుకాణాలకేసి నడిచాడు. యాపిల్ పళ్లూ, సీడ్స్‌లేని ద్రాక్ష పళ్లూ కొన్నాడు.

అతనికి ఆనందంగానూ వుంది అశాంతిగానూ వుంది. చిత్రమైన మానసిక స్థితి.

లలితను గురించి రకరకాలుగా ఆలోచిస్తూ కల్పనా లోకంలో విహరిస్తున్న రాజదేవ్‌ను, అతడి అంతరాంతరాల్లో నుంచి ఎవరో ప్రశ్నించి నట్టయి తృళ్లిపడ్డాడు.

"నిన్నటివరకూ లలిత ఎవరో నీకు తెలియదు. ఒక్కసారి చూశావు. అంతలోకే ఇంత ప్రేమా ? అది ప్రేమ కాదు. వ్యామోహం. లాలస. కోరిక. వాటినే నువ్వు పవిత్ర ప్రేమగా భ్రమపడ్తున్నావ్ నీకు కావాల్సింది, ఆమె ఎర్రటి పెదవులు. అందమైన శరీరం. ఆమె కిలకిల నవ్వు నీలో నిద్రిస్తున్న పశువును తట్టి లేపింది. అది ప్రేమకాదు. కామం. వ్యామోహం." లోపల నుంచి ఎవరో అరుస్తున్నారు.

"ఛీ, ఛీ నువ్వు పొరపడ్తున్నావ్. నాకు కావాల్సింది ఆమె శరీరం కాదు. ఆ మాటకొస్తే ఆమె రూపాన్ని పూర్తిగా నేను చూడనే లేదు. బహుశా ఆమె అందగత్తె కాకపోవచ్చు. ఆమె అస్తిత్వం నాకు జన్మజన్మలబంధాన్ని దేన్నో గుర్తుచేసింది. మేమిద్దరం వేరువేరు కాదనీ, శబ్దం-అర్థంలా విడదీయలేని బంధంలో వున్న ఒకే అస్థిత్వమనీ అన్పించింది. "వాగర్థావివ సంపృక్తౌ...కాళిదాసు పార్వతీ పరమేశ్వరులను వర్ణించినట్టే అనుభూతిని పొందాను. అది ప్రేమకాదా? ఇందులో నిమగ్నత వుంది, నిష్ఠ వుంది. కాని లోభితనం లేదు. నాకు నా అస్థిత్వాన్ని కోల్పోవాలని వుంది. ఇది ప్రేమ కాకపోతే మరేమిటి? మనసులోనివాడు మనసులోనే సమాధానం ఇచ్చాడు..."

"రాజదేవ్. పన్నెండయింది. స్టీమర్ టైం అవుతోంది" అన్న పుష్కర్ స్వరం రాజదేవ్‌ను ఒక్కసారిగా ఆకాశం నుంచి భూమిమీద పడేసింది.

ఆలోచనల్లో మునిగిపోయివున్న అతడికి ఇంటికి వచ్చినట్టుగా తెలియలేదు. అన్న ముఖంలోకి చూశాడు. అతడు ఆదుర్దాగా కన్పించాడు. తనకోసమే నిరీక్షిస్తున్నట్టు తెలుసుకొన్నాడు.

పుష్కర్ పాట్నాలో యస్.డి ఓ. ఆఫీసులో గుమాస్తాగా పని చేస్తున్నాడు. ఆయనకు ఇద్దరు కొడుకులు, ముగ్గురు కుమార్తెలు వున్నారు. పెద్ద ఆడపిల్లలిద్దరికీ పెళ్ళిళ్ళయ్యాయి. మూడో పిల్లకు పెళ్ళి చెయ్యాల్సివుంది. పెద్దకొడుకు లాల్‌నారాయణ గ్రామంలో పుష్కర్ తల్లిదండ్రుల దగ్గర వుండి మిడిల్‌స్కూల్లో చదువుతున్నాడు. చిన్నవాడు మొదటి క్లాసులో వున్నాడు. వాడిపేరు ప్రమోద్..

పుష్కర్ పిసినారివాడు. బియ్యం, గోధుమపిండి వగైరా వంటకు కొలిచి ఇస్తాడు. తిండి ఖర్చు పెరుగుతుందేమోనని జాగ్రత్త వహిస్తాడు. రాజదేవ్ కేవలం భోజనంమాత్రం చేస్తాడు. భోజనానికి సరిపడ బియ్యం, గోధుమలూ వగైరా గ్రామం నుంచి తండ్రే పంపిస్తాడు. రాజదేవ్ ఫీజులకూ, పైఖర్చుకు తండ్రి డబ్బు పంపిస్తాడు. కూరలుమాత్రం పుష్కర్ కొంటాడు.

రాజదేవ్ చేతిలో పళ్లబుట్ట చూసి పుష్కర్ కనుబొమలు ముడిపడ్డాయి.

"ఇన్ని పళ్లు ఎందుకుకొన్నావ్?" తీవ్రంగా వుంది అతడి కంఠస్వరం.

ఓ క్షణం రాజదేవ్ తడబడ్డాడు. వెంటనే తేరుకొని "నేను కొనలేదు. ఒక స్నేహితుడు ఇచ్చాడు" అన్నాడు.

"అలాగా? సరే! త్వరగా తయారవు."

రాజదేవ్‌కు అన్న హడావిడి అర్థంగాక విస్మయంగా చూశాడు.

"ఇంటినుంచి టెలిగ్రాం వచ్చింది. అమ్మకు జబ్బుగా వుందట. చాలా సీరియస్‌అట. బహుశా ఆమె బ్రతకక్కపోవచ్చు. త్వరగా బట్టలు సర్దుకో. స్టీమర్ టైం అయింది."

రాజదేవ్ ముఖంలో కత్తివేటు నెత్తురు చుక్కలేదు.

అతడికి తల్లి అంటే అమితమైన ప్రేమ.

తల్లిని వదిలి గ్రామంనుంచి వచ్చాక ఐదారు రోజులు అతడికి ఏదోగా అన్పిస్తుంది. తల్లి ప్రతిక్షణం గుర్తొస్తుంది. ఆమెకు రాజదేవ్ అంటే చాలా ప్రేమ. గ్రామంనుంచి బయలుదేరే ప్రతిసారీ "నాయనా జాగ్రత్త. బాగా చదువుకొని మన వంశ గౌరవాన్ని నిలబెట్టు" ఆరోగ్యం జాగ్రత్త." అనేది.

గ్రామంలో అతడికున్న ఆకర్షణలు రెండు. ఒకటి తల్లి, రెండు పుష్కర్ చిన్న కొడుకు ప్రమోద్ ఇద్దరు చెల్లెళ్లు వున్నారు. కాని వాళ్లు రాజదేవ్‌తో కలవరు. అడిగినదానికి సమాధానంచెప్పి వెళ్ళిపోతారు. పుష్కర్ పెద్దకొడుకు లాల్‌నారాయణ్ ఊళ్లో పిల్లలతో కలిసి అల్లరి చిల్లరగా తిరుగుతూ వుంటాడు. సరిగా స్కూలుకుకూడా వెళ్ళడు.

రాజదేవ్ పెద్దన్న పేరు పశుపతినాథ్. అమాయకుడు. ఇంటర్ పాసయి గ్రామం వెళ్ళి తండ్రి దగ్గరే వుండిపోయాడు. అతడికి నాటకాలంటే ఇష్టం. హార్మోనియం, డోలక్ వాయిస్తాడు. పెళ్లయిన తొమ్మిదేళ్ల తర్వాత భార్య చనిపోయింది. వ్యవసాయపు పనులంటే అతడికి బొత్తిగా గిట్టదు. భార్య పోయాక పూర్తిగా నాటకాలలో, పాటలలో మునిగి పోయాడు. ఇంటి విషయాలు అసలు పట్టించుకోడు.

అంతవరకూ కల్పనా లోకంలో విహరించిన రాజదేవ్ అన్న చెప్పిన వార్తవిని చాలా బాధపడ్డాడు. అంతవరకూ అతడు విహరించిన ఆ అందాల లోకంలో అంతా ఆనందమయమే. దుఃఖం లేదు. విచారం లేదు. అదొక సౌందర్యంతో నిండిన సామ్రాజ్యం. ఆ సామ్రాజ్యానికి అతడే రాజు.

భగవంతుడి లీలలు చాలా చిత్రంగా వుంటాయి. కొద్ది క్షణాల క్రితం తను ఎంత ఆనందంగా వున్నాడు? ఇంత దుఃఖం తనకోసం ఎదురుచూస్తోందని తెలియదు.

ప్రేమా – కర్తవ్యం. కర్తవ్య పాలనలో మనిషి ఒకోసారి కుంగి పోతాడు. ఒకోసారి దైవత్వాన్ని పొందుతాడు.

ఆలోచిస్తూ బట్టలు సర్దుకొని ప్రయాణానికి సిద్ధం అయ్యాడు రాజదేవ్.

అన్నతో రిక్షాలో కూర్చున్నాడు.

లలిత గుర్తొచ్చింది.

ముఖేశ్ ఆమెకు తను కలిసినట్టు చెబుతాడు. తను ఆ సాయంత్రం వస్తున్నట్టు కూడా చెప్తాడు. లలిత తనకోసం ఎదురు చూసి నిరాశ చెందుతుంది.

తన తల్లి పరిస్థితి ఎలా వుందో? ఎంత కాలం గ్రామంలో వుండి పోవాల్సి వస్తుందో?

లలిత బహుశా తనను నమ్మతగిన వ్యక్తి కాదని భావిస్తుందేమో?

# 2

రాజదేవ్ తల్లి చనిపోయింది శ్రాద్ధకర్మలు పూర్తి అయ్యాక పాట్నా బయలుదేరాడు.

రిక్షాలో ఇంటిముందు దిగాడు. ఎదురింటి వరండాలో ముఖేశ్ నిల్చుని వున్నాడు రాజదేవ్ అతని దగ్గర కెళ్ళి నిలబడ్డాడు.

"ఆరోజు మీరు లలితను చూడటానికి వస్తానన్నారు. తర్వాత తెలిసింది మీరు అనుకోకుండా మీ ఊరు వెళ్ళారని." అన్నాడు ముఖేశ్.

"అవునండీ. ఆరోజు ఇంటికి వెళ్ళేసరికి మా అమ్మగారి ఆరోగ్యం బాగా లేదని టెలిగ్రాం వచ్చింది. మేము చేరే సరికే మా అమ్మగారి దహన సంస్కారాలుకూడా అయిపోయాయి. చివరి చూపుకూడా అందలేదు." అన్నాడు రాజదేవ్ విచారంగా.

రాజదేవ్ తలచూసి ముందే అర్థం చేసుకున్నాడు ముఖేష్.

"అయ్యో! అలాగా? తల్లి బిడ్డకు జన్మనుమాత్రమే ఇవ్వదు, మనిషిని, మానవుడుగా నిలబెడుతుంది. జీవిత విలువల్ని తల్లి ఒడిలోనే

బిడ్డ నేర్చుకుంటాడు. తల్లి తన బిడ్డలకోసం ఏ త్యాగంఅయినా చేస్తుంది. మమతామయి. త్యాగమయి తల్లి స్థానాన్ని ఎవరూ పూరించలేరు. అందుకే గీతలో స్వధర్మం గురించి చెబుతూ తల్లిని ఉపమానంగా తీసుకోవడం జరిగింది. స్త్రీ సమాజానికి పుత్రుడి రూపంలో అమూల్యసేవను అందిస్తుంది. మానవజాతి మనగడకు ఆధారశిల. తల్లిఋణం తీర్చుకోవాలంటే, పుత్రుడు తల్లిపేరు నిలబెట్టే సద్గుణశీలుడై వుండాలి."

రాజదేవ్ ముఖేష్ చెప్తుంటే శ్రద్ధగా విన్నాడు.

తల్లి చనిపోయినట్టు గ్రామం చేరగానే విన్న రాజదేవ్ భోరున ఏడ్చాడు. ఎందరో అతడ్ని ఓదార్చారు. కాని ముఖేశ్ ఓదార్పు భిన్నంగా అన్పించింది. జీవిత సత్యాన్ని బోధిస్తున్నట్టు అన్పించింది.

"మేము ముగ్గురు అన్నదమ్ములం. ఇద్దరు చెల్లెళ్లున్నారు. మా పెద్దనాన్న కుటుంబం వేరుగా వుంటుంది. కాని మా అమ్మ అందర్నీ ఎంతో ప్రేమగా చూసేది. మా పెదనాన్న పిల్లల్నికూడా తన పిల్లల్లాగే ప్రేమించేది. నేనంటే ఆమెకు ప్రాణం అనే చెప్పాలి. ఏ విషయం కూడా మా అమ్మదగ్గిర దాచేవాణ్ణికాదు ఆమెకు అన్నీ చెప్పేవాణ్ణి.'' దుఃఖంతో గొంతు పూడిపోయింది.

ముఖేశ్ వయసులో రాజదేవ్‌కంటే ఆరేడేళ్లు పెద్దవాడు. ఆయనకు ముందుచూపు ఉంది. అర్థం చేసుకోగల తెలివితేటలున్నాయి. రాజదేవ్ భుజంమీద చెయ్యివేసి దగ్గరకు తీసుకొన్నాడు.

"ఈ ప్రపంచంలో లేనిది ఏదీలేదు. మానవుడు తన కోర్కెల ప్రకారం, సాధనాలను ఉపయోగించి తనకు కావలసినవాటిని సాధించుకుంటాడు. సంకల్పం వుంటే విజయం తథ్యం. అయితే స్వార్థపరుడైన వ్యక్తి వశంలో పడిపోతే తప్పు భావం అభావం ఎప్పుడూ వుండదు.

లోపలకువచ్చి కూర్చోండి. బాగా అలసిసొలసి వచ్చారు. పదండి, వేడి వేడి టీ ఇస్తాను.''

ముఖేశ్ అతణ్ణి చెయ్యి పట్టుకొని గదిలోకి తీసుకెళ్ళాడు. మెల్లాలో నుంచి తీసుకెళ్తూ ఒక గదిముందు ఆగి అన్నాడు–"ఈ గదిలోనే లలిత జబ్బు పడింది"

రాజదేవ్ నడుస్తూ నడుస్తూ ఒక్కసారిగా ఆగిపోయాడు - తల తిరిగినట్టయి గోడకు చేరబడ్డాడు.

ముఖేశ్ కూడా ఆగిపోయాడు.

రాజదేవ్ రక్తహీన ముఖంచూసి గాభరా పడ్డాడు.

"ఏమైంది? ఒంట్లో బాగాలేదా?" అని అడిగాడు.

రాజదేవ్ గోడ దగ్గరనుంచి జరిగి, పేలవంగా నవ్వి "బాగానే వున్నాను. మీరేమిటో అన్నారు. లలిత ఎక్కడ?" అన్నాడు.

"ఊరికెళ్ళింది. రెండు మూడు రోజుల్లో వస్తుంది. గ్రామ వాతావరణంలో ఆమె ఆరోగ్యం త్వరగా బాగుపడుతుందని పంపించాను."

''ఓహ్...నేను వేరుగా...మీరు సగం వాక్యం చెప్పి నన్ను హడల గొట్టారు."

ముఖేశ్ రాజదేవ్ ఆలోచనలను పసికట్టాడు. పకపక నవ్వాడు.

"లలితకు ఏమీ కాలేదు. ఆమె బాగానే వుంది. మా లలిత చాలా మంచి పిల్ల. ఆ రోజు మీరు ఎందుకు రాలేదని చాలాసార్లు అడిగింది. మీరు ఊరు వెళ్ళారనీ, మీ అమ్మగారికి జబ్బుగా వుంటే వెళ్ళారని తెలిసి చాలా బాధపడింది."

"మీరు లలితగారితో హిమాలయ పత్రిక కోసం..."

మధ్యలోనే అందుకొని ముఖేశ్ అన్నాడు - "ఆ రోజు పాన్‌షాపు దగ్గర మన పరిచయం గురించి చెప్పాను. తనను చూడటానికి మీరు వస్తానన్నారని చెప్పాను, మీరు రాలేదు. మీ నౌకర్ను అడిగి అసలు విషయం తెలుసుకొన్నాం. ఆ తర్వాత లలిత రెండు మూడు రోజులు చాలా దిగులుగా కన్పించింది. సాధారణంగా లలిత ఎప్పుడూ నవ్వుతూనే వుంటుంది. జబ్బులో కూడా నవ్వుతూనే వుండేది. మీ విషయం తెలిశాక లలిత నవ్వడం మర్చిపోయిందా అన్నంత ఉదాసీనంగా వుండిపోయింది. లలిత మనసు చాలా సున్నితం. ఎవరు బాధపడినా భరించలేదు."

రాజదేవ్‌కు అతని మాటలు ఎంతో ఊరట కలిగించాయి. దుఃఖంలో తను వంటరివాడు కాదనీ, లలిత తనతోనే వున్నదనీ అన్పించింది.

రెండు మనసులూ ఒకదాన్నొకటి గుర్తించాయి ఇద్దరి భావాలూ ఒకటే. అందుకే ప్రేమ అలౌకికం. దేవుడు ప్రసాదించిన వరం. ఆత్మ వికాసానికి సుగమమైన మార్గం. ప్రేమ ఒకవైపు శారీరక సౌందర్య స్పర్శతో ఉప్పొంగుతుంది మరోవైపు ఆధ్యాత్మిక ఎల్లలను బంధిస్తుంది.

రాజదేవ్ దాదాపు రోజూ ముఖేశ్‌ను కలుసుకుంటూనే వున్నాడు. గంటలకొద్దీ ఏదో ఒక విషయంమీద చర్చలు చేసేవారు. లలిత ఇంకా రాలేదు ముఖేశ్ రాజదేవ్ లలిత మంచి జంట అని భావించాడు.

రాజదేవ్ మనసు తెలుసుకోవాలని భావించాడు. ఒకరోజు ఆ అవకాశం లభించింది. ముఖేశ్ తన కుటుంబ విషయాలు చెప్పడం ప్రారంభించాడు.

"నేను అన్నదమ్ముల్లో అందరికంటే చిన్నవాడిని. ఇద్దరుఅన్నలు గ్రామంలో వుంటున్నారు. నాలుగేళ్లక్రితం మా నాన్నగారు ఆకస్మికంగా

మరణించారు. వాంతులూ, విరోచనాలూ అయి చనిపోయారు. ఆ సమయంలో నేను గ్రామంలో ఇంటిదగ్గరే వున్నాను. నన్ను దగ్గరకు పిల్చి లలితను నువ్వే చూసుకోవాలని చెప్పారు. మా అన్నలిద్దరూ లలితను చదివించరని ఆయనకు తెలుసు. అందుబాటులో వున్న ఎవడికో ఇచ్చి పెళ్ళిచేసి చేతులు తుడుచుకుంటారనికూడా తెలుసు. అందుకే లలిత బాధ్యత నాకు అప్పగించారు.

"మీ కుటుంబంలో యోగ్యతగల వ్యక్తి మీరేగదా?" ముఖేశ్‌ను ఉబ్బేసేందుకు అన్నాడు.

ముఖేశ్ కొద్ది క్షణాలు మౌనంగా వున్నాడు. అతడి ముఖంలో విచార రేఖలు స్పష్టంగా కన్పించాయి.

"యోగ్యతతో సామాజిక అవసరాలు తీరవు. ఉమ్మడి కుటుంబం. డెప్యూటీ కలెక్టర్ అంటే చాలా గొప్ప ఆఫీసరనుకుంటారు మా అన్నయ్యలు. డబ్బురాసులు నా దగ్గర ఉన్నాయని వారి భావం. నానుంచి చాలా ఆశిస్తారు. వీలయినంతవరకు వాళ్లకు సహాయం చేస్తూనే వుంటాను. కాని నాకు వచ్చే జీతంఎంత? లలితకు వివాహం చెయ్యాల్సిన బాధ్యత కూడా వుంది. ఈ యజ్ఞం ఎలా పూర్తిచెయ్యగలనో నాకే తెలియడం లేదు. బాధగా అన్నాడు ముఖేశ్.

"మీరు లలిత విషయంలో అంత బాధ ఎందుకు పడాలి? లలిత వంటి పిల్ల దొరికితే చాలనుకుంటారు. కట్నంకోసం ఎవరు ఆశిస్తారు?"

"మీలా విశాల భావాలుగల యువకులు ఈ రోజుల్లో ఎంతమంది వుంటారు?"

"ఎంతోమంది గురించి మీరు ఎందుకు ఆలోచిస్తారు? నేను ఒకణ్ణి వుంటే చాలదా? లలిత కూడా ఒక్కరేగా?" రాజదేవ్ అప్రయత్నంగా అనేశాడు. మరుక్షణం తను అన్నదానికి సిగ్గుపడి తల వంచుకొన్నాడు.

లలిత తిరిగి వచ్చింది.

వారింటికి రావడం పోవడం అంతకుముందే ప్రారంభం అయింది. లలిత వచ్చాక రాజదేవ్‌కు వారింటికి వెళ్ళడానికి ఎలాంటి సంకోచం కలగలేదు.



కొంతకాలం ముఖేశ్ ఇంటి దగ్గర వున్నప్పుడే రాజదేవ్ వచ్చేవాడు. ముఖేశ్ బలవంతం మీద అతని భార్య సులేఖ, లలిత కూడా వచ్చి కూర్చునే వారు. అందరుకలిసి కబుర్లు చెప్పుకొనేవారు. లలితా, రాజదేవ్ మధ్యమధ్య ఓర చూపులు చూసుకొనేవారు. 'చూపులతోనే' ఎన్నో మాట్లాడు కొనేవారు. ఇద్దరూ ముసిముసిగా నవ్వుకొనేవారు. కాని ఆ నవ్వులు హద్దుదాటి ఎబ్బెట్టుగా వుండేవికావు. మధ్యమధ్య లలితకు సిగ్గు ముంచుకొచ్చేది. ఏదో వంకతో అక్కడ్నుండి లేచి వెళ్ళిపోయేది. లలిత వెళ్ళిపోగానే రాజదేవ్ మనసును దిగులు చుట్టేసేది. మళ్ళీ అంతలోకే లలిత ఎక్కడికీ వెళ్ళలేదనీ తన మనసులోనే వున్నదనీ తనకుతనే సర్ది చెప్పుకొనేవాడు.



శారీరిక స్పర్శలో ఏముంది? అది కేవలం ప్రేమకు స్థూలరూపం మాత్రమే. ప్రేమ సూక్ష్మరూపం సుగంధంలా నిరాకారమైనది. ఇలా సాగేవి రాజదేవ్ ఆలోచనలు.



ఒకరోజు లలితను ఒంటరిగా కలుసుకొనే అవకాశం రాజదేవ్‌కు లభించింది.

"ఈ మధ్య మీరు ఉదాసీనంగా వుంటున్నారు. నవ్వడం కూడా మర్చిపోయారు. కారణం తెలుసుకోవచ్చా?'' అని అడిగేశాడు.

లలిత తల వంచుకొని మౌనంగా వుండిపోయింది. చాలాసేపు ఇద్దరిమధ్యా మౌనం మిగిలిపోయింది.

ముఖేశ్ లలితను తనకిచ్చి వివాహం చెయ్యాలనుకుంటున్నాడని రాజదేవ్‌కు తెలుసు. కాని తన తండ్రికి ఈ వివాహం అంతగా ఇష్టం లేదని కూడా తెలుసు. బహుశా లలిత అంత ఉదాసీనంగా మారిపోవ డానికి అదే కారణం కావచ్చునని రాజదేవ్‌కు అన్పించింది.

"మీ ఆరోగ్యం బాగా లేదు. జబ్బు పూర్తిగా నయం కాలేదా ?" అని మళ్ళీ ప్రశ్నించాడు రాజదేవ్.

"ఆరోగ్యానికేం ? ఆరోగ్యం బాగానే వుంది". అని లలిత ఓ క్షణం రాజదేవ్ ముఖంలోకి చూసి చిరునవ్వు నవ్వింది.

''ఒక్క వాతావరణమే నాకు తెలుసు. జన్మతో పరిచయం అయిన వాళ్ళ మధ్యనే ఇంతకాలం గడిపాను. ఇంట్లోవారి పరిచయం సహజంగా జరుగుతుంది. జన్మతోనే వచ్చే పరిచయం- కాని నేను ఆడపిల్లను. ఆడ పిల్ల ఒకసారి మాత్రమే జన్మించదు. ఎన్నో జన్మలుంటాయి. ఆ జన్మలు సహజమైనవో లేక కృత్రిమమైనవో నాకు తెలియదు.''

రాజదేవ్ మాటలు మర్చిపోయినవాడిలా చూస్తూ వుండిపోయాడు. ఈనాటి లలితరూపం అతడికి తెలిసినది కాదు. ఆమె మాటలు అతడికి అర్థం అయీ కాకుండా వున్నాయి.

''మీరు కవిత్వం చెప్తున్నారేమిటని నేను అడగను. కాని మిమ్మల్ని చూసి ప్రథమ దృష్టిలోనే నేను మిమ్మల్ని గుర్తించాను. ఆ పరిచయం కృత్రిమమైనది కాదు. మీ పరిచయంలో నాకు జీవితానికి ఓ అర్థం లభించినట్టుగా అన్పించింది. మీ ఆ రూపమే నాకు అందంగా కన్పించింది."

"ఆ రూపమా? ఏరూపమూ?"

"కిలకిల నవ్వు[illegible]"

"అలాంటప్పుడు మీరు నన్ను "మీరు-మీరు" అంటూ ఎందుకు మన్నిస్తున్నారు? ఆ సంబోధనలో సహజత్వం వుందా? మీ పెద్దలు కల్పిస్తున్న దూరం చాలదా?"

రాజదేవ్‌కు అసలు విషయం అర్థం అయింది.

లలితకు తన తండ్రికి ఈ వివాహం ఇష్టంకాదన్న విషయం తెలిసిపోయిందన్నమాట. ఆమె ఉదాసీనతకు కారణం అదేనన్నమాట. ఇందులో అంత బాధపడాల్సిందేముంది?

తన హృదయానికి ప్రేమబాణం గుచ్చుకుంది. బాధపడేది తను. నా తండ్రీ, అన్నలూ, బంధువులూ సామాజిక కట్టుబాట్లకు బానిసలని తనకు తెలుసు. వారికి కావాల్సింది సంప్రదాయం, కుటుంబ గౌరవం. నన్ను అర్థంచేసుకోగల అమ్మ నన్ను విడిచి వెళ్ళిపోయింది.

లలితకు తనమీద విశ్వాసంలేదా?

రాజదేవ్ ఆలోచనల్లో మునిగిపోయాడు. ఆ కొద్దిక్షణాల్లోనే ఎన్నో ఆలోచించాడు.

కాని ఏభై ఏళ్లు నిండిన రాజదేవ్ ఈనాడు మరోవిధంగా ఆలోచిస్తున్నాడు.

మనిషి సంఘజీవి. సంఘాన్ని కాదని జీవించగలననుకోవడం పొరపాటు తను ఆ పొరపాటే చేశాడు.

జీవితం సమతల మార్గంలో సాఫీగా నడవదు. జీవితంలో అనేక రుతువులు వస్తాయి. వేడి-చలి-సుఖం-దుఃఖం- అప్పుడప్పుడు వడగళ్ళ వానను కూడా భరించాలి. ఎత్తు పల్లాలలో నడవాలి. మార్గమధ్యంలో పర్వతాలు ఎదురౌతాయి నదీనదాలు అడ్డం వస్తాయి.

ఒక భవన నిర్మాణం జరగాలంటే పునాది వెయ్యాలి. పునాదిలో రాళ్లు అడ్డుపడితే పగలగొట్టాల్సి వుంటుంది.

వేలకొద్దీ అడుగులు తవ్వితేగాని బొగ్గు లభించదు.

రాజదేవ్ లలిత చెయ్యిపట్టుకొని "లలితా! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నా ప్రేమ పవిత్రమైనది నేను నిన్ను ప్రేమించాను-ప్రేమిస్తూనే వుంటాను. నన్ను నేను నీకు సమర్పించుకొన్నాను, సంపూర్ణ సమర్పణ. పెద్దల ఆశీర్వాదం అవసరమే. కాని వారికి ఇష్టం వున్నా లేకపోయినా నేను నీవాడినే."

లలిత సోఫాకు ఆనుకొని కళ్ళుమూసుకుంది.

ఆమె అరచేతిని తన రెండు అరచేతుల మధ్య బంధించాడు రాజదేవ్. అలా ఎంతసేపు ఆ ఇద్దరూ కూర్చుండిపోయారో వారికి తెలియదు.

ఒక్కసారి రాజదేవ్ ఈ లోకంలోకి వచ్చాడు.

"లలితా! ఇవ్వాళే మా అన్నయ్యతో మాట్లాడతాను. మా అమ్మగారి సంవత్సరీకం కాగానే పెద్దల ముందు మన వివాహం జరుగుతుంది. నన్ను నమ్ము." అన్నాడు.

లలిత కళ్ళు తెరిచింది.

రాజదేవ్ ముఖంలోకి చూసింది. ఆమె కళ్ళల్లో ప్రేమ పారావారం పొంగింది.

"నువ్వు...నన్ను ఎప్పుడూ ఇంత ప్రేమగా చూస్తావా? నీ ప్రేమ నాకు లభిస్తే ఎన్ని కష్టాలనైనా ఎదుర్కోగలను." అన్నది లలిత.

# 3

నేలమీద పడివున్న రాజదేవ్‌కు తనలోని శక్తి క్షీణించిపోతున్నట్టుగా వుంది. కుడికాలి మోకాలునుంచి చాలా రక్తం పోయిందని తెలుసుకొన్నాడు.

విమానంలో తన ముందు కూర్చున్న నవదంపతులు జ్ఞాపకం రాగానే చిత్రమైన అనుభూతి కలిగింది. ఆ యువతి అన్న వాక్యం గుర్తుకు రావడంతో శారీరిక బాధల్ని మర్చిపోయాడు.

లలిత కూడా ముప్పయ్ సంవత్సరాల క్రితం అదే వాక్యం పలికింది.

వైవాహిక జీవితంలోని ఈ ముప్పయ్ ఏళ్ళలో ఆ మాట ఎన్నో సార్లు అన్నది. ఏదో ఒక ప్రత్యేక సంఘటన జరిగినప్పుడల్లా ఆ మాట అనేది. కాని ఆమె ఆ మాట అనే తీరులో ప్రతిసారీ నూతన అర్థం స్ఫురించేది. ఆలోచించినకొద్దీ రాజదేవ్ మనసులోని గాయం రేగి తీవ్రమైన యాతనకు గురి చేసింది. ఈ బాధ ముందు శారీరక బాధ అతడికి బాధగానే అన్పించడం లేదు.

కారుచీకట్లు క్రమంగా విచ్చిపోతున్నాయి. చుట్టూ పెద్ద పెద్ద చెట్లూ, తుప్పలూ ఆ గుడ్డి వెలుగులో కనీ కనిపించకుండా కన్పిస్తున్నాయి.

రాజదేవ్ లేచి కూర్చోవడానికి ప్రయత్నించాడు. కాని కూర్చోలేకపోయాడు. చేత్తో భూమిని తడిమి చూశాడు. చేతినిండా రక్తం అంటింది. దూరంగా పక్షికూత విన్పించింది. మరుక్షణం భయంకరమైన పులి అరుపు విన్పించింది వెనువెంటనే జంతువుల, పక్షుల అరుపులు విన్పించసాగాయి.

ఆకస్మికంగా వచ్చిన మృత్యుముఖం నుండి బయటపడ్డాడు. కాని ఇప్పుడు ? భయంకరమైన మృత్యు కోరల్లో చిక్కుకోబోతున్నాడు.

అందరిలా తనూ విమాన ప్రమాదంలో చనిపోతే బాగుండేది అప్పుడు మృత్యుభయం వుండేది కాదు. మృత్యువుకంటే మృత్యుభయం చాలా భయంకరమైనది.

లలితతో రాజదేవ్ వివాహం అయి దాదాపు ఇరవై మూడేళ్లు అయింది.

ఉద్యోగరీత్యా భార్యతో ఢిల్లీ చేరాడు. ఆయనకు ఇద్దరు కొడుకులూ, ఇద్దరు కూతుళ్లూ వున్నారు. పెద్దకొడుకు పేరు రాముడు. కాని రావణుడుగా తయారయ్యాడు. రెండో సంతానం నందిని. తొమ్మిది చదువుతున్నది. మూడో వాడి పేరు హీరామన్. బుద్ధిమంతుడే కాని చదువు మీద బొత్తిగా శ్రద్ధలేదు. నివేదిత పాలుతాగే పిల్ల.

ఢిల్లీ కాపరం. ప్రతిరోజూ ఎవరో ఒకరు పై మనిషి ఇంటికి వస్తూనే వుండేవారు. ఉద్యోగం వెతుక్కుంటూ కొందరొస్తే, ఢిల్లీ చూడటానికి కొందరు వచ్చేవారు. మరికొందరు ఇంటర్వ్యూలకొస్తే, ఇంకా కొందరు పరీక్షలు రాయడానికి వచ్చేవారు

పుష్కర్ పెద్దకొడుకు లాల్ నారాయణ్ మూడేళ్ళ పాటు పెద్దనాన్న దగ్గర గ్రామంలో వున్నాడు. లాల్ నారాయణ్‌ను తండ్రి రాజదేవ్ దగ్గరకు చదువుకు ఢిల్లీ పంపించాడు. పదిహేడేళ్లు లేని వాడికి అలవడని చెడు అలవాటులేదు రాజదేవ్‌కు అతడివల్ల మనస్తాపం ఎక్కువైంది.

ఒకరోజు పుష్కర్ రాజదేవ్‌తో "వాడ్ని నీదగ్గర పెట్టుకో. నీ దగ్గర వుండి చదువుకుంటాడు." అన్నాడు.

రాజదేవ్‌కు వాడు వస్తే తన పిల్లలు పాడైపోతారనే భయం పట్టుకొన్నది.

"వాడు గ్రామంలో వుండి చదువుకొంటేనే మంచిదనుకుంటా. ఢిల్లీ వాతావరణంలో వాడు చదువుతాడనే నమ్మకం నాకు లేదు" అన్నాడు రాజదేవ్.

"నువ్వు పాట్నా వచ్చి నా దగ్గరుండే చదువుకున్నావ్. నేను నీలాగే అనివుంటే ఇంతవరకు రాగలిగేవాడివా?" అన్నాడు కోపంగా పుష్కర్.

అల్లరి చిల్లరిగా తిరిగే లాల్‌నారాయణ్‌ను తనతో పోల్చడం రాజదేవ్‌కు కోపం తెప్పించింది. అంతేకాక తను పాట్నా వచ్చినప్పుడు అందరూ ఉమ్మడి కుటుంబంగా వుండేవారు. పైగా తన ఖర్చంతా తండ్రి పంపించేవాడు.

రాజదేవ్ లాల్‌నారాయణ్‌ను ఢిల్లీకి తీసుకురాక తప్పలేదు. రాజదేవ్ భయపడినట్టే జరిగింది. రామ్‌ను లాల్‌నారాయణ్ ఆకర్షించాడు. కొద్దిరోజుల్లోనే రామ్ అనేక వ్యసనాలకు బానిస అయ్యాడు. రామ్ అంటే రాజదేవ్‌కు ముందునుంచీ ఇష్టంలేదు. ఇప్పుడు రామ్‌ను అసహ్యించుకోసాగాడు. ఇంట్లో అశాంతి ప్రారంభం అయింది.

లలిత రామ్‌ను పిల్లలందరికంటే ఎక్కువగా ప్రేమించసాగింది. తండ్రికి దూరం అయిన కొడుకంటే ఆమెకు అమితమైన జాలి. రాత్రి ఆలస్యంగా ఇంటికి వచ్చేవాడు. ఉదయం చాలా ఆలస్యంగా నిద్ర లేచేవాడు.

లాల్‌నారాయణ్ రెండేళ్ళనుంచి వేరుగా వుంటున్నాడు సమయం దొరికితేచాలు రామ్ అతడి దగ్గర కెళ్ళేవాడు. ఎలాగో కాలేజీలో ఇంటర్

మొదటి సంవత్సరంలో చేరగలిగాడు. ఫీజుకు ఇచ్చిన డబ్బు వ్యసనాలకు ఖర్చుపెట్టేవాడు. నెలలకొద్దీ కాలేజీకి వెళ్ళేవాడు కాడు. ప్రతిరోజూ ఏదో ఒక తగాదాలో ఇరుక్కొనేవాడు. సిగరెట్, తాగుడుకూ అలవాటుపడ్డాడు.

రామ్‌ను దగ్గర కూర్చోబెట్టుకొని నచ్చ చెప్పాలనుకొంటాడు రాజదేవ్. కాని తీరా రామ్ ఇంటికి వచ్చేసరికి చిరాకుతో ఏమీ మాట్లాడే వాడు కాదు.

"ఇలాగే వుంటేవాడు తప్పక మన వంశగౌరవాన్ని పెంచుతాడు." ఒక రోజు భార్యతో వ్యంగ్యంగా అన్నాడు.

"ఏం? రాముడు నీకు పుట్టలేదా?" వ్యంగ్యంగా ఎదురు ప్రశ్న వేసింది లలిత.

"మనిద్దరి వల్లే వాడు బయట తిరుగుతున్నాడు. ఇంటి వాతావరణం అంత లక్షణంగా వుంది." మళ్ళీ అన్నది లలిత ఎత్తిపొడుస్తున్నట్టుగా.

''నీ అలుసు చూసుకొనేవాడలా తయారయ్యాడు.'' రాజదేవ్ ప్రశాంతంగా అన్నాడు.

"అంటే? నీలా వాడ్ని నేను కూడా ఏవగించుకోవాలా? బిడ్డను ప్రేమించకూడదా? వాడి సుఖ దుఃఖాలతో నాకు సంబంధం లేదా? ఇంత కాలం వాడ్ని పట్టించుకోలేదు ఇవ్వాళ ఏమొచ్చింది?'' అన్నది లలిత.

లలిత ఆలోచనలు వాస్తవానికి దూరంగా వున్నాయని రాజదేవ్‌కు తెలుసు. అయినా మౌనంగానే వుండేవాడు. కాని అప్పుడప్పుడు రామ్ చేసే పనులకు కోపం వచ్చేది. లలిత అతడ్ని అర్థం చేసుకోకుండా ఆవేశంతో అరిచేది.

లలిత ముద్దు చెయ్యడం వల్లనే వాడు మరీ రెచ్చిపోతున్నాడని రాజదేవ్ ఉద్దేశ్యం.

రాజదేవ్ విషయంలో ఇద్దరూ పోట్లాడుకొనేవారు. ఇంట్లో ఎప్పుడూ శాంతి వుండేది కాదు. ఇంటికి పెద్దకొడుకుని తండ్రి నిర్లక్ష్యంగా చూడటం తల్లి భరించేది కాదు రామ్ కూడా తల్లి దగ్గర చాలా అమాయకుడిగా నటించేవాడు. తల్లికి వాడు సకల సద్గుణ సంపన్నుడుగా కన్పించేవాడు.

చూడటానికి రామ్ చాలా అమాయకుడుగా ఉండేవాడు. రామ్ స్ఫురద్రూపి. రామ్‌ను చూసి అందరూ "ఎంత అందంగా వున్నాడు?" అనేవారు. పదిహేడు సంవత్సరాల వయసులో వున్న రామ్ పాతికేళ్ళ వాడిలా కన్పించేవాడు. ఎత్తుగా బొద్దుగా వుండేవాడు. బలిష్ఠంగా వుండేవాడు. ఎంత మంది చుట్టూ కమ్ముకున్నా అందర్నీ తన్ని బయట పడేవాడు.

చక్కని మాటకారి. ఎప్పుడూ చిరునవ్వుతో కన్పించేవాడు. అనుభవించిన వాళ్ళకే వాడెంత దుర్మార్గుడో అర్థం అవుతుంది.

రామ్ ఇంట్లోగానీ, ఇరుగు పొరుగు వాళ్ళకు గానీ తెలియకుండా, ఎక్కడో దూరంగా, తగాదాలు పడేవాడు, తాగేవాడు.

కాని ఒక రోజు వాడి సంగతి పూర్తిగా లలితకు తెలిసిపోయింది. రహస్యం బయటపడింది.

వేసవి కాలంలో రాజదేవ్ లోపల వరండాలో పడుకొనేవాడు. లలిత, నందిని, నివేదిత, హీరామన్ కూడా అక్కడే పడుకొనేవారు.

రామ్ మాత్రం బయట లాన్‌లో గానీ, బయటి వరండాలో గానీ మంచం వేసుకొనేవాడు. బయట వరండాకు ఆనుకొని ఒక గది వుంది.

దానికి తలుపులు లేవు. ఆ గదిలో మాలి దంపతులు వుండేవారు. మాలి పేరు బాబూలాల్. అతడి వయసు దాదాపు ముప్ఫయ్ అయిదేళ్ళు వుండొచ్చును. అతడి భార్యకు ఇరవై ఏళ్ళకంటే ఎక్కువుండవు. యవ్వనంతో పిటపిటలాడుతూ కన్పిస్తుంది. ఆమె పేరు పారో. ఆమె ఇరుగు పొరుగు ఇళ్ళలో పాచి పని చేస్తూ వుండేది. బాబూలాల్ చాలా అమాయకుడు. గ్రామం నుంచి ఢిల్లీ కొద్ది రోజుల క్రితమే వచ్చాడు. మొదటి భార్య రధియా అతడ్ని వదిలేసింది. పారోను రెండో పెళ్ళి చేసుకొన్నాడు. ఆ తర్వాత రధియా ఆ ఇంటి దరిదాపుల్లో తిరగడం ప్రారంభించింది. పొట్టాట పెట్టుకోవడానికి ఏదో సాకు వెదికేది. దానివల్ల లాభం లేకపోయేసరికి పారోకు భర్తమీద ఉన్నవీ లేనివీ చెప్పడం ప్రారంభించింది. పారోమీద అమె చాడీలు పని చెయ్యలేదు. మరో మార్గం ఎన్నుకొన్నది. బాబూలాల్ మీద ప్రేమ వర్షం కురిపించ సాగింది. ఒకరోజు మాంసం కూర తెచ్చి పెట్టేది. మరో రోజు కల్లు ముంత తెచ్చేది. బాబూలాల్‌ను ఆనుకొని కూర్చొని ఏవేవో కబుర్లు చెప్తూ విరగబడి నవ్వేది.

స్త్రీ దేన్నయినా సహిస్తుంది కాని తన భర్త ప్రేమను మరో స్త్రీ పంచుకోవడం సహించదు. పారో బాబూలాల్‌తో తగాదాకు దిగేది. ఈ గొడవ భరించలేక గ్రామం వదిలి ఢిల్లీ చేరుకున్నాడు బాబూలాల్.

పారో శరీరం కాయ కష్టం చెయ్యడం వల్ల దృఢంగా వుండేది. రామ్ దృష్టి పారోమీద పడింది. ఆకలి చూపులు చూసేవాడు. మనసులో కామాగ్ని రగిలింది. పారో శరీరం అగ్నికి ఆజ్యంలా పనిచేసింది. పారోకు ఇదేమీ తెలియదు.

ఒకరోజు రాత్రి కాలేజీ ఫీజుకు ఇచ్చిన డబ్బుతో బ్రాందీబాటిల్ తెచ్చాడు. బాబూలాల్‌ను పిల్చి తాగించసాగాడు. అందరూ లోపలి వరండాలో నిద్ర పోతున్నారు. చాలా జాగ్రత్తగా ప్లాను వేశాడు రామ్.

తను కొంచెం కొంచెంగా తాగుతూ, గ్లాసులు నింపి బాబూలాల్‌కు ఇవ్వ సాగాడు. బాబూలాల్ రామ్ మంచం పక్కనే మత్తుగా పడిపోయాడు. వెంటనే గుర్రు పెట్టసాగాడు. అతడు ఈ క్షణంకోసమే ఎదురుచూస్తు న్నాడు.

మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ వరండా పక్కన ఉన్న గదిలో ప్రవేశించాడు. పగలంతా కాయకష్టం చేసిన పారో మంచినిద్రలో వున్నది.

ఒక మూలగా లాంతరు వెలుగుతోంది. వత్తి తగ్గించి వుంది. ఆ గుడ్డి వెలుగులో పారోను చూశాడు రామ్. ఆమె చీర మోకాళ్ళపైకి పోయింది. రామ్‌లో కోరిక ఒక్కసారిగా చెలరేగింది. ఆలోచన నశించింది.

రెండోరోజు పారో రాత్రి జరిగిన సంఘటనకు ఏడుస్తూ భర్తతో చెప్పింది. బాబూలాల్ లలిత దగ్గరకెళ్ళి తన గోడు వెళ్ళబోసుకున్నాడు.

వివేకంలేని ప్రేమ కొన్ని సమయాల్లో భయంకర పరిణామాలకు దారితీస్తుంది. తల్లి హృదయం పుత్ర ప్రేమతో తొణికిసలాడుతోంది. తల్లి హృదయంలో వాత్సల్యం, కరుణ, క్షమకు తప్ప వేరేదానికి స్థానం వుండదు.

లలిత కూడా వివేకరహితంగా రామ్‌ను సమర్థించసాగింది. వాడు అలా కావడానికి కారణం తండ్రి నిర్లక్ష్యం అని భావించసాగింది. తండ్రి ప్రేమకు నోచుకోని బిడ్డ అశాంతిగా ఎక్కడెక్కడో తిరుగు తున్నాడని నమ్మింది. అందువల్లనే ఆమె తన బిడ్డలందరిలో రామ్‌ను ఎక్కువగా ప్రేమించసాగింది. వాడు ఎలా ప్రవర్తించినా సానుభూతితో సమర్థించేది. కాని తన కొడుకు పెడమార్గంలో ఎంత దూరం వెళ్ళాడో ఆమె కలలో కూడా ఊహించలేకపోయింది. కొడుకు గురించి చెడుగా ఆలోచించడానికి ఆమె మనసు అంగీకరించేదికాదు.

బాబూలాల్ చెప్పిన విషయం విని ఆమె గాభరా పడిపోయింది. కొడుకు చేసిన దుర్మార్గానికంటే, ఆ విషయం తన భర్తకు తెలిసిపోతుందేమోనని ఎక్కువగా బాధ పడింది.

కొన్ని నిముషాలు ఆమె శిలాప్రతిమలా నిలబడిపోయింది.

తేరుకొని లోపలకు వెళ్ళి మూడు వందల రూపాయల నోట్లతో బయటికి వచ్చింది.

"నీ భార్య పోగొట్టుకొన్నదాన్ని నేను తిరిగి ఇవ్వలేను. దానికి వెల చెల్లించడం మానవుడి శక్తికి మించినది. జరిగింది మర్చిపోవడం వల్లనే నీ గౌరవం నిలబడుతుంది. నీ కాళ్లు పట్టుకుంటాను. ఈ మూడొందలూ తీసుకొని, నీ భార్యతో నువ్వు ఎక్కడికైనా వెళ్ళిపో. భగవంతుడి మీద వట్టు - ఈ విషయం నువ్వు ఎవరికీ చెప్పకూడదు." మూడు వందలు అతడికి అందించింది.

చేసేది ఏమీలేక బాబూలాల్ మూడొందలు తీసుకొని బయటికి వెళ్ళిపోయాడు.

సాయంకాలం లలిత బాబూలాల్ గదికెళ్ళి చూసింది. సామాను ఎక్కడిదక్కడే వుంది. భార్యాభర్తలు లేరు.

ఆ రోజంతా లలిత మనసు అశాంతితో వేగిపోయింది.

పొద్దుట వెళ్ళిన రామ్ తిరిగి రాలేదు.

రాజదేవ్ ఇంటికి వచ్చాడు.

లలిత వాలకం రాజదేవ్ చూశాడు. అతడికి భార్య మూడ్స్ గురించి బాగా తెలుసు. ఆమె ప్రతిభంగిమనూ అతడు అర్థం చేసుకోగలడు. లలితను ఆశ్చర్యంగా చూశాడు. ఆమె లోపలకూ బయటకూ కాలుకాలిన పిల్లిలా తిరుగుతోంది. భర్తను ఎదుర్కొనే ధైర్యం లేదు. పుస్తకం తెరిచి

చదవడానికి ప్రయత్నించింది. కాని ఆమె దృష్టి మాత్రం వాకిలివైపుకే పోతున్నది.

"ఏమిటలా వున్నావ్?" రాజదేవ్ ప్రశ్నించాడు.

"ఎలా వున్నానూ? బాగానే వున్నానే". తెచ్చిపెట్టుకొన్న చిరునవ్వుతో అన్నది లలిత.

"మరి అంత అశాంతిగా లోపలకూ బయటకూ ఎందుకు తిరుగుతున్నావ్? ఏదో వుంది. ఏం జరిగిందో చెప్పు".

"వుంటేవుంది. నీకెందుకు? ఇంటి సంగతులు పట్టించుకోవడానికి నీకు తీరిక ఎక్కడుంది?" దాదాపు అరిచినట్టే అన్నది. పెదవులు కొరుక్కోవడం చూసి ఏదో జరగరానిదే జరిగి వుంటుందని భావించాడు రాజదేవ్.

ఇంటి వాతావరణాన్ని బట్టి లలిత ఆరోగ్యం తరచుగా దెబ్బతినడం రాజదేవ్ గుర్తించాడు.

"ఇంటి సమస్యలు తెలిస్తే గదా ఏదైనా చెయ్యడానికి. నువ్వే ఏదీ చెప్పవు. నేనేం చెయ్యగలను లలితా?" శాంతంగా అన్నాడు.

"నన్నేమీ ప్రశ్నించకండి." అంటూ లలిత లేచి బయటికి వెళ్ళిపోయింది.

బయటి వరండా పక్కన వున్న గదిలోకి వెళ్ళింది. అప్పటికి బాబూలాల్ సామాను తీసుకెళ్ళిపోయాడు.

లలిత దీర్ఘంగా నిట్టూర్పు విడిచింది.

గది నుంచి బయటికి వస్తున్న లలితకు రామ్ చేసిన దారుణం గుర్తొచ్చింది. తిన్నగా తన గదిలోకి వెళ్ళి మంచం మీద వాలిపోయింది. గదిలోని గోడలన్నీ కదులుతున్నట్టు కన్పించాయి. ముఖం దిండులో దాచుకొని బోర్లా పడుకుంది. తన శరీరం తిరుగుతున్నట్టుగా అన్పించింది.

చటుక్కున లేచి కూర్చుంది.

ఊపిరి అందనట్టుగా ఉక్కిరిబిక్కిరి అవుతోంది. నలువైపులా దృక్కులు సారించింది. ఎవరూ లేరు. ఒక్కసారిగా వెక్కివెక్కి ఏడవ సాగింది. ఆమె శరీరం చెమట్లు కక్కుతోంది. ఆమె మంచం దిగాలను కొన్నది. కాని దిగలేకపోయింది.

ఆమెకు శరీరం యావత్తూ పక్షపాతానికి గురి అయినట్టు అనిపించింది. పెద్దగా ఏడవ సాగింది. ఆమె ఏడ్పు విన్న పెద్ద కూతురు నందిని తల్లి గదిలోకి పరిగెత్తుకొచ్చింది.

"అమ్మా! అమ్మా! ఏమైంది! నాన్నా! త్వరగా రండి." కేకలు పెట్టింది నందిని.

రాజదేవ్ పరుగులాంటి నడకతో వచ్చాడు.

లలిత పరిస్థితి చూసి రాజదేవ్ కాళ్లు వణికాయి. కంఠం ఎండి పోయింది.

"లలితా ఏమైంది? ఏమిటిలా ఐపోతున్నావ్? ఏమైంది" అతికష్టం మీద గొంతు పెకలించుకొని అడిగాడు.

లలిత సైగతో గదంతా గిర్రున తిరుగుతున్నదని చెప్పింది. "నందినీ మంచినీళ్లు తీసుకురా." అని కూతురికి పురమాయించి, లలితను గుండెలకు హత్తుకొని కూర్చున్నాడు రాజదేవ్. తన ధోవతితో లలిత కన్నీళ్లు తుడిచాడు. ముఖానికి పట్టిన చమట్లు తుడిచాడు.

నందిని నీళ్లు తెచ్చింది. హీరామన్, నివేదిత కూడా గదిలోకి వచ్చారు. రాజదేవ్ లలిత చేత మంచి నీళ్ళు తాగించాడు. ఆమెను మెల్లగా, అతి జాగ్రత్తగా మంచంమీద పడుకోబెట్టాడు.

"మీరు ఇక్కడే వుండండి నే వెళ్ళి డాక్టర్ను పిల్చుకొస్తాను." పిల్లలతో అని లేవబోతున్న రాజదేవ్ చొక్కా పట్టుకొని లలిత అతడ్ని

మంచం మీద నుంచి లేవనివ్వలేదు. కొంత సేపటికి లలిత క్రమంగా తేరుకోసాగింది. రాజదేవ్, పిల్లలూ అక్కడే కూర్చుని వున్నారు. దాదావు రెండు గంటల తర్వాత లలిత మాట్లాడ గలిగింది.

"రామ్ ఇంకా రాలేదు. వాడు ఎక్కడి కెళ్ళాడో ఏమో?" అన్నది.

"ఇదేం కొత్త విషయమా? వాడు రోజూ ఆలస్యంగానే వస్తాడుగా? ఎక్కడో కూర్చుని చీట్ల పేక ఆడుతూ వుంటాడు. లేక దౌర్భాగ్యుడు ఏదో చేస్తూ వుండి వుంటాడు - అలాంటి కొడుకు..."

ఒక్కసారి లలిత తన కుడి చేత్తో రాజదేవ్ నోరు మూసింది.

"అలా అనకు-దౌర్భాగ్యుడు కాడు. అభాగ్యుడు. తండ్రి ప్రేమకు నోచుకోని వాడు. అందుకే వాడలా తయారయ్యాడు. ఏనాడైనా నువ్వు వాడిని దగ్గర కూర్చోబెట్టుకొని ప్రేమగా లాలించావా? మంచిమాటలు చెప్పావా? మగ పిల్లలు దారి తప్పారంటే ఆ బాధ్యతంతా తండ్రిదే. నువ్వు అసలు నీ కొడుకుని కొడుకుగా చూశావా? నీవల్లనే వాడు పాడై పోయాడు. వాడి బంగారు జీవితం బండల పాలయింది."

రాజదేవ్ మౌనంగా వుండిపోయాడు,

ఆ రాత్రి గడిచింది.

తెల్లవారి ఎలాంటి గొడవ జరగలేదు.

ఇది జరిగిన ఐదారు నెలల తర్వాత రాజదేవ్ తమ ఊరు వెళ్ళాడు. అది అక్టోబరు నెల. రెండు రోజుల ముందు ఉత్తర బీహార్‌లో తుఫాన్ వచ్చింది. ఎముకల్ని కొరికే చలి. మామూలుగా వేసవి కాలంలో ధరించే బట్టలు తీసుకొని బయలుదేరాడు. అక్టోబర్‌లో జనవరిలో లా చలి వుంది రెండు రోజుల ఎడతెరిపి లేని వర్షం వల్ల,

గదులన్నీ ధాన్యపు బస్తాలతో నిండివున్నాయి. రాజదేవ్ వరండాలో పడుకోవాల్సివచ్చింది. కలతనిద్రలో వున్నాడు.

హృదయ విదారకమైన ఆర్తనాదం అర్ధరాత్రి పూట విన్పించింది. త్రుళ్ళిపడి లేచి కూర్చున్నాడు. ఎవరో స్త్రీ పెద్దగా ఏడుస్తోంది. ఇరుగు పొరుగు ఇళ్ళ నుంచి జనం పరుగులు తీస్తున్నారు. రాజదేవ్ కళ్ళు నులుపుకొని చూశాడు. జనం కలకలం, స్త్రీ ఆర్తనాదం, అమరనాధ్ ఇంటినుంచి వస్తున్నట్టు గ్రహించాడు. అమరనాధ్ రాజదేవ్ పెద్ద తండ్రి కొడుకు. రాజదేవ్ ఒక్కసారిగా అమరనాధ్ ఇంటికేసి పరుగు తీశాడు.

అక్కడి దృశ్యం చూసి చేష్టలుడిగి నిలబడిపోయాడు.

అమరనాధ్ ఒక స్త్రీని కర్రతో బాదుతున్నాడు. కాళ్ళతో తన్నుతున్నాడు. ఆమె నేల మీద పడి దారుణంగా రోదిస్తున్నది. అమరనాధ్ తమ్ముడు ఉమేశ్‌ను ఐదారుగురు గట్టిగా పట్టుకొన్నారు. ఉమేశ్ వాళ్ళను విడిపించుకొని అమరనాధ్ మీదకు దూకడానికి ప్రయత్నిస్తున్నాడు.

"నీచుడా - ఆమెను వదులు. లేకపోతే నీ ప్రాణం తీస్తాను." అరుస్తున్నాడు ఉమేశ్.

అమరనాధ్ ఆగి ఓసారి అగ్నిగోళాల్లా వున్న కళ్ళతో ఉమేశ్‌ను చూశాడు.

"ఏమిరా అలా చూస్తావ్. నీ కళ్ళు పీకేస్తాను. నీచుడా? ఒక ఆడదాన్ని హింసిస్తావా? నీ అంతు చూస్తాను."

"ఇది బతకకూడదు. దీన్ని చంపేస్తాను. ఈ కులట బ్రతికి వుండటానికి వీల్లేదు. మా వంశానికి మచ్చ తెచ్చిన రాక్షసి. నీచురాలు." అరుస్తూ అమరనాధ్ మళ్ళీ కర్ర పైకెత్తాడు.

రాజదేవ్ ఒక్కసారిగా ముందుకు దూకి కర్ర పట్టుకొని ఏమిటి నువ్వు చేస్తున్న పని? చంపేస్తావా? చంపితే నువ్వు చస్తావ్. ఉరి కంబం ఎక్కుతావ్." అన్నాడు రాజదేవ్.

"ఎక్కుతాను. ఉరి కంబం ఎక్కుతాను. ఎన్నిసార్లయినా ఎక్కుతాను. కాని ఇలాంటి కులట నా వంశంలో బతికుండ కూడదు" అరిచాడు అమరనాధ్.

"అసలు సంగతి ఏమిటో చెప్పు. ఆవిడమీద ఒక్క దెబ్బ పడటానికి వీల్లేదు." రాజదేవ్ దృఢంగా అన్నాడు. రాజదేవ్ గురించి ఆ ఊరి వాళ్ళకు తెలుసు. అమర్‌నాధ్‌కు అందరికంటే బాగా తెలుసు. రాజదేవ్‌కు కోపం వస్తే ఎవరూ అతడితో పేచీ పడటానికి ముందుకొచ్చే వాళ్లుకాదు.

"నువ్వెంత కాలం దీన్ని రక్షిస్తావ్, ఈ లం...ఈ ఇంట్లో వుండటానికి వీల్లేదు. అంతేకాదు ఆ దరిద్రుడితో–వాడితో– ఆ ఉమేశ్ గాడితో నా కెలాంటి సంబంధం లేదు." అన్నాడు అమర్‌నాధ్.

"నీతో నేనూ వుండను. నా భాగం పంచు. వేరుగా వుంటాను."

"వేరుగా వుండు, కాని ఈ కులటతో వుండడానికి వీల్లేదు."

"అది చెప్పడానికి నువ్వెవరు? నేను అమెను పెళ్లి చేసుకున్నాను. ఆమె నా భార్య. నాతోనే వుంటుంది." అన్నాడు ఉమేష్.

"అరెరే! ఎంతమాట! ఎంతమాట. ఆవిడ విధవరాలు. పైగా నీ అన్న భార్య. ఆమెను పెళ్ళి చేసుకోవడం ఏమిటి?" జనంలో నుంచి ఒకడు అన్నాడు.

"అవును. మదన్ బాబు చెప్పేది నిజం. ఇలాంటి వాళ్ళు గ్రామంలో వుంటే గ్రామంలో నీతి నియమాలు అడుగంటి పోతాయి. ఈ ఊరి వాతావరణం కలుషితం కావడం మేము సహించం. చూస్తూ ఊరుకోం." మరొకడు అన్నాడు.

"మాకూ ఆడపిల్లలున్నారు. వాళ్ళను మరో ఊరివాళ్లు చేసుకోరు. చెడిపోయిన ఊరిపిల్ల మాకు అక్కర్లేదంటారు. మీరిద్దరూ ఈ ఊరిలో ఉండటానికి వీల్లేదు." ఇంకొకడు అన్నాడు.

అమర్‌నాధ్ పెద్దతమ్ముడు శంకర్ తెలివితక్కువవాడు. వయసుతోపాటు బుద్ధి వికసించలేదు. రెండెకరాల భూమి మాత్రం వుంది. తండ్రి ఏనాడో పోయాడు. ఆ భూమి సాగుచేసుకుంటూ, మరి కొంత భూమి కౌలుకు చేసుకుంటూ బతుకుతున్నాడు. అప్పటికే అమరనాధ్ వయసు ఇరవై అయిదు దాటింది. శంకర్ వయసు ఇరవై రెండు. కొంత డబ్బు సంపాదించాక ఇద్దరన్నదమ్ములూ తిరహూత్‌కు వెళ్ళి ఇద్దరు ఆడపిల్లల్ని కొనుక్కొనివచ్చారు. పన్నెండేళ్ళ పిల్లను అమరనాధ్ చేసుకున్నాడు. పదేళ్ళ నిశను తమ్ముడు శంకర్‌కు చేశాడు అమరనాధ్. శంకర్‌కు మధ్య మధ్య మతిభ్రమణం కలుగుతూ ఉంటుంది. ఆ మతిభ్రమణం ఒకోసారి రెండు మూడు నెలలు ఉంటుంది. ఆ సమయంలో అతడు రోడ్లమీద పరుగులు తీస్తాడు. ఆ పరిస్థితి వచ్చినప్పుడల్లా అతడ్ని అన్నదమ్ములు కట్టిపడేస్తారు. ఒకరోజు అతడికి అకస్మాత్తుగా మతిభ్రమణం కలిగింది. ఆ సమయంలో ఇంట్లో ఎవరూ లేరు. రోడ్డుమీద పిచ్చిగా పరుగులు తీస్తూ స్పీడుగా వస్తున్న లారీ కింద పడిపోయాడు. లారీ అతడి మీద నుంచి దూసుకుపోయింది. ఆ రక్తపు మడుగులో అతని శరీరం ఖండ ఖండాలుగా పడిపోయింది

నిశ పెళ్ళికూతురై అత్తవారింట్లో అడుగుపెట్టేనాటికి ఉమేశ్‌కు పదహారేళ్ళు మాత్రమే. పదేళ్ళ నిశ ఉమేశ్‌తో సన్నిహితంగా మెలిగేది. తన ఊరి గురించి అనేక కబుర్లు చెప్పేది. ఆ ఊరి చెరువు గురించీ, తన స్నేహితురాళ్ళ గురించీ చెప్పేది. ఉమేశ్ మౌనంగా వినేవాడు ఒకోసారి ఆమె వాగుడు వినడానికి విసుగ్గా వుండేది. అయినా చిన్న పిల్ల.

ఆ ఇంట్లో ఆమెతో మాట్లాడే వాళ్లెవరూ లేరు. అందుకే సహనంగా ఆమె చెప్పే మాటలు వినేవాడు.

"మా ఊళ్ళో ఒక శివుడు గుడి వుంది. నేను రోజూ ఆ గుడికి వెళ్ళేదాన్ని." ఒకరోజు నిశ ఉమేశ్‌తో అన్నది.

"వెళ్ళి ఏం చేసేదానివి?"

"నా కోరిక తీర్చమని ప్రార్థించేదాన్ని."

"ఏం కోరిక?"

"నాకు చాలా మంచి భర్తను ఇవ్వమని కోరేదాన్ని."ఉమేశ్ అమాయకంగా చెప్తున్న ఆ పసిదాని ముంఖంలోకి జాలిగా చూశాడు.

ఉమేశ్ క్రమంగా నిశను అభిమానించసాగాడు. ఉమేశ్ పుట్టగానే తల్లిపోయింది. అక్కచెల్లెళ్లు లేరు. ఉమేశ్ ఏ ఆడపిల్లతోనూ అంత దగ్గరగా మాట్లాడటం జరగలేదు.

ఉమేశ్‌కు తాలీంఖానా అంటే ఇష్టం. వ్యాయామం నేర్చుకొనేవాడు. అలాగే నిశతో మాట్లాడడంకూడా ఇష్టం. ఎక్కువ సమయం తాలీంఖానాలో వస్తాదులతో గడిపేవాడు. మిగతా సమయం నిశ కబుర్లు వింటూ గడిపేవాడు.

ఉమేష్ కుస్తీలు పట్టడం నేర్చుకున్నాడు. బరువు ఎత్తడం నేర్చుకున్నాడు. వస్తాదులకు వస్తాదుగా తయారయ్యాడు. మంచి పైలవాన్ కావాలంటే బ్రహ్మచారిగా వుండాలనే భావం అతడికి వుండేది. తను గామాలా పేరు పొందాలనే అభిలాష బలంగా ఏర్పడిరది. ఉమేష్‌కు ఎలాంటి వ్యసనాలూ లేవు.

నిశమీద అతడికి ఎలాంటి కోరికా లేదు. అయినా ఆ పిల్ల అంటే ఇష్టపడేవాడు.

శంకర్‌కు నిశ తన భార్య అనే జ్ఞానం కూడా లేదు. శరీరం పెరిగినా మనసు ఎదగలేదు. ఉమేశ్‌కు అమర్‌నాథ్ మీద కోపం వచ్చేది. కాల క్రమేణ ఆ కోపం అసహ్యంగా మారింది. ఒక మూర్ఖుడికి బంగారం లాంటి పిల్లను కట్టిపెట్టి ఘోరమైన పాపం చేశాడనిపించేది. నిశమీద జాలి వేసేది.

శంకర్ చనిపోయే నాటికి నిశకు పదహారేళ్ళు వచ్చాయి. శంకర్ చనిపోయినందుకు ఆమెకు బాధ కలగలేదు. ఆమె ఎప్పుడూ శంకర్‌ను తన భర్తగా భావించలేదు.

ఒకరోజు ఉమేష్ నిశను గుడికి తీసుకెళ్ళి పెళ్లి చేసుకున్నాడు.

రాజదేవ్‌కు అసలు విషయం అర్థం అయింది.

"వీళ్ళిద్దరూ ఈ గ్రామంలో వుండకూడదనేగా మీ కోరిక?" చుట్టూ చేరిన జనాన్ని ఉద్దేశించి అడిగాడు రాజదేవ్.

"అవునవును. ఈ గ్రామం కలుషితం కావడాన్ని మేము భరించలేం. వాళ్ళిద్దరూ ఈ గ్రామం నుంచి వెళ్ళిపోవాలి." ఒక్కసారిగా అనేక కంఠాలు అరిచాయి.

"అలాగే. రేపు ఉదయం నేను ఢిల్లీ వెళ్తున్నాను. తెల్లవారే వరకు వీళ్ళిద్దరూ మా ఇంట్లో నాతో వుంటారు. రేపు ఉదయం నాతో ఢిల్లీ తీసుకెళ్తాను." అన్నాడు.

జనంలో కలకలం బయలుదేరింది. రాజదేవ్ అందర్నీ కలియ చూశాడు. అతడి చూపులకు అందరి నోళ్లూ మూతపడ్డాయి. నిశ దగ్గర కెళ్ళి, వంగి ఆమెను లేవదీశాడు. ఉమేశ్‌ను అంతవరకూ పట్టుకొని ఆపుతున్న వాళ్లు అతడ్ని వదిలేశారు. ఉమేశ్ ఉద్రేకంతో ముందుకు దూకాడు.

"ఉమేశ్ ఆగు. మీ ఇద్దరి క్షేమంకోరి హెచ్చరిస్తున్నాను. జాగ్రత్త." అరిచాడు రాజదేవ్.

ఉమేశ్ రాజదేవ్ కంఠస్వరం విని ఆగిపోయాడు. మౌనంగా నిల బడ్డాడు.

రాజదేవ్ తన జీవితంలో ఎన్నో ఒడుదుడుకుల్ని అనుభవిం చాడు. కష్టాలను చవిచూశాడు. ఎవరి ఆసరా లేకుండానే తన కాళ్ళమీద తనే నిలదొక్కుకున్నాడు. చీకటిని చీల్చుకుంటూ వెలుగులోకి పయనిం చాడు. స్వయంప్రతిభతో ఉన్నతస్థాయికి చేరుకున్నాడు. అతనికి మూఢ విశ్వాసాలంటే చిరాకు. సంప్రదాయం పేరుతో జరిగే అన్యాయాలను ఎన్నోసార్లు ఎదుర్కొన్నాడు. అలాంటి సమయాల్లో బంధువుల కోప తాపాలకు గురి అయ్యాడు.

లలితను తన జీవిత భాగస్వామినిగా పొందే ప్రయత్నంలో కుటుంబంలోని వారితో ఎంతో ఘర్షణ పడాల్సివచ్చింది. ఎన్నో అవమా నాలను ఎదుర్కోవాల్సివచ్చింది. జీవితం అంటేనే సంఘర్షణ. మానవుడు క్రియాశీలుడు జీవితంలో మానసికంగా ఎన్నోసార్లు కృంగిపోవడంకూడా జరుగుతుంది. ఆ స్థితినుంచి పైకి లేవగలవాడే జీవితంలో విజయాన్ని సాధిస్తాడు. రాజదేవ్‌కు పాత విలువలంటే గౌరవం లేదు. జీవితం మారు తుంది. మారేదే జీవితం. జీవితం మారుతుంది కనుక జీవితం విలువలూ మార్తాయి. రాజదేవ్ జీవితాన్ని కొత్త దృక్కోణం నుంచి చూడడానికి అలవాటు పడ్డాడు. అందుకే ఉమేశ్ నిశను వివాహం చేసుకోవడం అతనికి తప్పుగా అన్పించలేదు.

అతడి గ్రామం రతన్‌పూర్‌లో జరిగిన ఈ సంఘటనతో రాజ దేవ్‌కు ఎలాంటి ప్రమేయంలేదు. అయినా తను చేసిన ఆ పని తన కుటుంబ జీవితం మీద దెబ్బ తీస్తుందని అతడు ఊహించలేదు.

రాజదేవ్ నిశను మాత్రమే తీసుకొని ఢిల్లీ వెళ్ళాల్సి వచ్చింది.

ఉమేశ్ తాలింఖానా యజమాని దగ్గర ఐదేళ్లుగా సెక్రెటరీగా పని చేస్తున్నాడు. అతనికి వెయ్యి రూపాయలు అతడినుంచి రావాల్సివుంది. ఉమేశ్ తన యజమాని బాబూసాహబ్ ఇంట్లోనే భోజనం చేసేవాడు. ఎప్పుడూ డబ్బు అవసరం అతడికి కలగలేదు. నిశను తీసుకొని ఢిల్లీ వెళ్లగానేసరిపోదు. ఏదో ఒక పని వెతుక్కోవాలి. అంతవరకు డబ్బు కావాలి. అందువల్ల అతడు రాజదేవ్‌తో ఢిల్లీ వెళ్ళలేదు. డబ్బు తీసుకొని ఒకటి రెండు రోజుల్లో ఢిల్లీ వస్తానని చెప్పి రాజదేవ్‌తో నిశను పంపించాడు.

రైలులో ఎక్కేంతవరకూ రాజదేవ్ నిశ ముఖం సరిగా చూడలేదు. వారిద్దరిపట్ల అతడికి ప్రత్యేకమైన అభిమానం ఏమీలేదు. అతను ఊహించని పరిస్థితి ఎదురైంది. ఒక మనిషిగా ఒక స్త్రీని రక్షించాడు. వాళ్ళు తన బంధువులు కాకపోయినా ఆ స్థితిలో రాజదేవ్ అలాగే స్పందించి వుండేవాడు. కాని బ్రతక నేర్చిన వాడెవడూ అతడు చేసిన పని చెయ్యడు.

నిశ పుట్టిన ఊళ్ళో మిడిల్ స్కూల్ వుంది. ఆమె స్కూల్లో ఎనిమిది వరకు చదివింది. ఆ తర్వాత పెళ్ళి పేరుతో ఆ గ్రామం వదిలి కొత్త గ్రామం వచ్చింది. కొత్తవాళ్ళ మధ్యకు వచ్చింది. ఆ తర్వాత ఆమె బయటి ప్రపంచం చూడలేదు. ఇంటి నాలుగు గోడల మధ్యనే వుండిపోయింది.

నిశను తీసుకొని రాజదేవ్ ఫస్టు క్లాసు కంపార్టుమెంటులో ఎక్కాడు. కంపార్ట్‌మెంట్ ఖాళీగా వుంది. రాజదేవ్ సామాను సర్దుతున్నాడు. నిశ ఒక మూల ముఖం మీదకు ముసుగు లాక్కొని, తనలోకి తనే కుంచించుకుపోతున్నట్టుగా, బిక్కు బిక్కు మంటూ నిల్చొని వుంది. రాజదేవ్ ఆ ఊరు ఎప్పుడు వచ్చినా వెళ్ళేప్పుడు ఉళ్ళో వున్న

చిన్ననాటి స్నేహితులూ, అతడి అన్నా స్టేషన్‌కు వచ్చి సాగనంపే వారు. కాని ఈసారి ఎవరూ రాలేదు. అప్పుడు రాజదేవ్ పెద్దన్న పుష్కర్ కూడా అక్కడే వున్నాడు. రాజదేవ్ నిశని ఢిల్లీకి వెంటబెట్టు కొని వెళ్ళడం అతడికి సుతారమూ ఇష్టం లేదు.

గుమాస్తాగా అతడికి వచ్చే జీతం తక్కువే అయినా ఒక్కొక్క పైస లెక్కబెట్టుకుంటూ కొంత డబ్బు కూడబెట్టాడు. చాలా లౌక్యుడు. తన కూతుళ్ళిద్దరి పెళ్లిళ్ళు అయేంత వరకు ఉమ్మడి కుటుంబంలోనే వున్నాడు. పెళ్లి అయిపోయాక, తండ్రి బ్రతికి వుండగానే భాగం పంచుకొని వేరుపడ్డాడు. ఆ తర్వాతే ఉద్యోగం చేస్తూ కూడబెట్టిన డబ్బుతో డాబా ఇల్లు కట్టుకున్నాడు. పెద్ద కొడుకు స్వార్థపరత్వానికి తండ్రి కూడా చాలా బాధపడ్డాడు. రాజదేవ్‌కు వచ్చిన భాగం ఇంట్లో తండ్రి వేరుగా వుండేవాడు.

అందరికంటే చిన్నవాడు అమాయకుడు. వివాహం చేసుకోలేదు. పుష్కర్ తెలివితో అతడ్ని తన దగ్గర పెట్టుకొని భాగంలో వచ్చిన ఆస్తిని కూడా చేజిక్కించుకొన్నాడు. తండ్రి చనిపోయాక రాజదేవ్ వచ్చి ఇంటి వాటాలో ధాన్యం బస్తాలు పెట్టేసి ఆక్రమించుకొన్నాడు. అందువల్లనే అతడికి ఆ రాత్రి ఇంట్లో పడుకోవడానికి కూడ స్థలంలేక వరండాలో చలిలో పడుకోవాల్సివచ్చింది. రాజదేవ్ అన్న స్వార్థంచూసి మనసులోనే బాధపడ్డాడు. కాని పైకిమాత్రం ఏమీ అనలేకపోయాడు. తండ్రికూడా పెద్దకొడుకు చేసిన పనికి బాధపడి చనిపోయాడని రాజదేవ్‌కు తెలుసు.

పుష్కర్ సనాతన భావాలుగలవాడు. మూఢనమ్మకాలు కలవాడు. సంప్రదాయం అంటే పడి చచ్చిపోతాడు. అందువల్లనే ఉమేశ్ నిశను పెళ్ళి చేసుకొని ఘోరపాపం చేసినట్లుగా బాధపడిపోయాడు. రాజదేవ్ వాళ్ళను సమర్థించడం అతడికి నచ్చలేదు. చాలా కోపం వచ్చింది.

రాజదేవ్ ఎప్పుడూ తనను ఏదీ యాచించలేదనే కుళ్ళు కూడా వుంది. పైగా అతడు ఒక ప్రముఖ పేపరుకు ఉపసంపాదకుడు కావడం అసూయనుకూడా కలిగించింది. తమ్ముడి పేరుప్రతిష్ఠలు చూసి గర్వించడానికి బదులుగా ఈర్ష్యపడడంతో రాజదేవ్ అమితమైన మానసిక వ్యథకు గురి అయ్యాడు.

సూర్యోదయానికి ముందే పుష్కర్ గ్రామంలో ఇంటింటికెళ్ళి రాజదేవ్ మహాపాపాన్ని సమర్థిస్తున్నాడనీ, తను పుట్టిపెరిగిన గ్రామానికి అనిష్టం కలుగజేస్తున్నాడనీ చెప్పివచ్చాడనే విషయం రాజదేవ్‌కు తెలిసిపోయింది. గొప్పవాడినయాననే పొగరు వాడి కళ్ళను కప్పిందని కూడా చెప్పాడని తెలిసింది. రాజదేవ్ ఇది విని చాలా బాధపడ్డాడు.

రాజదేవ్‌తో కొందరు ఆ విషయం చెప్పి అతడు చేస్తున్నది నిజంగానే తప్పు పని అని పుష్కర్‌ను సమర్థించారు.

"నేనేం పాపం చేయలేదు. చెయ్యకూడని తప్పు చెయ్యలేదు. ఈ గ్రామంలోనే కొందరు డబ్బున్న వాళ్ళు, వయసు ముదిరిన వాళ్లు ఐదారుగురు పిల్లల్ని అసుర వివాహం చేసుకున్న వాళ్లున్నారు. వాళ్ళందరూ సుకర్మ చేసినవాళ్ళా? ఒక పదిహేడేళ్ళ అసహాయ బాలికను రక్షించిన నేను కుకర్మ చేశానా? పాపం చేశానా? వాళ్ళంతా పుణ్యం చేసిన వాళ్ళా? మా అన్న కొడుకు లాల్ ఢిల్లీలో ఏమేమి చేస్తున్నాడో చెప్పదల్చుకోలేదు. పాతిక వేలు కట్నం తీసుకొని పెళ్ళి చేసుకున్నాడు. కొద్ది రోజులకే భార్యను పుట్టింటికి తరిమేశాడు. ఆ పిల్లకు జరిగిన అన్యాయం సంగతేమిటి? తన కొడుకు చాలా పుణ్యాత్ముడని భావిస్తున్నాడా? అప్పుడప్పుడు వేలకు వేలు తండ్రి పంపిస్తున్నాడు. అందుకే అతడికి తన కొడుకు చేసే పనులన్నీ సత్కార్యాలుగా కన్పిస్తున్నాయి. అంతంత డబ్బు వాడికి ఎక్కడ్నుంచి వస్తుందని ఎందుకు ఆలోచించడు?" ఆవేశంగా అన్నాడు రాజదేవ్.

పుష్కర్ చిన్నకొడుకు ప్రమోద్ దుర్గపూజ సందర్భంగా ఆ ఊరు వచ్చివున్నాడు. అతడికి పినతండ్రి అంటే ఎనలేని గౌరవం. రాజదేవ్ ప్రమోద్‌ను చిన్నతనంలో తన బిడ్డలా చూసుకొనేవాడు. ప్రమోద్ స్టేషన్‌కు వచ్చాడు బాబాయిని పంపించడానికి. రాజదేవ్ పాదాలకు నమస్కరించి కంపార్టుమెంటు నుంచి దిగబోతున్న ప్రమోద్‌తో రాజదేవ్ అన్నాడు బాధగా "ప్రమోద్. మీ నాన్న నా గురించి మన ఊళ్ళో ఎలాంటి ప్రచారం చేస్తున్నాడో నీకు తెలుసా?"

"అవును బాబాయ్. నేనంతా విన్నాను."

"నువ్వూ మీ నాన్న మాటలు నమ్ముతున్నావా?"

"లేదు బాబాయ్. నువ్వు ఒక ఆదర్శ పురుషుడిగా నిరూపించుకున్నావ్. ఉమేశ్ నిశను పెళ్ళిచేసుకోకుండా వుండివుంటే ఆమెను నేను చేసుకొనేవాడిని. నేను ఈ మాటలు ఆవేశంలో అనడంలేదు. బాగా ఆలోచించే అంటున్నాను. ఉమేశ్ నిశను ఆవేశంలో చేసుకున్నాడేమో చెప్పలేను. కాని నేను మాత్రం ఆలోచించినమీదటే చేసుకొని వుండేవాడ్ని".

అంతవరకూ బరువుగా వున్న గుండె ప్రమోద్ మాటలు వినగానే తేలిక పడింది. రాజదేవ్ హాయిగా గుండెల నిండా గాలి పీల్చుకొన్నాడు.

ప్రమోద్ మరోసారి రాజదేవ్ పాదాలకు నమస్కరించి బండి దిగాడు.

రైలు చిన్నగా కదిలింది. కొంతసేపు కిటికీలో నుంచి బయటకు చూస్తూ నిల్చున్నాడు రాజదేవ్. అతడికి అకస్మాత్తుగా నిశ గుర్తొచ్చింది. తన కాబిన్ లోకి వెళ్ళి చూశాడు. ఇంకా నిశ ఒక మూల భయం భయంగా నిల్చునే వుంది.

"కూర్చో నిశా? ముఖం మీద నుంచి ముసుగు తీసెయ్. ఇప్పుడు నువ్వు ఢిల్లీ వెళ్తున్నావ్. గ్రామం ఆచారాలు అక్కడే వదిలెయ్" అని రాజదేవ్ ఓ పక్కగా సీటుమీద కూర్చున్నాడు.

కాని నిశ కూర్చోలేదు. అలాగే నిల్చుంది.

రాజదేవ్ లేచి నిశ దగ్గరకు వచ్చాడు.

చెయ్యి పట్టుకొని సీటుమీద తన పక్కగా కూర్చోబెట్టాడు.

"చూడు నిశా. నేను నీకంటే చాలా పెద్దవాడ్ని. నువ్వు నా ముందు చిన్న పిల్లవు. ఆ ముసుగు తీసెయ్. కబుర్లు చెప్పు. హాయిగా నవ్వు, భయపడకు" అన్నాడు.

నిశ రాజదేవ్ కూర్చోబెట్టినచోటునే బిగిసుకొని కూర్చొంది. రాజదేవ్ ఆమెను పరిశీలనగా చూశాడు. నిశ పైటచెంగు కొసను వేలుకు చుట్టుకొంటూ, ఊడదీస్తూ కూర్చుంది. ఈమె పేరు నిశ అని పెట్టారు. కాని జ్యోత్స్న లేక పూర్ణిమ అని పెట్టివుండాల్సింది అనుకొన్నాడు.

ఆమె చేతులవైపు చూశాడు. ఆమె వేళ్ళు సన్నగా పొడవుగా అందంగా వున్నాయి. గోళ్ళలో చేరిన మట్టిని చూసి అరచేతుల్ని చూసి ఆమె ఎంత పనిచేసేదో అర్థం చేసుకొన్నాడు. చీరతో చుట్టివున్నా ఆమె శరీరం సౌందర్యం ప్రస్ఫుటంగా కన్పిస్తూనే వుంది.

రాజదేవ్ సీటుకు చేరబడి కళ్ళు మూసుకున్నాడు. అతని బుర్రలో చీమలబారులా ఆలోచనలు పాకుతున్నాయి.

"నిశను నాతో చూసి లలిత ఏమంటుందో? ఎలా భావిస్తుందో? లలిత మనసు మంచిది. ఆమె కరుణామూర్తి. ఇతరుల బాధ చూడలేదు. నిశ విషయం వింటే తప్పక ఈమెను ఆదరిస్తుంది. కాని...తన మధ్య నా మధ్య మరో వ్యక్తి వచ్చిందని భావిస్తేమాత్రం తుఫాన్ లేవదిస్తుంది.

ఆ అనుమానం వస్తే ఇంకేమైనా వుందా? ఈ విషయంలో లలిత ఏకాధిపత్యాన్ని వహిస్తుంది ఇంటి పని అంతా చేసుకుంటుంది వచ్చిపోయేవారికి అతిథి సత్కారాలు చేస్తుంది. ఎంత పనివున్నా నాకు సంబంధించిన పని తను చెయ్యాల్సిందే. మరెవరు చేసినా సహించదు. నా కూతురు నందిని నా బట్టలు సర్ది పెట్టినా, పెన్ అందించినా, అన్నం వడ్డించినా మనసులోనే కుళ్ళుకుంటుంది. చాలాకాలంగా లలిత ఆరోగ్యం అంత బాగుండటం లేదు. నేను ఆమెతో విశ్రాంతి తీసుకోమంటాను. ఆమెను కష్టపెట్టడం ఇష్టంలేక అప్పుడప్పుడు అవసరం అయితే నందినిని కానీ, నివేదతను కానీ పిలుస్తాను. ఆ సమయంలో లలిత పెదవులమీద వేదనాభరితమైన చిరునవ్వు లాస్యం చేస్తుంది.

"ఏం నేను ఏమయ్యాను? కూతుళ్ళను ఎందుకు పిలుస్తున్నావ్?" అంటుంది.

ఇప్పుడు నేను ఒక అందమైన నవయువతిని వెంటబెట్టుకొని వెళ్తున్నాను. దీని ప్రతిక్రియ లలిత మీద ఎలా పడ్తుందో?

అసలు కథ చెప్తే అర్థం చేసుకుంటుందనే ధైర్యంతో తీసుకెళ్తున్నాను. ఉమేశ్‌కు మా ప్రెస్‌లోనే ఉద్యోగం ఇప్పిస్తాను. చిన్నవాటా అద్దెకు తీసుకు వేరుగా వుంటాడు."

రకరకాల అనుమానాలతో, ఆలోచనలతో మథన పడసాగాడు రాజదేవ్.

అకస్మాత్తుగా అతడి పాదాలకు ఏదో తగిలినట్టయి త్రుళ్ళిపడి చూశాడు.

నిశ కింద కూర్చుని తన రెండు చేతులనూ అతడి పాదాలమీద వుంచి వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

"అరే! ఇదేమిటి! ఎందుకు ఏడుస్తున్నావ్. లే! లే? నాకు ఏడ్చే వాళ్లంటే అసహ్యం" అన్నాడు.

రాజదేవ్ వంగి ఆమెను లేవదీస్తుండగా ముఖం మీద వున్న ముసుగు వెనక్కు జారింది.

మేఘావృతమైన ఆకాశంలో ఒక్కసారిగా మెరుపు మెరిసినట్టు అయింది. బూడిద ఊదాక కణకణలాడే నిప్పులాంటి మండించే సౌందర్యం అది. బ్రహ్మ తీరిగ్గా కూర్చుని తన నైపుణ్యాన్నంతా వినియోగించి తయారు చేసిన బొమ్మలా వుంది. కోటేరు లాంటి ముక్కు - ఆల్చిప్ప ల్లాంటి వేళ్ళు. లక్క పిడతలాంటి నోరు. చిన్న గడ్డం.

"ఓహ్! ఏం సౌందర్యం? అద్వితీయ సౌందర్యమూర్తి." మనసు లోనే అనుకొన్నాడు.

రాజదేవ్ నిశను సీటుమీద కూర్చోబెట్టాడు. రుమాలుతో ఆమె కళ్ళు తుడిచాడు.

"ఎందుకేడుస్తావ్? నీ కష్టాలు తీరిపోయాయి. ఉమేశ్‌కు ఢిల్లీలో ఉద్యోగం ఇప్పిస్తాను. ఢిల్లీలో మీ జీవితంలోకి ప్రవేశించి బాధించే వాళ్ళెవరూ వుండరు. హాయిగా, స్వేచ్ఛగా బ్రతకవచ్చు, ఏడవకు. ఢిల్లీ లాంటి మహా నగరంలో నువ్వెవరని గానీ, ఎక్కడ్నుంచి వచ్చావని గానీ ప్రశ్నించే వాళ్ళుండరు" అన్నాడు రాజదేవ్.

నిశకు పుట్టిబుద్ధెరిగాక అంత ఆదరణ ఎవరినుంచీ లభించలేదు. రాజదేవ్ గురించి ఆ గ్రామంలో గొప్పగా చెప్పుకోవడం నిశ విన్నది. అంత గొప్పవ్యక్తి అదరణ చూపిస్తుంటే ఆమెకు దుఃఖం కట్టలుతెంచుకొని పొంగుకొస్తున్నది. ఆమె ఇంకా ఏడుస్తూనే వుంది.

ఆమె దుఃఖం అతడికే హృదయ విదారకంగా వుంది. అది మామూలు దుఃఖంకాదు. ఎదుటి వ్యక్తిని పూర్తిగా ముంచేసే దుఃఖం.

ఎంత సౌందర్యం ? ఎంత దుఃఖం ?

రాజదేవ్ దుఃఖం సుడిగుండంలో చిక్కుకొని అసహాయంగా కొట్టుకుంటున్నట్టుగా అన్పించింది. అతని గుండెల్లో ఎగిసి పడుతున్న విషాదం, హద్దుదాటి దూకుతున్న సాగర తరంగాలా వుంది.

తనెందుకు ఇంత బాధపడుతున్నాడు. ఆమె అలౌకిక సౌందర్యం చూసేనా ? అమరనాథ్‌ను తప్పుపట్టడం న్యాయం కాదేమో ? ఇంత సౌందర్యం మరొకరిసొత్తు కావడాన్ని భరించలేక పోయివుంటాడు.

తనూ అందుకే ఇంత బాధపడుతున్నాడా? - కాదు. ఆమె అంత సౌందర్యవతి అని ఇప్పటివరకు తనకు తెలియదు.ఆమె శరీర సౌందర్యం గురించి తను ఆలోచించకుండానే ఆమెకు తను ఆశ్రయం ఇచ్చాడు. ప్రేమలో స్వార్థం ఉండదనడం నిజమే. కాని ఆ ప్రేమ అప్పుడప్పుడు మానవుడ్ని వివేకరహితుడ్నికూడా చేస్తుంది. తన కర్తవ్యాన్ని, బాధ్యతల్ని మరిపించేది ప్రేమకాదు. కామంతోకూడిన ఆకలి.

రాజదేవ్ మనసును కూడదీసుకొన్నాడు.

ఫ్లాస్కులో వున్నటీ ఫ్లాస్కుమూతలోపోసి నిశకు అందించాడు. నిశ మౌనంగా చిన్నగా టీ తాగింది. అప్పటికి ఆమె స్థిమిత పడింది. రాజదేవ్ కోటువిప్పి హుక్కుకు తగిలించ బోయాడు. నిశ ఆ కోటును తీసుకొని హుక్కుకు తగిలించింది.రాజదేవ్‌కు ఆమె చేసిన పని ఆనందాన్ని కలిగించింది.

"తినడానికి ఏం చెప్పమంటావ్? వచ్చే స్టేషన్‌లో చెప్పాల్సి వుంటుంది" అన్నాడు.

"మాంసం చేపలు తప్ప మరేదైనా తింటాను."

రాజదేవ్ ఆమె ముఖంలోకి చూస్తూ "సాత్వికాహారం తింటావా? చాలా మంచి అలవాటే. నేను అన్నీ తినేస్తాను. నీకోసం నేను శాకాహారిని అవుతాను."

"ఎందుకూ? మీకు ఇష్టమైన భోజనం మీరు చెయ్యండి."

"నీముందు కూర్చున్నవాడు గద్దలా మాసం పీకి పీకి తింటుంటే నీకు అసహ్యం అనిపించదా?"

"అలా అనకండి. మీరు దేవుడిలాంటి మనిషి. మీరు రాకపోతే మీ అన్నయ్య నన్ను గద్ద లాగా పొడిచి పొడిచి చంపేసి వుండేవాడు."

"ఆ భగవంతుడికి దయలేదు."

"అలా అనకండి, నేను అభాగ్యురాలిని. నేను స్వర్గంలోకి వెళ్ళినా అది నరకంగా మారుతుంది."

"దురదృష్టవంతుల్ని అదృష్టవంతులుగా చెయ్యలేనిది స్వర్గం ఎలా అవుతుంది. సరి ఇక నువ్వు ఆ విషయాలు మర్చిపో. గతాన్ని తవ్వుకొని బాధపడకు."

"నేను పుట్టగానే తల్లిని తినేశాను. ఏడేళ్ళు రాగానే తండ్రిని మింగేశాను. ఏడేళ్ళు నిండాయో లేదో వివాహం అయింది. పెళ్ళికి అర్థం తెలియకుండానే విధవను అయ్యాను. నా గురించి బావగారూ అక్కగారూ రోజూ పోట్లాడుకొనేవారు."

"నీ గురించి వాళ్ళిద్దరూ ఎందుకొట్లాడుకొనేవారు?"

రాజదేవ్‌కు ఆమెను మాట్లాడించాలని వుంది. బాధను చెప్పుకొంటే మనసు తేలికపడుతుందని అతడికి తెలుసు.

"ఏం చెప్పమంటారు? ఏ నోటితో చెప్పను?"

రాజదేవ్ ఆశ్చర్యంగా చూస్తూ "ఫర్వాలేదు చెప్పు."

"చెప్తాను. మీకు చెప్తాను. మీరు చాలా మంచివారు. ఈ విషయం పహిల్వాన్‌గారికి కూడా చెప్పలేదు."

"ఉమేశ్‌కు కూడా చెప్పలేదా? ఏమిటది?"

"నా స్నేహితురాళ్ళు నన్ను పూలవతి అని పిల్చేవారు. నేను పువ్వులా ఉంటాననేవారు. కాని వాళ్లకు నేను ముల్లులా కన్పిస్తానని నాకు తెలుసు. చిన్నతనంనుంచే దురదృష్టం నన్ను చుట్టేసింది. పైగా పాపం చేశాను. బావగార్ని పాప పంకిలంలోకి దించాను. అందుకే..." అని ఆగిపోయింది.

రాజదేవ్ నిశ కేసి విస్మయంగా చూశాడు. నిశ కళ్ళల్లో కన్నీళ్లు కన్పించాయి. నిశ తన కళ్ళను పైటచెరగుతో తుడుచుకుంది.

"మొదట బావగారు నన్ను ప్రేమగానే చూసేవారు. నా వయసు పెరుగుతున్నకొద్దీ అదోలా చూసేవారు. ఆ చూపులు నాకు ఎలాగో వుండేవి. భయం వేసేది. నా భర్త అప్పటికి బతికేవున్నాడు. ఒకరోజు బావగారు నాకు పౌడరూ, స్నో, సబ్బూ తెచ్చి ఇచ్చారు. ఎవరికీ చెప్ప వద్దన్నారు. నాకు అవి తీసుకోవాలనిపించలేదు. కాని ఆయనకు కోపం వస్తుందనే భయంతో తీసుకున్నాను నా మనసులో ఎన్నో అనుమానాలు తలెత్తాయి. ఒకరోజు పౌడరూ, సబ్బూ తెస్తే ధైర్యం తెచ్చుకొని నా కక్కర లేదన్నాను.

"వద్దనకు. నేను సంపాదించేది నీ కోసమే" అంటూ నన్ను రెండు చేతులతో దగ్గరకు తీసుకొని గట్టిగా కౌగిలించుకొన్నాడు. నేను విడిపించు కోవడానికి పెనుగులాడు తున్నాను. అంతలోకే తలుపు తట్టిన శబ్దం అయింది. ఒక్కసారిగా నన్ను వదిలేసి వెళ్ళి తలుపు తెరిచాడు. పహిల్వాన్ వచ్చాడు. అతడ్ని చూడగానే ఆయన విరుచుకుబడ్డాడు పహిల్వాన్‌మీద.

"పాపం! ఈ పిల్లను ఎవరూ పట్టించుకోవడంలేదు.నువ్వు ఎప్పుడూ బయట తిండి తింటూ ఇంటి సంగతి పట్టించుకోవు. అన్ని విషయాలూ నేనే చూసుకోవాల్సి వస్తోంది" అంటూ ఆయన విసురుగా బయటికి వెళ్ళి పోయాడు.

పహల్వాన్ నా చేతిలోవున్న రూపాయల నోట్లకేసి చూశాడు. నేను రూపాయలు పట్టుకొని అపరాధిలా నిలబడిపోయాను అప్పట్నుంచీ మా బావగారు కాన్పిస్తే దూరంగా పారిపోయేదాన్ని. రెండు మూడుసార్లు అవకాశం దొరికినప్పుడల్లా ఆయన నన్ను అలాగే చేశాడు. ఎలాగో పట్టు విడిపించుకొని బయటపడ్డాను. నా పిచ్చిభర్త చచ్చిపోయాడు. అంత వరకూ నాకేమీ తెలియదు. ఆయన నన్ను నా శరీరాన్ని ఏనాడూ ముట్టుకో లేదు. పసిపిల్లవాడిలా అప్పుడప్పుడు నా దగ్గర కూర్చుని ఏవేవో అర్థం పర్థంలేని మాటలు చెప్తూ నవ్వేవాడు. ఆయన చచ్చిపోతే నాకు దుఃఖం వచ్చింది. చాలా రోజులు ఏదో బాధగా వుండేది. పహల్వాన్‌కూడా నన్నెప్పుడూ బాధపెట్టలేదు. ఎంలో ఆదరణగా చూసేవాడు. బావగారినిగురించి ఆయనకు చెప్పాలంటే భయంగా వుండేది. కొందరు గ్రామంలో కొంటెకుర్ర వాళ్ళు ఇంటిముందు నిల్చుని పిచ్చిచూపులు చూసేవాళ్లు. ఒకరోజు ఒక కుర్రాడైతే ఇంట్లోకే వచ్చేశాడు. అప్పుడు పహిల్వాన్‌తో నా బాధ వెళ్ళ బోసుకున్నాను."

అంతవరకు చెప్పి నిశ అకస్మాత్తుగా ఆగిపోయింది. ఆమె ఏదో ఆలోచనలో పడిపోయింది.

"ఆఁ! చెప్పు ఆపేశావేం? ఆ తర్వాత ఏం జరిగింది?" అని అడిగాడు రాజదేవ్.

నిశ ఒకసారి కళ్ళెత్తి రాజదేవ్‌ను చూసి మళ్ళీ కళ్ళు దించుకుంది.

నిశకు తన గురించీ, ఉమేశ్ గురించీ చెప్పడం ఇష్టం లేనట్టుగా గ్రహించుకొన్నాడు రాజదేవ్.

"మంచిది. నీకిష్టం లేకపోతే చెప్పొద్దులే. ఉమేశ్..."

"కాదు, కాదు. అలాంటిదేంకాదు. మీనుంచి ఏదో దాచాలనే ఉద్దేశ్యం నాకు లేదు. రెండు రోజుల క్రితం గంగలో కార్తీక స్నానాలు చెయ్యడానికి పహిల్వాన్ నన్ను తీసుకెళ్ళారు. అక్కడ్నుంచి బేగూసరాయ్ తీసుకెళ్ళారు. గ్రామం తిరిగి వచ్చేసరికి బావగారు మాకోసం ఎదురుచూస్తున్నారు.

"మరదల్ని ఎక్కడకు తీసుకెళ్ళావ్?" కోపంగా ప్రశ్నించారు బావగారు.

"పెళ్ళి చేసుకోవడానికి తీసుకెళ్ళాను." వెనకాముందు చూడకుండా పహిల్వాన్ అనేశాడు.

"ఏమన్నావ్? పెళ్ళి చేసుకోవడానికెళ్ళావా? ఎవరితో" పెద్దగా అరిచారు బావగారు.

"నిశ పెళ్ళి. నిశను నేనే చేసుకున్నాను. అలా అరవకు. కాళ్లు విరగ్గొట్టి మూలకూర్చోపెడ్తా మళ్ళీ మాట్లాడావా ? నీ పాపాల మూట నా దగ్గర వుంది. దాన్ని విప్పమంటావా?"

పహిల్వాన్ ఎదురు తిరిగేసరికి నోరు మూసుకొని ఉండిపోయారు బావగారు అప్పటికి. అర్ధరాత్రిపూట తనకు కావాల్సినవి తీసుకొచ్చాడు.

ఆ తర్వాత జరిగింది మీరే స్వయంగా చూశారు."

# 4

రాజదేవ్ ఊహ నిజమైంది.

రాజదేవ్ నిశ గురించి చెప్పినదంతా విని లలిత మనసు కరిగి పోయింది. నిశను ఎంతో ఆదర పూర్వకంగా తన గదిలోకి తీసుకెళ్ళింది. స్నానాల గది చూపించింది. కొద్దిసేపు కబుర్లు చెప్పి రాజదేవ్ దగ్గరకు వచ్చింది.

"రామ్. నందినిని కూడా తీసుకెళ్ళు. నిశ ఎప్పుడు పట్నాలు చూడలేదు. పల్లెటూరి పిల్ల" అంటున్నాడు రాజదేవ్.

"రామ్‌ను ఎక్కడికి పంపిస్తున్నావ్?" ఆమె కంఠంలోని కోపానికి రాజదేవ్ అవాక్కయాడు.

ఇంతలోనే ఏం జరిగింది. ఆ పిచ్చి పిల్ల ఏం చెప్పిందో?

"నిశ దగ్గర మంచి బట్టలు లేవు. అందుకే రామ్‌ను నిశతో వెళ్ళి ఆమెకు కావాల్సిన చీరలు కొని పెట్టమంటున్నాను. నందినిని కూడా తోడు తీసుకెళ్ళమంటున్నాను" అన్నాడు సంజాయిషీ ఇచ్చుకుంటున్న ధోరణిలో.

"రామ్ బజారుకు వెళ్ళాడు." ఖచ్చితంగా పలికింది లలిత.

తల్లి ఆ మాట అనడంతోనే రామ్ చిన్నగా అక్కడ్నుంచి జారు కోవడాన్ని గమనించాడు రాజదేవ్.

లలిత రామ్ బయటికి వెళ్ళినవైపే చూస్తూ వుండిపోయింది.

"లలితా! నిన్ను అర్థం చేసుకోవడం చాలా కష్టం. ఉన్నట్టుండి మూడు మారిపోతుంది." అన్నాడు రాజదేవ్ కుర్చీలో నుంచి లేస్తూ.

"నన్ను నువ్వేం అర్థం చేసుకోనక్కర్లేదు. వెళ్ళి స్నానం చెయ్యి. లలిత చీరల సంగతి నేను చూసుకుంటాలే. నువ్వు మగవాడివి. మగవాడిగా బయటి పని చూసుకో."

రాజదేవ్ మారు మాట్లాడకుండా స్నానానికి వెళ్ళి పోయాడు. అలాంటి సమయాల్లో అతడు మౌనాన్ని ఆశ్రయిస్తాడు. అనవసరంగా ప్రశ్నలువేసి ఇంటిని కురుక్షేత్రంగా మార్చడం అతడికి ఇష్టం వుండదు. ఒకనాడు ఆమె కిలకిలా నవ్వి అతడి మనసును ఆనంద సాగరంగా మార్చింది. కాని ఈ నాడు ఆ నవ్వు ఒక ప్రతిధ్వని మాత్రంగానే అతడి జీవితంలో మిగిలి పోయింది.

లలిత అంతగా మారిపోవడానికి కారణం రాజదేవ్‌కు తెలుసు.

వారి వివాహానికి రెండు కుటుంబాలవారూ వ్యతిరేకించారు. కాలేజీలో చదువుతున్న కొడుకును పెట్టుబడిగా (కేపిటల్‌గా) భావించాడు అతడి తండ్రి. లలితతో వివాహం అయితే అతడికి ఆశించిన కట్నం లభించదని తెలుసు. లలిత పెళ్ళికూతురుగా అత్తవారింటికి వచ్చింది. కాని ఆమె ఆశించిన ఆదరం అక్కడ దొరకలేదు. పైగా తిరస్కారం ఎదురైంది.

"ఏంతల్లీ. నిన్ను పెళ్ళికూతురుగా చూడాలా ? పట్నం వేషాలు వేసి మా వాడ్ని వల్లో వేసుకున్నావ్. పెళ్ళికిముందే అన్నీ జరిగిపోయి వుంటాయి." మొదలైన మాటలతో లలిత మనసును తూట్లు పొడిచారు. వారి మాటలు ఆమెకు శూలాల్లా తగిలాయి.

చాల రోజులు రాజదేవ్‌కు ఎవరూ ఎలాంటి సహకారం అందించలేదు. లలిత పుట్టింటివారుకుడా ఆమెమీద వ్యంగ్యబాణాలు విసరసాగారు.

రాజదేవ్ దీనస్థితివల్ల లలిత ఎన్నో అవమానాలకు గురిఅయింది. లలిత ఇంట్లోవారికి కూడా ఈ వివాహం ఇష్టంలేదు. కట్నం లేకుండా

చెల్లెలు పెళ్ళి అయిపోతుందనే భావంతో ముఖేశ్ మాత్రం ఈ వివాహానికి సుముఖతను చూపించాడు. రాజదేవ్ ఎం.ఏ. పాసయ్యాడు కనక పెద్ద ఆఫీసరు అవుతాడని ముఖేశ్ భావించాడు.

రాజదేవ్ చెప్పులు అరిగేలా తిరిగినా చిన్న ఉద్యోగం కూడా దొరకలేదు. రాజదేవ్‌ను ముఖేశ్ చిన్నచూపు చూడసాగాడు.

రాజదేవ్‌కు ఇప్పటికీ బాగా గుర్తుంది - కాశీలోని ఒక దినపత్రికలో టెంపరెరీగా సబ్‌ఎడిటర్ ఉద్యోగం దొరికింది. అప్పుడు లలిత పుట్టింటిలో వుంది ఒకరోజు ఆమెకు తీవ్రమైన కడుపునొప్పి వచ్చింది. ఇంట్లో ఎవరూ పట్టించుకోలేదు. వృద్ధురాలైన తల్లి పక్కవీధిలో వున్న రాఖాల్ అనే బెంగాలీ డాక్టర్‌ను పిల్చుకొనివచ్చింది. అతను డాక్టరో లేక కాంపౌండరో ఎవరికీ తెలియదు. రెండూ కాకపోనూవచ్చు. అతడు లలితకు చికిత్స చెయ్యసాగాడు. అతడి చికిత్సతో లలిత కడుపునొప్పి ఎక్కువైంది. మరీ భరించలేని నొప్పి వచ్చినప్పుడు ఒక మత్తు ఇంజక్షన్ ఇచ్చి వెళ్ళిపోయేవాడు.

ఆ సమయంలో ముఖేశ్ ఆ ఊరు వచ్చాడు. చెల్లెలి జబ్బు గురించి అనేక ప్రశ్నలు వేశాడు డాక్టర్ను. ముఖేశ్ పెద్ద ఆఫీసరని అతడికి తెలుసు. ఏం జబ్బు అని చెప్పాలో అతడికి తెలియలేదు అసలు జబ్బేమిటో డాక్టరుకు తెలిస్తేగదా చెప్పడానికి? కాసేపు తడబడ్డాడు.

"ఏం జబ్బంటే చెప్పరేం?" ముఖేశ్ రెట్టించాడు.

"గర్భ కోశంలో క్యాన్సర్" అనేశాడు. అలా చెబితే ముఖేశ్ చెల్లెల్ని తనతో పట్నం తీసుకెళ్తాడనీ, తనకు ఈ బాధ తప్పుతుందనీ ఆశించాడు డాక్టర్.

ముఖేశ్ లలితను తనతో తీసుకెళ్ళడానికి సిద్ధపడలేదు. ముఖేశ్‌కు టెలిగ్రాం ఇచ్చాడు. రాజదేవ్ హడావిడిగా వచ్చాడు.

"లలితకు క్యాన్సర్ అట. కాశీగానీ, పాట్నాగానీ తీసుకెళ్ళి చికిత్స చేయించు" అన్నాడు ముఖేశ్.

రాజదేవ్‌కు నెత్తిన పిడుగు పడినట్టయింది. భార్యకు క్యాన్సర్ అని విన్న అతడికి నవనాడులూ కృంగిపోయాయి. పైగా అతడు భార్యను కాశీ తీసుకెళ్ళి చికిత్స చేయించే స్థితిలో లేడు. బిడ్డతో భార్యను తీసుకెళ్ళి కాపరం పెట్టడమే అసాధ్యం. అతడి ఆర్థిక పరిస్థితి బొత్తిగా బాగా లేదు.

మారు మాట్లాడకుండా లలితనూ, బిడ్డనూ తీసుకొని రాజదేవ్ కాశీకి బయలుదేరాడు.

ఆ రోజు అతడు ముఖేశ్ అసలు రూపాన్ని చూశాడు.

కాశీ వెళ్ళాక లలితకు క్యాన్సర్ కాదనీ, అపెంటిస్‌సైటిస్ అనీ తెలిసింది.

చాలీ చాలని జీతం. గొర్రె తోక జీవితం. పుట్టింట్లో ఆదరణ లేదు. అత్తింటి గురించి ఇక చెప్పనే అక్కర్లేదు. లలిత నవ్వడం మర్చిపోయింది. భయంకరమైన మానసిక వ్యధను అనుభవించింది. ఆమె స్వభావం పూర్తిగా మారిపోయింది. ఆమె గుండెలోని తడి ఆరిపోయింది. మనసులో తీరని అసంతృప్తి. ఆమెలోని మార్పుకు కారణాలు రాజదేవ్‌కు మాత్రమే తెలుసు. ఆమె తన అసంతృప్తిని ఎవరిముందూ కక్కలేదు. కోపం వచ్చినప్పుడు రాజదేవ్ మీద విరుచుకుపడేది.

రాత్రి నిస్తబ్దతనుచీలుస్తూ చిన్నగా సన్నగా "ఒక మాటచెప్తాను వింటారా ?" అని భర్తను అడిగింది లలిత.

"చెప్పు !" అన్నాడు రాజదేవ్ భయపడుతూనే. ఏదైనా తనకు ఇష్టంలేని పని చెయ్యమని పురమాయించేప్పుడు లలిత అలాగే చిన్నగా మాట్లాడుతుందని రాజదేవ్‌కు తెలుసు.

"ఉమేశ్ ఎప్పుడొస్తాడు ?"

"రేపో మాపో వస్తాడు."

"అతను వచ్చేలోగా ఎక్కడైనా ఒక చిన్న వాటా అద్దెకు చూడండి. అతడు రాగానే ఇద్దర్నీ అక్కడికి పంపించెయ్యండి."

రాజదేవ్ మౌనంగా వుండిపోయాడు.

"ఆ ఊరివాళ్ళ కోపానికి మన కుటుంబం గురికావడం నాకెంత మాత్రం ఇష్టం లేదు." మళ్లీ అన్నది లలిత.

ఇందులో మన కుటుంబం ఆ ఊరివాళ్ల కోపానికి గురికావడానికి ఏముంది? కొంచెం విసుగ్గా అన్నాడు.

"ఇద్దరు ఆడపిల్లలకు పెళ్ళిళ్లు చెయ్యాలి. సంప్రదాయ విరుద్ధపు పనులుచేసి అయిన వాళ్ళకు కోపంతెప్పించడం మంచిదికాదు. మీ అన్నకు కూడా మీరుచేసినపని ఇష్టంలేదని మీరేచెప్పారు," లలిత కంఠం తీవ్రంగా పలికింది.

"మా అన్నయ్య ఎప్పుడు మనతో సఖ్యతగా వున్నాడు?"

"అదంతా నాకు తెలియదు. సరే ఈ ఇంట్లో వుండడానికి వీల్లేదు." అన్నది.

ఆ రాత్రంతా రాజదేవ్‌కు నిద్రలేదు. లలిత ప్రవర్తన ఒక్క రోజులోనే అలా మారడం రాజదేవ్‌కు ఆశ్చర్యాన్ని కల్గించలేదు. కాని అమితంగా బాధపడ్డాడు. తన జీవిత భాగస్వామిని తనతో ఏ విషయం పూర్తిగా మాట్లాడదు. తను మాట్లాడడానికి అవకాశం ఇవ్వదు.

రాత్రంతా రాజదేవ్ మనసులో మధనపడ్తూనే గడిపాడు. "నా జీవితమంతా ఒడుదుడుకులతోనే గడిచింది లలిత కూడా అందులోని భాగమే. అనుకోని సంఘటనలు ఎన్నో జరిగాయి. లలిత నా జీవితంలో అలాగే ప్రవేశించింది. నేను ఊహించుకొన్న లలిత గాలి వంటిది కని పించనిది. కేవలం స్పర్శ మాత్రంగా మిగిలిపోయింది. కాని గాలి కొద్ది నిముషాలు ప్రపంచం నుంచి అంతర్థానమైతే ఏమౌతుంది? అది ఎంత భయంకర పరిణామానికి దారి తీస్తుందో తెలిసిన విషయమే.తన జీవితంలో లలిత కూడా......" అతని బుర్రను తొలుచుకొంటూ చీమలబారులా సాగిన ఆలోచనలు ఒక్క క్షణం కూడా అతడ్ని నిద్రపోనివ్వలేదు ఆ రాత్రి.

ఒక వారం గడిచింది.

ఉమేశ్ వచ్చే జాడ కన్పించలేదు.

రోజుకురోజూ ఇంటి వాతావారణంలో టెన్షన్ పెరగసాగింది.

నాలుగైదు రోజులు గడిచాయి. "అమ్మ రామ్ అన్నయను బాగా తిట్టింది" అని నివేదిత తండ్రికి చెప్పింది. నివేదిత ద్వారానే నిశను బయటకు రావద్దని లలిత ఆజ్ఞాపించినట్లుగా కూడా తెలిసింది.

దీనికి కారణం ఎంత ఆలోచించినా రాజదేవ్‌కు బోధపడలేదు.

"నిశకోసం ఇల్లు చూశారా లేదా ?" తెల్లవారి లలిత భర్తను అడిగింది.

ఇల్లు ఇల్లంటూ వెంటబడ్తావేం? వయసులోవున్న వంటరి పిల్లను, ఈ ఢిల్లీలో వంటరిగా వేరే ఇంట్లో ఎలా పెట్టమంటావ్?" రాజదేవ్ కోపంగా అన్నాడు.

"ఉమేష్ ఎక్కడ చచ్చాడు ? రాడేం? రెండు మూడు రోజుల్లో వస్తాడని చెప్పావుగా ?"

"ఇక్కడ కూర్చుని అతడు ఎందుకు రాలేదో నేనెలా చెప్ప గలను? బహుశా అతడి యజమాని అతడికి రావాల్సిన డబ్బు ఇంకా ఇవ్వలేదేమో?"

"అలా ఎందుకనుకోవాలి? తన నెత్తిమీద బరువును నీ నెత్తిమీద పెట్టి నిశ్చింతగా కూర్చున్నాడని ఎందుకనుకోకూడదు?"

"ఏమిటి నువ్వు మాట్లాడుతున్నది? నీకు మతిపోయిందా ఏం? ఆ రోజు ఉమేష్ అన్న నిశను కొట్టడం నన్ను ఇరికించడానికి అతడు చేసిన కుట్ర అంటావా?"

లలితకు అసలే కోపంగా వుంది. తోకతొక్కిన నాగినిలా లేచింది.

"నీకే మతిపోయింది. నాకు కాదు. ఒక అందమైన వయసులో వున్న పిల్లను చూడగానే నీకు మతిపోయింది. అందుకే వెంటేసుకొచ్చావ్. ఆ తర్వాత ఏం జరుగుతుందో కొంచెమైనా ఆలోచించావా?"

"ప్లీజ్ లలితా, నా మాట నమ్మ. ఆ సంఘటన జరిగేంత వరకు నేను నిశను అసలు చూడనేలేదు. అవిడ అందమైందో అంద విహీన మైందో కూడా నాకు తెలియదు. నన్ను అర్థం చేసుకో. ఇదంతా అనుకో కుండా జరిగిన సంఘటన."

"అనుకోకుండా జరిగింది కనుక రేపు అనుకోకుండానే దాన్ని తీసుకెళ్ళి ఎక్కడైనా వుంచిరా."

"ఎక్కడ వుంచను, ఎవతో వుంచను? కాస్త తాపీగా ఆలోచించు లలితా."

"నన్ను ఆలోచించ మంటావా ? నువ్వేమో ఆలోచించేదాన్ని గ్రామంనుంచి వెంటేసుకొచ్చావా ? ఉమేశ్ రాకపోతే నిశను జీవితాంతం ఇక్కడే వుంచుతావా ?

లలిత ఉగ్రరూపం చూసి రాజదేవ్ స్థాణువులా అయిపోయాడు.

ఒకప్పుడు లలిత ఆ మాట అంటే న్యాయమనే తనకు అనిపించేది. ఈ రోజు తమ ఆర్థిక పరిస్థితి ఆరోజులా లేదు. నిశలాంటి అనాథల్ని నలుగుర్నయినా తను పోషించగలడు. లలితకు ఒక అసహాయ బాలిక మీద ఆమాత్రం దయలేదా? లలిత మనసు ఇంత కఠినమైనదా? ఏమాలోచించి ఈ పిల్లను ఢిల్లీకి తీసుకొచ్చారని ప్రశ్నిస్తున్నది. ప్రతిపనీ ఆలోచించే చేస్తామా? ఒక మంచి పని ముందుగా ప్రణాళిక వేసుకొని చేస్తామా?

లలితను నిలదీసి కారణం అడగాలనుకొన్నాడు. చెప్పకపోతే బలవంతంగా చెప్పించాలనుకొన్నాడు. ఆ పిల్ల ఈ ఇంట్లో వుంటే జరిగే అనర్థం ఏమిటని నిలదీసి అడగాలనుకొన్నాడు. కాని అడగలేక పోయాడు. అలాచేస్తే దానివల్ల ఎలాంటి దుష్పరిణామాన్ని ఎదుర్కోవాలో అతడికి బాగా తెలుసు.అందుకే అడగలేక పోయాడు. ఏది ఏమైనా తను నిశను గాలికి వదిలెయ్యలేననీ, అలా చెయ్యడం తనవల్లకాదనీ అనుకొన్నాడు.

ఆ తర్వాత వారం రోజుల్లోనే ఒక భయంకరమైన పరిస్థితి రాజదేవ్ ఎదుర్కోవాల్సి వచ్చింది.

ఆరోజు అతడు రాత్రి డ్యూటీకి అనుకోకుండా వెళ్ళాల్సి వచ్చింది. అకస్మాత్తుగా భారతదేశపు ఉత్తర సరిహద్దుమీద చైనాదురాక్రమణ చేసిందనే వార్త వచ్చింది. ఆ వార్తను వ్రాయడానికి అతడు పత్రికాఫీసుకు వెళ్ళాల్సి వచ్చింది.

ముఖ్యమైన వ్యాసం సగం వ్రాశాడో లేదో ఇంటి నుంచి నందిని ఫోన్ వచ్చింది.

"నాన్నా త్వరగా ఇంటికిరా. అమ్మ ఆరోగ్యం బాగాలేదు." దాదాపు ఏడుస్తూనే చెప్పింది.

రాజదేవ్‌కు మతి పోయినంత పని అయింది. లలిత అతడిన్ని ఎంత బాధ పెట్టినా ఆమె లేని జీవితాన్ని ఊహించుకోలేడు. జీవితంలో ఎన్ని కష్టాలు వచ్చినా తల వంచలేదు. తలెత్తుకొని అన్నింటినీ ఎదుర్కొన్నాడు.

ప్రమాద భరితమైన పరిస్థితుల్ని ఎదుర్కోవడంలో అతడు ఆనందాన్నీ, ఉద్వేగాన్నీ పొందేవాడు. స్వాతంత్ర్య పోరాటంలో ప్రాణాలకు తెగించి కొన్ని సంఘటనలను ఎదుర్కొన్నాడు.

1942 అక్టోబరులో, సైన్యాన్ని ఎదిరించి గాంధీ జయంతి సందర్భంగా ఊరేగింపు సాగించాడు. సైన్యం దెబ్బలకు తన ఎముకలు విరిగే ప్రమాదం వున్నదని అతడికి తెలుసు. రోజులకొద్దీ తిండీ తిప్పలు లేకుండా స్వాతంత్ర్యం కొరకు అండర్ గ్రౌండులో వుండి పని చేశాడు. కాలి నడకన చీకటి రాత్రిళ్ళలో కొన్ని మైళ్లు నడిచాడు. కాళ్ల బొబ్బలు ఎక్కినా లక్ష్య పెట్టేవాడు కాడు.

కాని లలితకు ఏమైనా అయిందంటే అతడికి కాళ్లూ చేతులూ ఆడవు.

రాజదేవ్ తన సహ ఉద్యోగిని పిల్చి పరిస్థితిని వివరించి వ్యాసం పూర్తి చెయ్యవలసిందిగా అభ్యర్థించాడు.

హుటాహుటిన ఇల్లు చేరాడు. లలిత గదిలో ఆత్రుతగా ప్రవేశించాడు. ఆమె అర్థ విక్షిప్త అవస్థలో పడి వున్నది. అప్పటికే నందిని డాక్టర్ను పిలిపించింది డాక్టరు పరీక్ష ముగించి బయలుదేరుతున్న సమయంలో రాజదేవ్ ఇల్లు చేరాడు.

"డాక్టర్! లలితకు ఏమైంది?" ఆతృతగా ప్రశ్నించాడు.

"ఆమె అసలే బలహీనంగా వున్నారు. మనసుకు ఏదో బలమైన దెబ్బ తగిలింది. ఆమె ఆ దెబ్బను తట్టుకొనే స్థితిలో లేరు. ఇంజక్షన్ ఇచ్చాను. ఆమెకు విశ్రాంతి కావాలి. పిల్లలు అల్లరి చెయ్యకుండా చూసు కోండి. రేపటినుంచి ఈ మందులు వాడండి. ఆమెకు బలమైన ఆహారం ఇవ్వాలి" అని చెప్పి డాక్టరు వెళ్ళిపోయాడు.

ఓ మూల భయంగా ముడుచుకొని కూర్చుని వున్న నివేదిత మీద రాజదేవ్ దృష్టి పడింది. వెక్కి వెక్కి ఏడుస్తున్నది. నందిని ముఖం కళ్లూ ఉబ్బి వున్నాయి. బాగా ఏడ్చి వుంటుందని అతడికి అర్థం అయింది. లలిత ఒక వైపు స్పృహ లేకుండా మంచం మీద పడి వుంది. రాజదేవ్ చూపులు నలువైపులా పరికించాయి. ఎక్కడా నిశ కన్పించలేదు.

లలిత జబ్బుకు రాజదేవ్ చాలా బాధ పడ్తున్నాడు. నిశ లేక పోవడం అతడికి అంతకంటే ఇనుమడించిన ఆశ్చర్యం కలిగించింది.

"మీ అమ్మకు ఏమైందమ్మా అకస్మాత్తుగా?" నందినిని బయటకు తీసుకొని వచ్చి అడిగాడు.

నందిని మౌనంగా తల వంచుకొని నిల్చుంది.

నందిని ముఖం చూడగానే రాజదేవ్ మనసును అనేక కుశంకలు చుట్టి వేశాయి.

"చెప్పమ్మా! ఏం జరిగింది?"

నందిని మౌనంగానే వుండిపోయింది.

రాజదేవ్ చరచరా నిశ వుండే గదికేసి నడిచాడు. గదిలో ప్రవే శించిన రాజదేవ్ చేష్టలుడిగి నిలబడి పోయాడు.

నిశ నేలమీద బోర్లా పడుకొని గుండెలు అవిసిపోయేలా రోదిస్తు న్నది. హీరామన్ నిశ దగ్గర బిక్క ముఖంతో కూర్చొని వున్నాడు.

రాజదేవ్ స్థాణువులా చూస్తూ వుండిపోయాడు.

ఏం జరిగింది? ఇదంతా ఏమిటి? ఈ ఇంటికి ఏమైంది? ఏదో జరి గింది. లలిత నిశ మీద విరుచుకు పడివుంటుంది.

రాజదేవ్ వంగి నిశను లేవదీశాడు. నిశ కళ్ళెత్తి రాజదేవ్‌ను చూసి ఒకసారిగా నిండుకుండ బద్దలైనట్టుగా భోరున ఏడవసాగింది. అతణ్ని పట్టుకొని పిచ్చిగా ఏడుస్తున్నది.

రాజదేవ్ నిశ అంతగా తనను పట్టుకొని ఏడుస్తుందని ఊహించ లేదు. ఆమె ఏడ్పు విని లలిత లేస్తుందేమోనని భయపడ్డాడు. ఆమె వీపునుస వరిస్తూ మృదువుగా అన్నాడు—

"భయపడకు. లలిత అప్పుడప్పుడు ప్రేమతోనూ తిడుతుంది. ఆమె నీకు తల్లిలాంటిది. ఆమె మాటల్ని పట్టించుకోకు."

రాజదేవ్ మాటలు విని లలిత దుఃఖం కట్టలు తెంచుకుంది. ఇంకా పెద్దగా ఏడవసాగింది.

"లలితకు మత్తు ఇంజక్షన్ ఇచ్చారు. ఆమె నిద్ర చెడిపోతుంది. అంత పెద్దగా ఏడవకు. లలిత ఆరోగ్యం బాగుపడనివ్వు, ఆ తర్వాత నీకు స్థిరమైన జీవితాన్ని చూపిస్తాను. గాభరాపడకు" అన్నాడు.

లలిత దుఃఖాన్ని అణచుకుంది. వెక్కిళ్ళు మాత్రం ఆగలేదు.

రాజదేవ్ నిశ రూపాన్ని పరిశీలనగాచూసి శిలాప్రతిమలా అయ్యాడు.

నిశ జాకెట్ అనేకచోట్ల చిరిగిపోయివుంది. చీరకూడా నలిగి అస్త వ్యస్తంగా వుంది. ఆమె చెక్కిళ్ళ మీదా, మెడదగ్గర గాట్లు వున్నాయి. అదిచూసిన రాజదేవ్ మనసు హాహాకారం చేసింది.

"ఇదంతా లలిత పనేనా?" సందేహం వెంటనే అణగిపోయింది. "లలితలాంటి కరుణామూర్తి ఇలా చెయ్యదు. చెయ్యలేదు. మరి ఇదంతా ఎవరు చేశారు? ఎందుకు చేశారు?

ఆలోచిస్తున్న రాజదేవ్ బుర్రలో అకస్మాత్తుగా మెరుపు మెరిసి నట్టు ఓ ఆలోచన వచ్చింది.

"రామ్ అన్నయ్య ఎక్కడ్రా?" అని హీరామన్‌ను అడిగాడు.

"అన్నయ్య పారిపోయాడు." వెంటనే సమాధానం ఇచ్చాడు.

ఇంట్లో అందరికంటే చిన్నవాడైన హీరామన్‌ను అడిగితేనే అసలు విషయం బయటపడు తుందనిపించింది రాజదేవ్‌కు.

"ఏం జరిగింది బాబూ?"

హీరామన్ లేచి తండ్రి దగ్గరకొచ్చి నిలబడి చెప్పాడు.

"అన్నయ్య నిశ అక్క గదిలోకి వచ్చి అక్కతో కలబడ్డాడు. నిశ అక్కయ్య పెద్దపెద్దగా కేకలు పెట్టింది. అమ్మ ఆ కేకలు విని ఈ గది లోకి వచ్చింది. అమ్మను చూడగానే, అమ్మను ఒక్క తోపు తోసి రామ్ అన్నయ్య పారిపోయాడు."

రాజదేవ్‌కు విషయం తెలిసి పోయింది. తను ఒక బందిఖానాలో ఉన్నట్టూ, ఉష చేతులు తన వైపు వస్తున్నట్టుగా తోచింది. చాలా సేపు అతడు శిలా విగ్రహంలా నిలబడి పోయాడు.

క్రోధం, ఘృణ, గ్లానితో అతడి కళ్ళు నిప్పు కణాల్లా మండ సాగాయి.

రామ్ అక్కడ లేకపోవడం మంచిదయింది. లేకపోతే అతడు

క్రమంగా లలిత మాటలకు అర్థం అతడికి బోధపడింది. లలిత తనతో రోజూ నిశను వేరే ఇల్లు చూసి ఎక్కడైనా పెట్టమని ఎందుకు పోరాడిందో అర్థం అయింది. రామ్ చరిత్ర హీనుడని అతడికి తెలుసు. కాని రామ్ లజ్జా రహితంగా ఇంట్లోవున్న వాళ్ళమీదే ఇంత ఘోర అత్యాచారానికి పాల్పడలాడని అతడు కలలో కూడా ఊహించలేక పోయాడు.

రాజదేవ్‌కు తన మీద తనకే కోపం వచ్చింది. నిశ, లలితల మానసిక వ్యధకు కారణం తనేనని భావించాడు.

చిన్నగా కదిలి నిశ దగ్గరకు వెళ్ళాడు. ఆమె భుజంమీద లాలనగా చెయ్యివేసి అన్నాడు—

"నిశా జరిగినదానికి నన్ను క్షమించు. అపరాధిని నేను. నేను ఒక బరువును నెత్తికి ఎత్తుకున్నప్పుడు నా శక్తిసామర్థ్యాల గురించి ఆలోచించాల్సి వుంది.నిన్ను తీసుకొచ్చాను. కాని నిన్ను ప్రశాంతంగా వుంచలేక పోయాను. సరైన రక్షణ కూడా కలిగించలేక పోయాను.

"బాబుగారూ ! నేను దురదృష్టవంతురాల్ని. నేను ముందే మీతో చెప్పాను - నేను ఎక్కడ అడుగుపెడ్తే అక్కడ అనర్థం జరుగుతుందని నేను స్వర్గంలోకి వెళ్ళినా అది నరకంగా మారుతుందని చెప్పాను" నిశ గొంతు దుఃఖంతో పూడుకుపోయింది.

రాత్రంతా రాజదేవ్ లలిత మంచం పక్కనే కూర్చుండిపోయాడు.

ఉదయం లలిత కళ్ళు తెరిచింది. ఆదుర్దాగా భర్త ముఖంలోకి చూసింది క్రితంరోజు జరిగిన సంఘటన తన భర్తకు తెలిసిపోయిందేమోనని భయంగా చూసింది అతడికి అంతా తెలిసిపోయిందని అతడి ముఖమే చెప్తోంది.

లలిత రాజదేవ్ చెయ్యి పట్టుకొని అన్నది-"నేను రోజూ చెప్తూనే వున్నాను నిశను మరెక్కడైనా ఇల్లు తీసుకొనిపెట్టమని. నా మాటలకు నీకు కోపం వచ్చింది. చూశావుగా ఒక అమాయక బాలికకు జరిగిన భయంకర దుస్థితిని ? నేను సమయానికి వెళ్ళాను కనక సరిపోయింది. రామ్ నెత్తిమీద భూతం కూర్చుంది. ఏం చెయ్యాలో అర్థం కావడంలేదు. మనం కష్టాల్లో ఉన్నప్పుడు రాముడు పుట్టాడు. ఆ సమయంలో మనకు ఎవరినుంచీ సహాయసానుభూతులు లభించలేదు. ఉదయం తిని సాయంత్రం తిండికోసం ఆలోచించే రోజులవి. వాడు తండ్రి ప్రేమకు కూడా నోచుకోలేదు. అభాగ్యుడు చిన్నతనంనుంచే మార్గం తప్పిపోయాడు."

"ప్రేమంటే రాత్రింబవళ్ళు వాడి నామస్మరణ చెయ్యడమనా నీ ఉద్దేశ్యం?" రాజదేవ్ ప్రశాంతంగా అన్నాడు.

తను ఆశించిన సమాధానమే లలితకు వచ్చింది.

"నామస్మరణ చెయ్యమని ఎవరంటారు. వాడి చెవ్వు మెలిపెట్టు. కొట్టు. తప్పు చేసినప్పుడు వాడికి ఏ శిక్షయినా విధించు. ఇందులో ఏది చేసినా వాడికి నువ్వు తండ్రివని అన్పించేవాడివి. వాడు నీ కొడుకు కనక బాధపడి శిక్షిస్తున్నావని నాకు అన్పించేది. వాడికి పద్ధెనిమిదేళ్ళు వచ్చాయి. ఒక్కసారి ప్రేమగా దగ్గర కూర్చోబెట్టుకొని మాట్లాడావా? పోనీ తిట్టావా? వాడు పరాయివాడు అన్నట్టుగా ఉదాసీనంగా ఉండిపోయావు."

రాజదేవ్ మౌనంగా విన్నాడు. జవాబు చెప్పలేకపోయాడు.

రాత్రంతా నిద్ర లేకుండా ఆలోచిస్తూ కూర్చున్నాడు ఇప్పటికీ అతడి మనసు ఇటుకల బట్టీలా కాగుతున్నది. లలిత ముందు అతి కష్టంమీద నిగ్రహించుకొని కూర్చున్నాడు. లలితకు మందు ఇచ్చాడు. స్నానాలగది వరకూ చెయ్యి పట్టుకొని నడిపించుకొని వెళ్ళాడు. తనుకూడా స్నానం చేసి ఆఫీసుకు బయలుదేరాడు.

రాజదేవ్ బయటకు అడుగు పెట్టాడో లేదో రామ్ లోపలకు వస్తూ కన్పించాడు. తండ్రిని చూసి ఎవరో కాళ్లను బంధించినట్టుగా నిల్చుండి పోయాడు. ముందుకు వెళ్ళలేదు. తిరిగి పరిగెత్తనూలేదు.

రామ్‌ను చూడగానే రాజదేవ్ వళ్ళు మర్చిపోయాడు. ఒక్క సారిగా ముందుకు దూకి రామ్‌ను పట్టుకొని నేలమీద పడేశాడు. రాజదేవ్ కోపం తారస్థాయిని అందుకుంది. తనేం చేస్తున్నాడో తనకే తెలియని స్థితి అది.

కాళ్ళతో తన్నుతూ, చేతులతో అందినచోటల్లా కొడుతున్నాడు రాజదేవ్. ఆ దెబ్బలు తప్పించుకొనే ప్రయత్నంలో రామ్ నేలమీద అటూ ఇటూ దొర్లుతున్నాడు. రాజదేవ్ చేతులు కొట్టి కొట్టి అలసి పోయాయి. ఒక్క ఉదుటున వెళ్ళి బయటి గేటుకున్న పెద్ద కర్ర ఊడ బీకి రామ్‌ను బాదసాగాడు. రాజదేవ్ రామ్ చచ్చాడో ఇంకా బతికి వున్నాడో కూడా ఆలోచించకుండా కొడుతున్నాడు. బహుశా చచ్చిపోయే వాడే. రామ్ కేకలు విని నిశ పరిగెత్తుకొచ్చి రామ్ శరీరంమీద పడి పోయింది. నిశకు కూడా ఒకటి రెండు కర్ర దెబ్బలు తగిలాయి. నిశమీద కర్ర దెబ్బలు పడగానే రాజదేవ్‌కు తానేం చేస్తున్నాడో తెలిసింది. నిశ, కోడి తన పిల్లను రెక్కల కింద దాచుకున్నట్లు రామ్ మీద దెబ్బ పడకుండా పడుకొని వుంది. అప్పుడే చూశాడు రామ్ నోటి నుంచీ, తల నుంచీ రక్తం ప్రవహించడం. లలిత చేష్టలుడిగి వాకిట్లో నిలబడి వుంది. ఆమె కళ్ళు భావ రహితంగా వున్నాయి. ఆ కళ్ళలో భయంకరమైన నిర్లిప్తత ఉంది ఆమె ముఖంలో కూడా ఎలాంటి భావాలూ లేవు.

ఆమెను చూసి రాజదేవ్ కర్ర దూరంగా పారేసి గరాజ్ కేసి నడిచాడు.

# 5

రాజదేవ్ బాధతో మూలుగుతున్నాడు. మోకాళ్ళ నొప్పులు తీవ్రంగా వున్నాయి.

గడ్డి పరక ఆసరా అయినా దొరుకుతుందేమో నన్న ఆశతో నలువైపుల పరిశీలనా దృక్కులు సారించాడు.

సూర్యోదయం అవుతోంది.

అరణ్యంలో దట్టంగా వున్న చెట్ల సందుల్లో నుంచి సూర్య కిరణాలు భూమి మీద పడ్తున్నాయి. పరిసరాల్ని పరిశీలిస్తున్న అతని దృష్టి ఎడమ వైపున ఒక బీభత్స దృశ్యం మీద ఆగిపోయింది.

అక్కడ ఒక మనిషి శరీరానికి సంబంధించిన మధ్య భాగం బాగా కాలి ఉబ్బి పడివుంది. ఆ శరీరం తాలూకు తలా, మోకాళ్ళ క్రింది భాగం లేదు. కాలి ఉబ్బిన ఆ శరీరం పక్కనే విమానపు రెక్క ఒకటి పడి వుంది.

రాజదేవ్‌కు వెన్నెముకలో ఏదో జరజర పాకినట్టు అయింది. ఆ బీభత్స దృశ్యాన్ని చూస్తూ నిలువెల్లా వణికిపోయాడు. ఒక్కసారిగా లేచి కూర్చున్నాడు. అలా కూర్చోవడంలో భరించలేని బాధ కలిగింది. అతి కష్టం మీద తన వంటి మీది కోటు విప్పి ఆ మాంసం ముద్ద మీదకు విసిరాడు. అది సరిగ్గా వెళ్ళి దానిమీదనే పడింది. మరు క్షణం అతనికి తన తలమీద ఎవరో నీరు గుమ్మరించినట్టు అన్పించింది. చెమటతో వళ్ళంతా తడిసి ముద్దయిపోయింది. తల తిరుగుతున్నది కళ్లు బయర్లు కమ్ముతున్నాయి. కళ్లు మూసుకొని మళ్లీ పడుకొన్నాడు.

కొంచెం స్థిమితం చిక్కగానే రాజదేవ్ మళ్ళీ నలువైపులా కలియ చూశాడు. ఎక్కడా నర సంచారం లేదు. మర్రి చెట్లూ, సాల వృక్షాలూ

ఆకాశాన్ని కొలిచే ప్రయత్నంలో ఉన్నట్టు నిలబడి వున్నాయి. దట్టమైన అరణ్య ప్రదేశం అనీ, తనొక కొండ పక్కగా, లోయ ప్రదేశంలో పడి వున్నట్టు గ్రహించుకొన్నాడు. అక్కడక్కడ మానవ శరీర ఖండాలు కన్పిస్తున్నాయి. దూరం నుంచి ఏనుగ ఘీంకారం విన్పించింది. రాజదేవ్ మనసులో అనేక కుశంకలు బయలుదేరాయి.

ఇప్పుడు ఏమౌతుంది? ఆకలితో, దప్పికతో ఇక్కడ ఇలా గిల గిల లాడి చావాల్సిందేనా? ఇక్కడ తను చచ్చినట్టు తెలిపేవాడూ తెలుసు కొనేవాడూ కూడా లేడు. తను అకాల మృత్యువుకు గురి కావడం తథ్యం. తనతోటి ప్రయాణీకుల్ని ఈ అకాల మృత్యువే మింగేసింది. ఆ నవ దంపతులు ఎంత అదృష్టవంతులు? వాళ్ళంతా ఎక్కడికి వెళ్ళారు?

వాళ్ళంతా కలసి వెళ్ళిపోయారు. ఎక్కడో ఒకచోట ఏదో రూపంలో వుండే వుంటారు. నేను...నేను ఒంటరిగా ఇక్కడ పడి వున్నాను. నేను...నేను చావుకూ బ్రతుక్కూ మధ్యలో వుండిపోయాను. వాళ్ళంతా చావు గురించి ఆలోచించే లోపలే పరలోకానికి వెళ్ళిపోయారు. అదృష్టవంతులు. చావుకంటే చస్తున్నాననే భావం భయంకరంగా వుంటుంది.

నేను జీవితమంతా చస్తూనే బతికాను. 'నా' అనే మాటను విసర్జించి, ఆత్మను చంపుకొని, సిద్ధాంతాలనూ ఆదర్శాలనూ త్యజించి, జీవితంతో రాజీ పడ్తూనే బతికాను.

ఏది సత్యం? ఏది అసత్యం?

ఇదే సత్యం. మృత్యువే సత్యం. జన్మకు ముందు ఎక్కడున్నాను? మృత్యువు తర్వాత ఎక్కడికెళ్తాను ?

అసలు నేను ఎక్కడ్నుంచి ఎక్కడికెళ్ళాలని బయలు దేరాను ? ఆఁ గుర్తొచ్చింది. కలకత్తాలో విమానం ఎక్కాను. గంటా గంటన్నర

లోపలే ఈ దుర్ఘటన జరిగింది. అందరితోపాటు నేనూ పోయివుంటే ఈ నరకయాతన వుండేదికాదు.

రాజదేవ్ ఆలోచిస్తూ తన కుడిమోకాలు చూసుకొన్నాడు. రక్తం కారడం ఆగిపోయింది. కాని కారిన రక్తం నల్లగా మోకాలు చుట్టూ గడ్డ కట్టింది. భూమి మీద కూడా ఎంతో రక్తం గడ్డకట్టి వుంది. తన పని అయిపోయింది అనుకొన్నాడు. వెంటనే అంతకుముందు తను లేచి కూర్చో గలిగిన విషయం గుర్తొచ్చింది. కేవలం ఆత్మబలంవల్లే కూర్చోగలిగానని అనుకొన్నాడు. ఆత్మబలం మనిషిలో ఉన్నంత వరకూ, ఆతడు మృత్యు వుతో పోరాడగలడు.

తనూ ప్రయత్నిస్తే బతకవచ్చును. కాని ఎలావెళ్ళాలి? ఎక్కడకు వెళ్ళాలి ?

తను పల్లపు ప్రదేశంలో వున్నట్టు గ్రహించాడు. కొద్ది దూరంలోనే సమతల ప్రదేశం వున్నది. ఒక్క కాలుతో ఈ పల్లంలో నుంచి పైకి రాగలడా ? ఆ ప్రయత్నంలో వెనక్కు పడిపోతే ? రెండో కాలుకూడా విరిగిపోతే ?

దాహం ఎక్కువవుతోంది. అతికష్టంమీద కూర్చున్నాడు.

అదే సమయంలో వెనక పొదల్లో ఏదో శబ్దంఅయింది. రాలిన ఆకులు గలగల మంటున్నాయి.

వెనకనుంచి ఏదో వస్తున్నట్టు రాజదేవ్‌కు అనిపించింది.

తను ఎక్కడున్నాడు. బర్మా దగ్గర అడవుల్లోనా ? అక్కడ పెద్ద పెద్ద సర్పాలు వుంటాయని తను విన్నాడు. అవును సర్పరూపంలో మృత్యు దేవత తనను సమీపిస్తోంది. జీవితం ఎంత క్షణభంగురమైనది?

రాజదేవ్‌కు వెనక్కుచూసే ధైర్యంలేక కళ్ళుమూసుకొని కూర్చు న్నాడు.

క్షణంలో సగం సేపట్లో అతని జీవిత సంఘటనలు ఖండ ఖండాలై మనః పటలం మీదకు వచ్చాయి.

రామ్‌ను పూర్తిగా మార్చేసిన ఆ సంఘటను గుర్తుకు రాగానే రాజదేవ్ మనసు వికలమైంది.

ఆ రోజు తను రామ్‌ను ఎంతగా కొట్టాడు? ఒకవేళ వాడు చచ్చిపోయి వుంటే...?

ఆ రోజు రాజదేవ్ ఇంటికి రావడం ఆలస్యం అయింది. లలిత అశాంతిగా అతడికోసం ఎదురుచూడ సాగింది. అతడు ఎప్పుడూ అంత ఆలస్యంగా ఇంటికి రాలేదు. లలిత ప్రెస్‌కు ఫోన్‌చేసింది. ఆ రోజు అతను ప్రెస్‌కు రాలేదని సమాధానం వచ్చింది. అది వినగానే లలితకు నడుం విరిగినట్టుగా అయింది. రామ్ పడుకొనివున్న గదిలోకి వెళ్ళి అన్నది.

"మీ నాన్న జీవితక్రమం మారిందిరా రామ్. ఎక్కడ కెళ్ళారో ఏమో? మంచిపనే అయింది. ఇప్పుడు నువ్వు పెద్దవాడివై పోయావ్. సర్వ స్వతంత్రుడివి. రేపు ఉదయం వరకు ఎదురుచూస్తాను. ఆయన రాకపోతే, ఈ అనారోగ్యస్థితిలోనే నేనూ ఇల్లువిడిచి వెళ్ళిపోతాను. నీ చెల్లెళ్ళనూ తమ్ముళ్ళనూ పెంచి పెద్ద చేస్తావో లేక ఇంత విషం ఇచ్చి చంపుతావో నీఇష్టం." ఆమె గొంతు దుఃఖంతో పూడిపోయింది.

చరచర అక్కడ్నుంచి తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆ రోజు రామ్ బయటికి వెళ్ళలేదు. వళ్ళంతా హూనం అయిపోయింది. కదిలే స్థితిలో లేడు. రామ్ బాధతో మూలుగుతున్నా లలిత అతడ్ని చూడటానికి రాలేదు. నిశ తన బాధను విస్మరించి పగలంతా రామ్‌కు సేవలు చేస్తూనే ఉంది. రామ్ ఆమెను వారించలేదు. ఒక్క మాట కూడా మాట్లాడ లేదు. మౌనంగా మంచంమీద పడి వుండిపోయాడు.

అతడు మానసిక గ్లానితో కుమిలిపోతూ పడుకొన్నాడు. అప్పుడప్పుడు కళ్ళవెంట నీరు కారుతూ వుంది. ఆత్మ విమర్శ చేసుకోసాగాడు.

తల్లి మాటలతో అతడిలో ఓ రకమైన ఆత్మబలం వచ్చింది. లేచి కూర్చున్నాడు. చిన్నగా మంచం దిగి తల్లి గదిలోకి వెళ్ళాడు. లలిత మంచంమీద బోర్లా పడుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"అమ్మా, నేను వెళ్తున్నాను. నాన్నను వెతికి తీసుకొస్తాను. నన్ను నమ్మ. ఆయనతోనే మళ్ళీ తిరిగిరావడం. నేను నిన్ను క్షమించమని అడగను. ఒకరోజు నువ్వే నన్ను క్షమిస్తావు." రామ్ కంఠంలో ఆత్మవిశ్వాసం ధ్వనించింది.

రామ్ గంటలకొద్దీ తండ్రికోసం తిరిగాడు. తండ్రి ఎక్కడెక్కడికి వెళ్తాడో తెలిసిన రామ్ ఆ ప్రదేశాలన్నింటికీ వెళ్ళాడు. తండ్రి స్నేహితుల ఇళ్ళకు వెళ్ళాడు. రాజదేవ్ కన్పించలేదు. రామ్ హతాశుడయ్యాడు. తండ్రి లేకుండా తాను ఇంటికి తిరిగివెళ్ళడు. ఆత్మహత్య చేసుకోవాలనిపించింది. జీవితం నిరర్థకంగా తోచింది. తన తల్లి అన్నమాట నిజమే. ఇంత అనర్థానికి కారణం తనే. తను బతికి వుండకూడదు.

అకస్మాత్తుగా అతడి మనసులో ప్రతీకారేచ్ఛ తలఎత్తింది.

"నేను ఇలా తయారవడానికి కారణం నేను కాదు. నా శరీరంలోకి ఒక రోగం ప్రవేశించింది. ఆ రోగం క్యాన్సర్‌లా నా జీవితాన్నంతా ఆక్రమించుకుంది. నా వివేకాన్ని, మానవత్వాన్ని, ఆత్మీయతనూ ఆ రోగక్రిములు తినేశాయి. ఈ రోగం తనలోకి ఎక్కించింది లాల్‌నారాయణ్. వాడు నాకంటే చాలా పెద్దవాడు. నన్ను రకరకాల వ్యసనాలకు గురిచేశాడు. వాడే నాకు సిగరెట్ తాగడం, డ్రింక్స్ తీసుకోవడం నేర్పించాడు. ఆ పనులు చెయ్యడానికి తను భయపడితే ధైర్యం చెప్పి తనచేత చేయించాడు.

అతడి ప్రోత్సాహంతోనే నేను మొదటిసారిగా ఏనాడు చూడని ఆ పిల్ల వ్యామోహంలో పడ్డాను. మొదట నేను చాలా సంకోచించాను. వాడు పెద్ద పెద్దవాళ్ళ ఉదాహరణలు చెప్పాడు. అది తప్పు పని కాదన్నాడు.

ఆలోచిస్తూ అప్రయత్నంగానే లాల్‌నారాయణ్ ఇంటికేసి నడక సాగించాడు.

తను ఆత్మహత్య చేసుకొనేముందు లాల్‌నారాయణ్ జీవితాన్ని అంతం చెయ్యాలని నిర్ణయించుకొన్నాడు.

రామ్ లాల్‌నారాయణ్ డ్రాయింగ్‌రూంలోకి అడుగుపెట్టి విస్మయంగా చూస్తూ నిలబడిపోయాడు. ముఖం వెలవెలాపోయింది. తన ఆలోచనలకు అకస్మాత్తుగా షాక్ తగిలినట్టుగా బిగిసిపోయి నిల్చున్నాడు.

అక్కడ లాల్‌నారాయణ్ లేడు. రాజదేవ్ సోఫాలో కూర్చుని పుస్తకం చదువుతున్నాడు. అక్కడ రాజదేవ్ తప్ప ఇంకెవరూ లేరు. రాజదేవ్ అలికిడికి తలెత్తి చూశాడు. ఎదురుగా నిలబడివున్న రామ్‌ను విస్మయంగా చూశాడు.

ఎంత కోపం వచ్చినా ఏనాడూ రాజదేవ్ రామ్‌మీద చెయ్యి చేసుకోలేదు. చాలా కోపంవస్తే వ్యంగ్యంగా రెండు మాటలని వెళ్ళిపోయాడు. వారాలకొద్దీ మాట్లాడేవాడు కాదు. రామ్ రెండు మూడు రోజులు దూర దూరంగా వుండేవాడు. ఆ తర్వాత ఏమనిపించేదో తండ్రి చుట్టూ తిరిగేవాడు. తండ్రి పలకరిస్తాడని ఆశపడేవాడు.

తండ్రి చేస్తున్న పని అందుకొని చెయ్యడానికి ప్రయత్నిస్తే "నీ తెలివితేటలు నీ దగ్గరే వుంచుకో. నాకు నీ సహాయం అక్కర్లేదు. వెళ్ళు. వెళ్ళి నీ రాచకార్యాలు చూసుకో." అనేవాడు రాజదేవ్ వ్యగ్యంగా.

రామ్ తండ్రి మాటలకు బాధపడేవాడు. కసిగా బయటికి వెళ్ళి పోయి ఏదేదో చేసేవాడు.

ఆ రోజు రాజదేవ్ పిచ్చివాడే అయ్యాడు. లలిత భావశూన్య, నిర్వికార, నిర్లిప్తముఖం చూశాకగాని తను చేసిందేమిటో తెలిసిరాలేదు.

"ఇవ్వాళ నీ పరాజయం చూసి నాకు సంతోషంగా వుంది." అని ఆమె చూపులు అంటున్నట్టుగా అతడికి తోచింది.

తను చేసిన పనికి రాజదేవ్ సిగ్గుపడిపోయాడు. రామ్‌ను తను ఎంతగా ప్రేమిస్తున్నాడో ఆ తర్వాతే అతడు తెలుసుకొన్నాడు.

రాజదేవ్ ఆ రోజు ఆఫీసుకు వెళ్ళలేకపోయాడు. కారు కుతుబ్ మీనార్‌వైపుకు పోనిచ్చాడు. అక్కడ ఏకాంతప్రదేశంలో కూర్చుని ఎంతోసేపు దుఃఖించాడు. సాయంత్రం అయింది. ఇంటికి వెళ్ళాలనిపించ లేదు. అన్న కొడుకు లాల్‌నారాయణ్ ఇంటికి వెళ్ళాడు. రాత్రి అక్కడ గడిపి తెల్లవారి గ్రామం వెళ్ళి ఉమేశ్‌ను తీసుకొచ్చి నిశను అప్పగించా లని నిర్ణయించుకొన్నాడు. తను ఈ పని చెయ్యగలిగినప్పుడే లలిత ముందుకు వెళ్ళడం జరుగుతుందని నిశ్చయించుకొన్నాడు. రాజదేవ్ వచ్చేసరికి లాల్‌నారాయణ్ ఇంట్లో లేడు. అలమారాలో వున్న పుస్తకాల్లో నుంచి ఒక పుస్తకం తీసి చదువుతూ కూర్చున్నాడు.

తండ్రి కొడుకుల కళ్ళు కలిశాయి. చూపులే మూగభాషలో మాట్లాడుకొన్నాయి. డ్రాయింగ్‌రూమ్‌లో వాళ్ళిద్దరు తప్ప మరో మనిషి లేడు. ఇద్దరు వ్యక్తుల మధ్య వున్న టెన్షన్ ఆ ఇద్దరే వున్నప్పుడు తగ్గుతుంది. మూడో మనిషి వుంటే ఎక్కువ అవుతుంది.

రామ్‌ను చూస్తుంటే ఆ తండ్రి కళ్ళల్లో స్నేహ సాగరం ఉప్పొం గింది. రాజదేవ్ లేచి నిల్చున్నాడు. రామ్ అదే క్షణంలో ఒక్క ఉదుటున వచ్చి తండ్రి పాదాల మీద పడ్డాడు.

రాజదేవ్ వంగి కొడుకుని పొదివి పట్టుకొని లేవదీసి మంచం మీద కూర్చోబెట్టాడు. రామ్‌లోని కాలుష్యాన్ని నిశలోని సాత్విక ప్రేమ కడిగే సింది. పాపం చేసినవాడు తను చేసింది పాపంఅని తెలుసుకోనంత వరకే అది పాపం.తెలుసుకొన్నవాడు తనుచేసిన పాపానికి పశ్చాత్తాప పడ్తాడు. పశ్చాత్తాప అగ్నిలో అతడి మనసు కాలి పాపంనుంచి విముక్తిని పొందు తుంది.

రామ్‌కు ఇప్పుడు భయం లేదు.

అందువల్లనే తండ్రి దగ్గర కూర్చుని తన కుకర్మల గురించి ధైర్యంగా చెప్పసాగాడు.

రాజదేవ్ ఒక చిన్న పత్రికలో సబ్ ఎడిటర్‌గా పనిచేసి నప్పటి నుంచీ కథ ప్రారంభం అయింది.

జీతం చాలా తక్కువ. రామ్ పుట్టిన కొద్దిరోజులకే లలిత జబ్బు పడింది. ఒకసారి కడుపునొప్పివస్తే ఇంకొకసారి అతిసారం పట్టుకొనేది. మరోసారి పచ్చకామెర్లువస్తే, ఇంకోసారి రక్తహీనత వచ్చేది. ఏదో ఒక జబ్బుతో బాధపడుతూనే వుండేది. బంధువులు ఒక్కరూ ఆదుకో లేదు. రాజదేవ్‌కు వచ్చే జీతంలో ఇంటి అద్దె, రెండు పూటలూ భోజనానికి గడవటమే కష్టం. రాజదేవ్‌కు అప్పులు చెయ్యక తప్పేదికాదు.

తెలిసిన వారందరి దగ్గరా అప్పుతీసుకోవడం అయిపోయాక వడ్డీ వ్యాపారి దగ్గర నోటురాసి అప్పులు తెచ్చుకొనే పరిస్థితిలోపడిపోయాడు. ఇంటి వాతావరణం ఎప్పుడు పురిపెట్టిన తాడులా వుండేది.అలాంటి టెన్ షన్‌తో నిండిన వాతావరణంలో రామ్ పెరిగాడు. భార్యా భర్తలమధ్య ఎప్పుడూ ఏ విషయం మీదో చిరాకులు తలెత్తుతూ వుండేవి.

పరిస్థితులను బట్టి కాలం ఆగదు. రామ్ పెద్దవాడౌతున్నాడు. అతడికి తన ఇంటి పరిస్థితిని, ఇరుగు పొరుగు వాళ్ళ పరిస్థితులతో

పోల్చుకొని చూడగలిగిన వయసు వచ్చింది. పైగా తండ్రికి తనంటే ఇష్టం లేదనే భావం ఆ చిన్న మనసులో బయలుదేరింది వయసుతో ఆ భావం కూడా పెరగసాగింది.

ప్రేమ స్థానాన్ని అనుమానం ఆక్రమించుకొన్నది తండ్రంటే నమ్మకం లేదు. స్కూల్లో కూడా అతడు తోటి పిల్లలతో కలిసేవాడు కాదు. ఆత్మ హీనతా భావంతో ముడుచుకొని పోయి వుండేవాడు. మరో కుర్రాడికి మంచి మార్కులు వచ్చినా, మాస్టర్ల ప్రశంసలు పొందినా, ఆ కుర్రాడ్ని రామ్ అసహ్యించుకొనే వాడు. వాడు తనకే ఏదో ద్రోహం చేసినట్టుగా భావించేవాడు. తండ్రి ప్రేమను పొందిన పిల్లల్ని చూస్తుంటే అతడి గుండెలో తాటాకు మంటలా ఏదో భగ్గున మండేది. తల్లి దండ్రుల ప్రేమకు నోచుకోని వాళ్ళతో, అల్లరి చిల్లరిగా తిరిగేవాళ్ళతో స్నేహం పెంచుకొనేవాడు.

యవ్వనంలో అడుగు పెడుతున్న సమయంలో లాలా నారాయణ్‌తో సాన్నిహిత్యం ఏర్పడింది.

లాలా నారాయణ్ ముజఫర్‌పూర్‌లో రెండు సంవత్సరాలు చదివాడు. చదువు ఒక వంక మాత్రమే. చెడు సహవాసాలలో తిరగడం నేర్చుకొన్నాడు. అప్పుడప్పుడు లెక్చరర్స్‌ను కొట్టడం కూడా జరిగేది. అదొక గాంగ్ వుండేది ఆ గాంగ్‌కు అతడు రింగ్ లీడర్.

ముజఫర్‌పూర్ విద్యార్థులు, ఎర్రతువాలు దళంగానూ, పచ్చ రుమాలు దళంగానూ విడిపోయి రెండు గ్రూపులుగా తయారయ్యారు. పుష్కర్ పిసినారిగా దమ్మిడీ దమ్మిడీ కూడబెట్టిన డబ్బును మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చు పెట్టసాగాడు కొడుకు. లాల్ నారాయణ్ చదవడం లేదని తెలిసే అతడ్ని రాజదేవ్‌తో ఢిల్లీకి పంపించాడు.

లాల్ నారాయణ్ దాదాపు రెండేళ్ళు మాత్రమే పినతండ్రి ఇంట్లో వున్నాడు. ఎక్కడ ముజఫర్‌పూర్ ఇరుకు సందులు గొందులు? ఎక్కడ న్యూ ఢిల్లీ విశాలమైన మార్గాలు? ముజఫర్‌పూర్‌లో లేని ఎన్నో అవకాశాలు ఢిల్లీలో వున్నాయి. కనాట్ ప్లేస్ చక్కర్లు కొడ్తూ వుండేవాడు. రకరకాల ఆడ పిల్లల్ని చూస్తూ బూతు జోకులు విసురుతూ తిరుగుతూ వుండేవాడు.

తండ్రి ఏ విధంగా డబ్బు సంపాదిస్తాడో లాల్ నారాయణ్ చూశాడు. బీదవాళ్ళకు డబ్బు వడ్డీలకు ఇచ్చి, వాళ్ళను ఎలా పీల్చి పిప్పి చేస్తాడో స్వయంగా చూశాడు. ఆ డబ్బు ఖర్చు పెట్టడంలో లాల్ నారాయణ్‌కు తమాషా ఆనందం కలిగేది.

రామ్ మూగ మనసు ఏదో చెయ్యాలని నిరంతరం ఘోషించేది. ఎవరిమీదో తిరగబడాలని వుండేది. ప్రతీకారం తీసుకోవాలని వుండేది. అలాంటి సమయంలో లాల్ నారాయణ్ సాంగత్యం లభించింది. అతడి మనసులోని ప్రతీకారేచ్ఛను మరో రూపంలో బహిర్గతం చేసే అవకాశం చూపించాడు లాల్ నారాయణ్. లాల్ నారాయణ్‌ను తన గురువుగా భావించేవాడు.

* * *

రాజదేవ్ కళ్ళు మూసుకొని మృత్యు దేవత రాక కోసం ప్రతి క్షణం ఎదురు చూశాడు. మృత్యువు రాలేదు సరిగదా అంతకు ముందు వెనక విన్పించిన శబ్దాలు కూడా ఆగిపోయాయి.

కాని ముందు ఏవేవో శబ్దాలు విన్పించసాగాయి. రాజదేవ్ కళ్ళు మూసుకునే శ్రద్ధగా వినసాగాడు. అవి మానవ కంఠ స్వరాలు. తనకు తెలియని ఏదో భాషలో ఎవరో మాట్లాడుతున్నారు. రాజదేవ్ కళ్ళు తెరిచాడు.

నాలుగు గజాల దూరంలో ఒక వ్యక్తి నిల్చుని తననే కన్నార్పకుండా చూడటాన్ని చూశాడు రాజదేవ్ ఆ వ్యక్తి వెనక పది పన్నెండు మంది వ్యక్తులు నిలబడి తనను కుతూహలంగా చూడటాన్ని కూడా చూశాడు.

అందరూ చాలా పొడవుగా వున్నారు. సూటి ముక్కులు. చిన్న చిన్న కళ్ళు. వాళ్ళనూ, వారి వేషాలనూ చూసి వారు నాగాలుగా గుర్తించాడు రాజదేవ్. నాగాల గురించి అతడు రామ్ ద్వారా చాలా విషయాలు తెలుసుకొన్నాడు. పుస్తకాలు కూడా చదివాడు. వాళ్ళు చాలా ధైర్యస్తులు. ఏ పోరాటానికైనా వెనుకాడరు. అరణ్య ప్రాంతాలలో వుంటారు. అయినప్పటికీ అకారణంగా వారు ఎవరికీ హాని చెయ్యరని రాజదేవ్‌కు తెలుసు. రాజదేవ్‌కు మునిగిపోతున్న తనకు ఎవరిదో చెయ్యి ఆసరా దొరికనట్టుగా అనిపించింది.

అతడు చేతితో సైగ చేసి దాహం వేస్తుందని ఎదురుగా నిల్చొని వున్న నాగాతో చెప్పాడు. ఆ నాగా వెనక్కు తిరిగి, వెనక నిలబడి వున్న ఒక యువకుడితో ఏదో అన్నాడు. ఆ యువకుడు ఒక్కసారిగా పరుగుతీశాడు. కొద్ది నిమిషాల్లో ఒక పాత్ర నీళ్ళు తీసుకొచ్చాడు. నీళ్ళు తాగగానే రాజదేవ్‌కు పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్టుగా అన్పించింది.

నీళ్ళు తాగి కృతజ్ఞతా పూర్వకంగా వారి వంకే చూశాడు. వాళ్ళల్లో వాళ్ళు ఏదో మాట్లాడుకుంటున్నారు. నలుగురైదుగురు నాగాలు పల్లంలోకి దిగి రాజదేవ్‌ను చేతులమీదకు ఎత్తుకొని పైన నిలబడి వున్న వాళ్ళకు అందించారు.

నాగాలు రాజదేవ్‌ను భుజాల మీద మోసుకెళ్తున్నారు. రాజదేవ్ గుండె తేలికపడింది. ఇకతను చచ్చినా పర్వాలేదు. దిక్కులేని చావు చావడు. నలుగురు మనుష్యుల మధ్య చస్తాడు. ప్రతి వ్యక్తీ ఏదో ఒక

రోజు చావక తప్పదు. ఇప్పుడైతే తాను చనిపోయినట్టు కనీసం వీళ్ళు లలితకు తెలియజేస్తారు.

లలిత తాను లేకుండా... అంతా భ్రమ. ఎవరు లేకపోయినా ఈ ప్రపంచం మామూలుగానే నడుస్తుంది. దుఃఖాన్ని కాలం మాన్పుతుంది. పైగా ఇప్పుడు రామ్ ఇంటి బాధ్యతలు వహించే పరిస్థితిలో వున్నాడు. రామ్ పూర్తిగా మారిపోయాడు. నాగాల భుజంమీద వున్న రాజదేవ్ మళ్ళీ గతంలోకి జారిపోయాడు—

పుష్కర్ ఢిల్లీలో అయితే తన కొడుకు లాల్‌నారాయణ్ బాగు పడ్తాడనీ, చదువుకొని ప్రయోజకుడౌతాడనీ రాజదేవ్‌తో పంపించాడు. పుష్కర్‌కు కూడా డబ్బు ఒక్కటే జీవితం కాదనే భావం అప్పుడప్పుడు ఆకాశంలో మెరిసే మెరుపులా వస్తూ ఉండేది. అందుకే కొడుకుని ప్రయోజకుడ్ని చేసే ప్రయత్నంలో డబ్బు బాగా ఖర్చు చేశాడని చెప్ప వచ్చు. కొడుకు పాడైపోవడం ఏ తండ్రికి ఇష్టం వుంటుంది? ముఖ్యంగా పుష్కర్ కొడుకు ప్రయోజకుడై తన కంటే పెద్ద ఉద్యోగం సంపాదించి, తన పేరు నిలబెడ్తాడని ఆశించాడు.

ఊళ్ళో ఎవరైనా చనిపోయినప్పుడు దహన సంస్కారాలకు వడ్డీ మీదనే అప్పు ఇచ్చేవాడు పుష్కర్.

అప్పుకు వచ్చిన వాడికి వడ్డీ తగ్గించి ఇవ్వడం అంటే అపరాధం చేసినట్టే భావిస్తాడు. వడ్డీకి వచ్చేవాడు ఎన్నో పాపాలు ఈ జన్మలో కాకపోతే క్రితం జన్మలో నైనా చేసి వుంటాడని పుష్కర్ నమ్మకం. అలాంటి పాపి మీద కనికరం చూపించడం భగవంతుడి ఇష్టాన్ని కాదన డమేనని అతడి అటల విశ్వాసం. అతడి పాప కర్మలకు భగవంతుడే శిక్షిస్తూ వుంటే తనెవరు మధ్యలో సానుభూతి చూపించడానికి అని తనను తనే మభ్య పెట్టుకొనేవాడు.

లాల్ నారాయణ్ ముజఫర్‌పూర్‌లో చదువుతున్నప్పుడు కొడుకు ప్రయోజకుడై బాగా డబ్బు సంపాదిస్తాడని ఎన్నో కలలు కన్నాడు పుష్కర్. లాల్ నారాయణ్ ఆలోచనలు వేరుగా వుండేవి. తండ్రి లోభి తనం చూశాడు. డబ్బు కోసం మనిషి కాదు – మనిషి కోసం డబ్బు అని భావించాడు. ఆ భావం మంచిదే కాని, ఆ డబ్బు ఎలాగైనా సంపాదించ వచ్చుననుఅతడి నమ్మకమే మంచిది కాదు——

ఢిల్లీ వచ్చాక అతడికి అమితమైన ఆనందం కలిగింది. అన్ని విలా సాలకూ ఆలవాలమైన ఢిల్లీ తనకు తగిన ప్రదేశంగా భావించాడు. ఇక కావాల్సింది తన విలాసాలకు డబ్బు మాత్రమే. ఢిల్లీలో డబ్బు సంపా దించడం పెద్ద సమస్యేం కాదు. ఉద్యోగాలే చెయ్యక్కర్లేదు. కొద్ది నెలల్లోనే అనేక రకాల డబ్బు సంపాదన మార్గాలను తెలుసుకొన్నాడు. రెండేళ్లు రాజదేవ్‌తో వున్నాడు. సంపాదన పెరిగింది. మరొకరి సహాయం అవసరం లేని స్థితికి ఎదిగాడు. వెంటనే వేరే ఇల్లు తీసుకొని వెళ్ళి పోయాడు. మదిర–మగువ, కాంచన–కామినీల ఆధారంతో అనేక మంది పెద్ద పెద్ద వాళ్ళతో పరిచయాలు ఏర్పరచుకొన్నాడు.

ఎంతో తెలివైన వాళ్ళూ, అధికారంలో ఉన్నవాళ్లూ, సమాజంలో పై అంతస్థులో వున్నవాళ్ళూ – మానినీ మదిరల బలహీనతల వల్ల లాల్ నారాయణ్‌కు దగ్గరైన వాళ్ళున్నారు.

ఆ రోజు రామ్ తాను ఊహ తెలిసినప్పటి నుంచి చాటుమాటుగా చేసిన పనులన్నీ తండ్రికి నిర్భయంగా విన్పించాడు. ఒక కొడుకు, తండ్రితో చెప్పరాని విషయాలన్నీ చెప్పాడు నిస్సంకోచంగా.

ఒక రోజు రామ్ వెళ్ళేసరికి లాల్ నారాయణ్ ఎక్కడికో బయలు దేరుతున్నాడు. రామ్‌ను చూసిన అతడి ముఖం విప్పారింది. అప్పటికే రామ్‌ను లాల్ నారాయణ్ తన వశంలోకి తీసుకున్నాడు. ఇద్దరూ

కూర్చొని ఒక ఫుల్ విస్కీ బాటిల్ లాగించారు. అంతకు ముందే సిగరెట్ అలవాటుంది ఇప్పుడు తాగుడు కూడా అలవాటయింది.

''నువ్వు సరిగ్గా సమయానికి వచ్చావ్. బయలుదేరు'' రామ్‌ను చూస్తూ అన్నాడు లాల్ నారాయణ్.

"ఎక్కడికి ?"

"చాలా మజాగా వుండే చోటుకు తీసుకెళ్తున్నాను. కొత్త ఆనందాన్ని అందుకొందువు పద."

మరో ప్రశ్నకు అవకాశం ఇవ్వకుండా లాల్ నారాయణ్ రామ్ చెయ్యి పట్టుకొని తీసుకెళ్ళి కార్లో కూర్చోబెట్టాడు. కారు జనపథ్‌లో వున్న ఒక పెద్ద హోటల్ పోర్టికో ముందు ఆగింది.

రామ్ రోడ్డున వెళ్తూ ఎంతో కోరికతో ఆ హోటల్ను చూస్తూ వుండేవాడు. కాని తనకు ఆ హోటల్ ప్రవేశం ఇంత త్వరగా లభిస్తుందని కలలో కూడా ఊహించలేదు. హోటల్‌లో ప్రవేశించిన రామ్ అక్కడి అలంకరణా, వైభవం చూసి విస్మయంగా నిల్చుండిపోయాడు. ఏదో కొత్త ప్రపంచంలోకి, అంతవరకూ తను ఎరగని ప్రపంచంలోకి ప్రవేశించినట్టుగా వుంది. ఏదోగా వుంది.

వాకిట్లోనే ఖరీదైన దుస్తుల్లో వున్న దర్వాన్ సలాం చేశాడు. లోపల ప్రవేశించిన రామ్‌కు ఇంద్రలోకం అంటే ఇలాగే ఉంటుందేమో ననిపించింది.

లాల్‌నారాయణ్‌తో లిఫ్టులో మూడో అంతస్థుకు చేరాడు. వరండాలో యాంత్రికంగా లాల్ నారాయణ్‌ను అనుసరిస్తూ నడుస్తున్నాడు. లాల్ నారాయణ్ ఒక గది ముందు ఆగిపోయాడు. రామ్ కూడా యాంత్రికంగా ఆగిపోయాడు. వార్డు బాయ్ వచ్చి గది తలుపులు తెరిచాడు.

ఆనందాశ్చర్యాలలో మునిగిపోయి వున్న రామ్ గదిలోకి ప్రవేశించగానే తల తిరిగినట్టయింది.

గదిలో పదిహేడు పద్ధెనిమిదేళ్ళ ఆడపిల్ల కూర్చొని వుంది. ఆమె ఎదురుగా వున్న బల్లమీద నాలుగు గ్లాసులూ, ఐస్ ముక్కల జగ్గూ, నాలుగైదు క్వార్టర్ ప్లేట్లూ, రెండు విస్కీ బాటిల్సూ వున్నాయి.

లాల్ నారాయణ్‌ను చూడగానే ఆ పిల్ల తమాషాగా నవ్వి చెయ్యి అందించింది. అతడు ఆమె చేతిని అందుకొని చుంబించాడు. రామ్ ముఖం మీద చెమట బిందువులు ముత్యాల్లా మెరుస్తున్నాయి.

"వీడు నా ప్రాణ స్నేహితుడు." లాల్ రామ్‌ను చూపిస్తూ ఆ పిల్లతో అన్నాడు.

ఆమె లేచి రామ్ దగ్గరకు వచ్చింది.

రామ్ గాభరా పడిపోయాడు.

ఆమె చిన్నగా రామ్ చేతిని అందుకొన్నది.

"ఆమె నా గరల్ ఫ్రెండ్. పేరు రాణి. కాలేజీలో చదువుతోంది. చాలా మంచి పిల్ల" రామ్‌తో అన్నాడు లాల్‌నారాయణ్.

రామ్ నమస్కారం చేసే లోపలే ఆ పిల్ల అతడి చెయ్యి పట్టుకుంది. లతలాంటి చెయ్యి అతడి భుజం మీద వేసింది.

రామ్‌కు కళ్ళు తిరుగుతున్నట్టుగా అన్పించింది. ఏ క్షణంలోనైనా కింద పడిపోతానేమోననే భయం కలిగింది.

"విస్కీ సరిపోతుందా?" ఆ పిల్ల రామ్‌ను అడిగింది.

ఆ పిల్ల తనను వదిలేస్తే బాగుండు ననిపించింది రామ్‌కు.

రామ్ ఆ కొద్ది నిముషాల్లో రకరకాల అనుభూతులను అనుభవించాడు. తన వంటరి జీవితానికి ఒక మంజిల్ దొరికిందనీ, అక్కడ

జీవితమంతా ఆనందమయమేనని అన్పించింది. ఆ బాటలో ముళ్లు వుండవనీ, వుండేవన్నీ పూవులేననీ అన్పించింది. తల్లి ఒక్కతే తనను ప్రేమిస్తుంది. కాని తనలో వున్న ఆకలి ఇక్కడ లభించే ప్రేమతో తీరుతుందనిపించింది.

దూరం నుంచీ, దగ్గర్నుంచీ అతడు చాలా మంది ఆడపిల్లల్ని చూశాడు. కాని తనకు కావాల్సిన వ్యక్తి రాణీయేననిపించింది. తనొక ఎత్తైన ప్రదేశం మీద నిల్చుని వున్నట్టూ, కింద కడలి కెరటాలు ఎగిరెగిరి పడ్తున్నట్టూ, అవి ఎల్లలు కూడా చెరిపి ముందుకు దూకుతున్నట్టూ అన్పించింది రామ్‌కు.

తను కూడా ఎల్లల లాగే ఆ తరంగాల్లో కొట్టుకుపోతే?

తన తల్లి ఎంతగా రోదిస్తుంది?

తన చెల్లెళ్లు ఏం చేస్తారో?

మరి తండ్రి?

రామ్ పెదవుల మీద అర్థపూరితమైన చిరునవ్వొకటి కదిలింది ఇట్టే మాయమైంది. అతడి కళ్లలో కసి, తిరస్కార భావాలు నేను ముందంటే నేను ముందంటున్నాయి. మనసు చేదుచేదుగా అన్పించింది. ఇది మంచిదో కాదో కూడా అతడికి తెలియడం లేదు.

ఎదురుగా వున్న గ్లాసు చూసి అతడి ఆలోచనలు చెల్లా చెదరయ్యాయి. రాణి చిరునవ్వుతో రామ్‌ను చూస్తోంది. ఆ నవ్వులో కొంటెతనం వుంది. ఆ పిల్లా రామ్‌కు ఎంతో అందంగా కన్పించింది. ఆమె నవ్వు ఎంతో ఆనందాన్ని కలిగించింది.

రామ్ పూర్తి గ్లాసు ఒక్కసారిగా పూర్తిచేశాడు. రాణీ, లాల్, అది చూసి కిలకిల నవ్వారు. పూర్తి పెగ్ లాగెయ్యడంవల్ల వాళ్లు నవ్వుతున్నా అతడికి ఏమీ అన్పించలేదు.

లాల్ నారాయణ్ రాణిని ఎత్తుకొని యాంటీ రూంలోకి వెళ్ళాడు. పది పదిహేను నిముషాల తర్వాత బయటకొచ్చి "రాం. నాకు కొంచెం అర్జంటు పని వుంది. గంటలో తిరిగొస్తాను. భోజనం గదిలోకి తెప్పించు. నాకు మాత్రం వద్దు." అనేసి రామ్ సమాధానికి కూడా ఎదురు చూడ కుండా త్వరత్వరగా బయటికి వెళ్ళిపోయాడు.

రాణీ రామ్‌ను చూసి అదోలా నవ్వింది. రామ్‌కు ముఖం ఎలా పెట్టాలో కూడా అర్థం కావడం లేదు. రాణీ వచ్చి అతడి ఒళ్ళో కూర్చుండి పోయింది.

రాణీ లాంటి పిల్లలెందరో లాల్‌నారాయణ్ చేతిలో వున్నారనీ, అందులో ఆరేడుగుర్ని తనకు పరిచయం చేశాడనీ కూడా రామ్ తండ్రికి చెప్పాడు.

"మీ నాన్నా మా నాన్నలాగే పాత ఆలోచనలతో జీవితం అంటే ఏమిటో తెలుసుకోలేక పోయాడు. కనీసం జీవితం అని దేన్నంటారో తెలుసుకోవడానికి కూడా వాళ్ళు ప్రయత్నించరు. ఒక రకంగా మా నాన్న కంటే మెరుగేలే. మీ నాన్న ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడట. కాని ఇతరులు మాత్రం బహ్మచర్యం అనే లంగోటా కట్టుకోవాలని ఉపదేశాలిస్తాడు. బహుశా నీకు తెలిసి వుండదు. మన బంధువు లందరికీ తెలుసు..." ఒకరోజు లాల్ నారాయణ్ రామ్‌తో అన్నాడు.

"ఏమిటది?" విసుగ్గా అడిగాడు రామ్.

"అదే. మీ అమ్మతో పెళ్ళికి ముందునుంచే మీ నాన్నకు సంబంధం వుండేదట. అన్నీ అయ్యాకే పెళ్ళి తంతు జరిగిందట. ఈ కారణంగానే ఆయన మనసులో అపరాధ భావం ఎక్కడో అంతరాంత రాల్లో దాగి వుంది. అందుకనే ఆయన అందర్నీ అనుమానిస్తాడు.

ఎవర్నీ విశ్వసించడు. అందుకే నియంత్రణ వుంటేగాని పిల్లలు బాగు పడరని భావిస్తాడు. నా దృష్టిలో ఈ సిద్ధాంతం అర్థంలేనిది. నన్ను చూడు నేను నేడు ఎంత ఆనందంగా వుంటానో? ఒక విజయం సాధించి రెండో విజయం కేసి పయనించడమే నా దృష్టిలో జీవితం. నా ప్రతి గమ్యస్థానం సుఖ భోగాల ఆలయం. నాకు ఇంకేమీ అక్కర్లేదు. కావాల్సిన వన్నీ సాధించుకున్నాను. మొదట్లో కొద్ది కాలం మీ నాన్న సహాయాన్ని పొందిన మాట వాస్తవమే. కాని ఒకరోజు ఏమన్నాడో తెలుసా?...".

"ఏమన్నాడు?"

"ఇంకా ఏమనాలి. "బాబూ! చెడ్డ పనులు సాధించుకోవడానికి నా పేరు ఉపయోగించుకోవడాన్ని నేను సహించలేను" అని అన్నాడు. కసాయివాడు ఏం చేస్తాడు? సిపాయి ఏం చేస్తాడు? వాళ్ళు చేసేవి తప్పు పనులైతే వారిని వారించరేం? న్యాయమూర్తి కూడా ఏం చేస్తాడు...?"

ప్రశ్నించి ఆగి రామ్ ముఖం లోకి చూశాడు-

రామ్ అయోమయంగా ముఖం పెట్టాడు.

"న్యాయమూర్తి ఉరిశిక్ష వేస్తాడు. మీ నాన్నకు నా క్యారెక్టర్ మీద అనుమానం."

రామ్‌దేవ్ తండ్రికి అన్ని విషయాలు చెప్పాడు. తండ్రి ముఖంలో ఆశ్చర్యం గానీ, విషాదం గానీ కన్పించలేదు. లాల్ నారాయణ్ వ్యసనాలు గురించి కొంతవరకు ఢిల్లీ వచ్చిన సంవత్సరానికే తెలుసుకొన్నాడు రాజదేవ్. కాని మరీ ఇంత దూరం వెళ్ళాడని కానీ, రామ్‌ను కూడా తనతో తన దారిలో నడిపిస్తున్నాడని కానీ తెలియదు.

రాజదేవ్‌కు రామ్ ఇలా తయారవడానికి కారణం తనేననే భావం కలిగింది.

"నేను రామ్‌ను ఎప్పుడూ దూరంగానే వుంచాను. లలిత అంటూ వున్నట్టుగా వీడు తండ్రి ప్రేమకు దూరం అయి నా మీద కసి పెంచు కొన్నాడు. ఆ కసే ఇలా మరో రూపంలో వ్యక్తం అవుతోంది. వీడు నా బిడ్డ. తండ్రిగా నా బాధ్యతను విస్మరించాను. వాడు ఏం చేస్తున్నా డని కానీ, ఎలాంటి అలవాట్లకు గురి అయ్యాడని కానీ తను ఏనాడూ తెలుసుకోవడానికి ప్రయత్నించలేదు. తెలిశాక సరిదిద్దే ప్రయత్నం చెయ్యకపోగా వాడ్ని నేను అసహ్యించుకున్నాను. వాడికి తిండి పెట్టడం తోటే నా కర్తవ్యం ముగిసిందిగా భావించాను..."

రాజదేవ్ నాగాల భుజాలమీద పడుకొని తెలియని ప్రాంతంలో తెలియని చోటుకు వెళ్తున్నాడు. ఎత్తు పల్లాలను అవలీలగా దాటుకొంటూ నడుస్తున్నారు నాగాలు. దారిలో ఒక్క గ్రామం కన్పించలేదు. రోడ్డు కూడా లేదు. కాలి బాటలు మాత్రం వున్నాయి. కొన్ని చోట్ల అవీ స్పష్టంగా లేవు.

కొద్ది నిముషాల క్రితం తను మృత్యు ముఖంలో వున్నానని భావించిన రాజదేవ్ మనసులో జీవిత ఆశ తళుక్కుమన్నది. తను మనుషుల్లో పడ్డాడు. వైద్యం చేయిస్తే తను బతకడానికి అవకాశా లున్నాయి. తను బతుకుతాడు. లలితను చూస్తాడు. తన పిల్లల్ని చూసే భాగ్యం తనకు లభిస్తుంది. తప్పక తను బతుకుతాడు.

నాగాలు గ్రామం చేరారు. రాజదేవ్‌కు వారి భాష రాదు. ఆ గ్రామంలో ఒక్కరిద్దరికే కొద్ది కొద్దిగా హిందుస్తానీ తెలుసు. వారి ద్వారానే తన కుడి మోకాలు ఎముకలు ముక్క ముక్కలుగా విరిగి పోయాయని తెలుసుకొన్నాడు. మూడు రోజులు కొండలు కోనలు దాటి వెళ్తే ఫాదరీ డాక్టర్ వుండే ఊరు వస్తుంది. డాక్టర్ కోసం నాగా సర్దార్ మెండోచి, ఒక వ్యక్తిని పంపించాడు. త్వరగా వెళ్ళి డాక్టర్ను తీసుకొని రమ్మని పురమాయించాడు.

డాక్టర్ వచ్చే లోపల జడీ బూటీల వైద్యం ప్రారంభం అయింది. రాజదేవ్ తన ఆరోగ్యం గురించి ఆలోచించడం మానేశాడు. ఆ బాధ్యత పూర్తిగా నాగాలకే వదిలేశాడు. లలిత గురించీ, తన కుటుంబాన్ని గురించీ, తను జీవితంలో ఎదుర్కొన్న సంఘటనల గురించీ మాత్రమే ఆలోచిస్తూ పడుకొనేవాడు.

పాపం! లలిత! తను మాత్రం ఏం సుఖ సౌఖ్యాలు అనుభవించింది?

ఎన్ని తిరస్కారాలను చవి చూసినా, ఎన్ని అవమానాలను భరించినా, ఎన్ని కష్టాలు అనుభవించినా, ఆమె స్వభావంలోని కారుణ్యం కరడు కట్టి పోలేదు. హృదయంలో సంవేదన చచ్చిపోలేదు. ఆమెకు ప్రేమించడం మాత్రమే తెలుసు. అసహ్యించుకోవడం తెలియదు. తన సంతానం అంటే అమిత ప్రేమ. అందులో బలహీనుడైన రామ్ అంటే మరీ ప్రేమ.

రామ్ పుట్టక ముందు ఆమె అన్నీ బాధలే పడింది. అవమానాలు భరించింది. కష్టాలకు గురి అయింది. జీవితం ఒక ముళ్ళ బాటలో నడిచింది. ఆమె హృదయానికి ఎన్నో ముళ్ళు గుచ్చుకున్నాయి. జీవితం ఆమెకు చేదునే అందించింది. అయినా ఆమెలోని మమతను ఆ చేదు ఏమీ చెయ్యలేకపోయింది.

రామ్ గర్భంలో వుండగా లలిత ఆరోగ్యం ఒకసారి దెబ్బతిన్నది. తీవ్రమైన కడుపు నొప్పి ప్రారంభం అయింది. నిరుద్యోగి పెళ్ళాం. పైగా సంప్రదాయాలనూ, పాత సామాజిక విలువలను చులకనగా చూసే వాడి భార్య. ఆ ఇంట్లో లలితతో ఎవరూ ఆప్యాయంగా మాట్లాడేవారు కాదు. వంటరిగా ఒక గదిలో మగ్గిపోతూ వుండేది.

అర్థరాత్రి. భరించలేని బాధ. పెద్ద పెద్దగా బాధతో కేకలు పెట్టింది. ఎవరూ విన్పించుకోలేదు. వారి వారి గదుల్లో సుఖ నిద్రలో వున్నారు అందరూ. లలిత బాధ భరించలేని పరిస్థితిలో ఎలాగో గది తలుపులు తెరుచుకొని వరండాలోకి వచ్చింది. కారు చీకటి. ముందుకు రెండడుగులు వేసిన ఆమె కాలు రాతి రోలుకు కొట్టుకొని, ఒక్కసారిగా అరిచి విరుచుకొని పడిపోయింది.

వరండా చివరి రూంలో పుష్కర్ భార్య పడుకొని వుంది. ఆర్త నాదం విని గాభరాగా తలుపు తెరచుకొని బయటికి పరుగుతీసింది. చీకట్లో ఏమీ కన్పించడం లేదు. గదిలోకి వెళ్ళి లాంతరు వత్తి పెద్దది చేసి వరండాలోకి వచ్చి చూసింది. లలిత పరిస్థితి చూసి ఆమె అందర్నీ బయటికి రమ్మని కేకలు పెట్టింది. పుష్కర్, ప్రమోద్ బయటికి వచ్చారు. ఏం చెయ్యాలో తోచనట్టు ఉండిపోయారు.

ఆ గ్రామంలోని యువకుడొకడు మూడు మైళ్ల దూరంలో వున్న నగరం నుంచి డాక్టర్ను తీసుకొచ్చాడు. డాక్టరు పరీక్షించి లలితకు మంచి ఆహారం ఇవ్వాలని చెప్పాడు. విశ్రాంతిగా వుండాలని శారీరికంగా అలసట కలిగించే పనులు చెయ్యకూడదనీ చెప్పాడు. గర్భ పాతం కాకపోవడం అదృష్టం అని కూడా అన్నాడు.

రెండో రోజు నుంచే కుటుంబ సభ్యులు లలితపట్ల మరీ కటువుగా ప్రవర్తించసాగారు.

"నాటకం ఆడుతుంది నాటకం. కడుపునొప్పి లేదు కాలునొప్పి లేదు. అంతా వేషం. కడుపునొప్పి పేరుతో పరుగులు తీస్తుంది. మా అదృష్టం బాగుండి ఆ కడుపు నిల్చింది. లేకపోతే గ్రామంలో మమ్మల్ని తలెత్తుకోకుండా చేసేది. మొగుడితో చెప్పి ఎన్ని మాటలు అన్పించి వుండేదో?" పుష్కర్ భార్య ధోరణి ఇది.

ఇంటికి వచ్చిన ప్రతి స్త్రీ దగ్గరా ఇలాగే మాట్లాడేది. లలిత గదిలో పడుకొని తోటి కోడలు మాటలు వింటూనే వుండేది. అయినా పెదవి కదిపేదికాదు. ఎవర్నీ పల్లెత్తుమాట అనేది కాదు.

"ఏవమ్మా! ఎందుకలా చేస్తున్నావ్? నువ్వు చిన్న పిల్లవు కాదు. ఒకరు చెప్పాల్సిన వయసు కాదు. చీకట్లో బయటికి పరుగుతీస్తే ఏదైనా తగిలే ప్రమాదం వుందని తెలియదా ?" పుష్కర్ భార్యమాటలు విని వెళ్ళిపోకుండా, ఒక్కో స్త్రీ తిన్నగా లలిత గదిలోకి వచ్చి అడిగేసేది. లలిత మౌనంగా కళ్లప్పగించి చూసేది.

గ్రామీణ స్త్రీలకు ఇతరుల విషయాల్లో జోక్యం కల్పించుకొనే అలవాటు వుంటుంది.

మరో మహిళ ప్రశ్నించేది— "నిన్ను ఈ దశలో వదిలేసి నీ భర్త ఎక్కడికి కెళ్లాడూ? మీది ప్రేమ పెళ్లటగా? ఈ పెళ్లి విషయంలో అన్నదమ్ముల్నీ, చివరికి తండ్రిని కూడా నిర్లక్ష్యం చేసినవాడు పెళ్లాన్ని వాళ్ళ మీదే వదిలేసి వెళ్ళాడేం? తను మాత్రం పట్టణంలో కులాసాగా తిరుగుతున్నాడు. పెళ్ళాం బాధ్యత పాపం అన్నమీదకు తోసేశాడు. మగవాడికి బుద్ధి లేకపోతే నీ కుండొద్దూ? బావగారు ఎంత కాలం నీ బాధ్యత తీసుకొంటారు? పాపం! వాళ్ళకు మాత్రం ఏం తరగని ఆస్తి వుంది? పైగా పిల్లలు గలవాళ్ళు!"

ఇలా స్త్రీలు తలొకమాటా అంటూ వుండేవారు.

లలిత కళ్ళ వెంట నీరు ధారాపాతంగా కారేది. తనను నిందించి నందుకు కాదు. తన భర్తను నిందిస్తుంటే ఆమె మనసు పిండినట్టుగా అయేది. రాజదేవ్‌కు తన బాధ తెలియనిచ్చేది కాదు.

రాజదేవ్‌కు అన్ని విషయాలూ తెలిశాయి. కాని చాలా ఆలస్యంగా తెలిశాయి. ఆ ఇంట్లో ప్రమోద్ ఒక్కడే పినతల్లిని ఆదరించేవాడు. అతడికి రాజదేవ్ అంటే ఎనలేని గౌరవం. రామ్ పుట్టాక చాలా కాలానికి లలిత గ్రామంలో ఎలాంటి అవమానాలకూ, యాతనలకూ గురి అయిందో రాజదేవ్‌తో ప్రమోద్ చెప్పాడు.

రామ్ పుట్టాక రాజదేవ్ కాశీలోని ఒక చిన్న పత్రికలో ప్రూఫ్ రీడరుగా ఉద్యోగం సంపాదించాడు. ఎనభయ్ రూపాయలు జీతం. అయినా లలితకు సంతృప్తిగానే వుంది. ఇప్పుడు ఆమెను అవమానించేవారులేరు. ఎద్దేవాచేసేవారు లేరు. అది తన ఇల్లు. తన ఇంట్లో తను వుంటోంది.

చిన్న ఉద్యోగం. ఆర్థికంగా చిన్న స్థాయి. చిన్న పిల్లవాడు. లలిత జబ్బులు. కొన్ని ఇబ్బందులువున్నా ఆమె సంతృప్తిగానే వుండేది. ఆ నరకంలోకి మళ్ళీ వెళ్ళే పరిస్థితి రాకూడదని వెయ్యి దేవుళ్ళకు మొక్కుకొనేది. రామ్ పుట్టాక భర్తకు ఉద్యోగం రావడం, తను ఆ నరకం నుండి బయట పడటం జరిగింది. అందుకే రామ్ తన జీవితం లోకి వెలుగును తీసుకొని వచ్చాడని భావించేది లలిత. రామ్ మీద ఎక్కువ అభిమానం చూపేది. ముద్దు చేసేది. వాడు ఎన్ని చెడ్డ పనులు చేసినా భర్తకు తెలియకుండా దాచడానికి ప్రయత్నించేది.

రామ్ నిశ అపూర్వ సౌందర్యాన్ని చూసి మతి పోయిన వాడిలా ప్రవర్తించాడు. ప్రతి నిముషం అతడ్ని నిశ సౌందర్యం నిల్చున్న చోటున నిల్చోనిచ్చేది కాదు. రాత్రింబవళ్లు అశాంతితో వేగిపోయాడు. అవకాశం కోసం ఎదురు చూడసాగాడు. తల్లి జబ్బుతో గదిలో పడుకొని వుంది. తండ్రి ఆఫీసుకు వెళ్ళిపోయాడు. అదను చూసి నిశ గదిలో ప్రవేశించి, పాశవిక కోరికను తీర్చుకోవడానికి ప్రయత్నించాడు.

రాజదేవ్ రామ్‌ను ఏనాడూ ప్రేమగా చూడలేదు. వాడు ఆలస్యంగా వస్తే ఎర్రగా చూసేవాడు. ఏదైనా గొడవల్లో పడ్డాడని తెలిసినప్పుడు "నా కళ్ళకు కన్పించకు" అనేవాడు. మంచి చేసినప్పుడు తండ్రి నుంచి ప్రశంసగానీ, ఆశీర్వచనంగానీ లభించేవి కావు. రామ్ మనసులోనే తండ్రి ప్రవర్తనకు కుళ్ళుకునే వాడు. క్రమంగా ప్రతీకారేచ్ఛ అతడి మనసులో తలెత్తింది. ఆ ప్రతీకారం ఎవరిమీద తీర్చుకోవాలో రామ్‌కు స్పష్టంగా తెలియదు. ప్రతీకారేచ్ఛ తన ఆత్మనే కొరుక్కు తింటుందని కూడా రామ్‌కు తెలియదు.

ఆ రోజు రామ్ తండ్రి దగ్గర ఏదీ దాచకుండా చెప్పాడు. రామ్ మనసులో గూడు కట్టుకొని వున్న ఆత్మ హీనతా గ్రంథి పగిలిపోయింది ఆ రోజు. ఆ రోజు నిశ అతడికి సేవలు చేసింది. ఆ సేవలు అతడి మనసులోని కామేచ్ఛను కాల్చి వేశాయి. నిశ అంటే చెప్పలేని అభిమానం ఏర్పడింది. పశ్చాత్తాపం కలిగింది. ఆమె మంచితనం అతడ్ని మార్చివేసింది. కొందరి చేతిలో వంశి, పాంచజన్యంగా మారుతుంది.

రామ్‌తో రాజదేవ్ ఇంటికి తిరిగి వచ్చాడు. లలిత మంచంలో పడి వుంది. నిశ ఆమె పాదాల దగ్గిర కూర్చుని పాదాలకు నూనె రాస్తున్నది. అదే గదిలో మరో మంచం మీద కూర్చుని వున్నాడు హీరామన్. నందిని, నివేదిత వంట గదిలో వున్నారు.

రాజదేవ్‌తో వచ్చిన రామ్‌ను కొద్ది క్షణాలు చూస్తూ వుండిపోయింది లలిత. ఆ తర్వాత నిశ ముఖంలోకి చూసింది. నిశ చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వులో నిర్మలత్వం వుంది. క్షమాభావం వుంది. లలిత రాజదేవ్ ముఖంలోకి చూసింది. అతడు కోపంగా లేడు. లలిత తేలిగ్గా నిట్టూర్చింది.

"నిశా త్వరగా టిఫెన్ చేసి తీసుకొస్తావా?" అడిగింది లలిత.

"అలాగే" అని నిశ లేచి నిల్చుంది.

''చూడు. ఆటుకులు తీసి, పచ్చి బఠాణీకాయలు వలువు. నేను వచ్చి టిఫెన్ తయారు చేస్తాను '' టిఫెన్ చెయ్యడానికి వెళ్తున్న నిశను ఉద్దేశించి అన్నది లలిత.

లలిత ఆగి వెనక్కు తిరిగి అన్నది '' మీరు బాబుగారితో మాట్లాడుతూ వుండండి. క్షణంలో టిఫెన్ చేసి పట్టుకొస్తాను.'' అని సమాధానంకోసం ఎదురుచూడకుండా వంటగదిలోకి వెళ్ళిపోయింది.

భగవంతుడి లీలలు చాలా చిత్రంగా వుంటాయి. అందరూ కూర్చుని కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ టిఫెన్ చేస్తున్నారు. అంతలో కాలింగ్ బెల్ మ్రోగింది రామ్ లేచి వెళ్ళాడు.

రామ్ ఉమేశ్‌ను వెంటబెట్టుకొని వచ్చాడు. ఉమేశ్ గురించి రామ్‌కు తెలుసు.

''అరే ఉమేశ్ నువ్వా? రారా! మంచి సమయానికే వచ్చావు. ఈ అధ్యాయానికి ముగింపు కూడా ఇవ్వాళే కాబోతున్నదన్న మాట. అన్నాడు రాజదేవ్ ఉత్సాహంగా."

ఉమేశ్‌కు రాజదేవ్ మాటలు అర్థం కాలేదు. అతడి పెదవుల మీది నవ్వు ఆగిపోయింది అధ్యాయమా? ముగింపా? ఏం అధ్యాయం? ఏం ముగింపు? మనసులోనే ఆశ్చర్యంగా ప్రశ్నలు వేసుకొన్నాడు ఉమేష్.

"నిశా నువ్వెళ్ళి ఉమేశ్‌కు కూడా టిఫెన్ తీసుకురా'' అన్నది లలిత విషయాన్ని మారుస్తూ. కాని నిశ ఆ గదిలో వున్నదో లేదో కూడా ఆమె చూడలేదు. లలిత తనను పిల్చినట్టు విన్పించి నిశ వంట

గదిలో నుంచి వచ్చింది. ఎదురుగా ఉమేశ్‌ను చూసి సిగ్గుతో పారి పోయింది.

"చూడు ఉమేశ్! రెండు మూడు రోజుల్లో ఏదైనా చిన్న ఇల్లు చూసుకొని నిశను తీసుకెళ్ళు. నవదంపతులు. ఏ భార్య అయినా తన భర్తతో వంటరిగా వుండాలని కోరుకుంటుంది. మా ప్రెస్‌లోనే నీకు ఏదైనా ఉద్యోగం చూస్తాను" అన్నాడు రాజదేవ్.

రాజదేవ్ అనుకొన్నదొకటైతే జరిగింది మరొకటి.

రెండు రోజుల తర్వాత ఉమేశ్ రాజదేవ్‌తో అన్నాడు-

"లాల్‌భాయి ఇంట్లో అవుట్ హౌస్ వుంది. అందులో వుండ టానికి నిశ్చయించుకొన్నాను. అద్దె కట్టక్కర్లేదు."

ఉమేశ్ చెప్పింది విని రాజదేవ్ తృప్తి పడ్డాడు.

కొద్ది నిమిషాల తర్వాత "కాని అక్కడ ... అక్కడ లాల్ వంటరిగా వుంటున్నాడు. నిశను అక్కడ వుంచడం మంచిది కాదేమో? ఆలోచించు" అన్నాడు రాజదేవ్.

"నిశ అక్కడ వుంటే ఏమౌతుంది? లాల్ కూడా మన కుటుంబం లోని వాడేగా? పరాయివాడు కాదుగా? లాల్ నాకు ఉద్యోగం కూడా ఇప్పించాడు.

"ఉద్యోగం ఇప్పించాడా? ఏం ఉద్యోగం?" ఆశ్చర్యంతో తల మునకలౌతూ ప్రశ్నించాడు రాజదేవ్.

"సారీ, ఇప్పించడం కాదు, ఉద్యోగం ఇచ్చాడు. పని ప్రత్యేకంగా ఏమీలేదు. లాల్‌తో వుండాలి నేను పహల్వానుగా? వాడికి బాడీగార్డుగా వుండాలి అంతే. జీతం ఐదు వందలు."

రాజదేవ్ సమాధానం ఇవ్వలేదు. లేచి బయటికి వెళ్ళాడు. ఇంటి ముందున్న లాన్‌లో ఆలోచిస్తూ పచార్లు చెయ్యసాగాడు.

సాయం కాలం ఉమేశ్ సామాను సర్దుకొని బయలుదేరడానికి తయారవుతున్నాడు.

అది చూసి రామ్ తండ్రి దగ్గరకొచ్చి "నాన్నా! నిశను ఉమేశ్ లాల్ ఇంటికి తీసుకెళ్ళడానికి మీరు అంగీకరించారా?" అని అడిగాడు.

రాజదేవ్ రామ్ ముఖంలోకి లోతుగా చూస్తూ ఏదో చదవడానికి ప్రయత్నించాడు. రామ్ కళ్ళలో నిశ భయంకర జీవితం ప్రతిబింబిస్తున్నట్టుగా తోచింది. రాజదేవ్‌కు ఎందుకో భయంవేసింది.

"ఉమేశ్‌కు ఉద్యోగం కూడా దొరికింది. అతని భార్య నిశ. అంగీకరించడానికీ, అంగీకరించక పోవడానికీ మధ్యలో నేనెవర్ని?" అన్నాడు తాపీగా.

"నిశ ఉమేశ్ భార్య కాదు."

రామ్ మాటవిని రాజదేవ్ బిత్తర పోయాడు. మరు క్షణంలో అతడి మనసులో దిగులు ప్రవేశించింది.

"నిశకు పెళ్ళికాలేదా? ఎవరన్నారు ?" తెచ్చి పెట్టుకొన్న కాఠిన్యంతో అడిగాడు.

"నిశే చెప్పింది. అమరనాథ్ బారినుండి రక్షించుకోవడానికే ఆ పుకారు లేవదీశారట. తమ్ముడిభార్య అంటే ఆమె జోలికి మళ్ళీ అమరనాథ్ రాడని వాళ్ళ భ్రమ. ఆమె మీతో కూడా అబద్ధం చెప్పిందట బెగూసరాయిలో ఆర్యసమాజం వారు వారి పెళ్ళి జరిపించినట్టు చెప్పిందట. అమరనాథ్ రాక్షసకౌగిలినుంచి బయట పడాలంటే అంతకంటే మరో ఉపాయం ఆమెకు తోచలేదు. నాన్నా! మీరు ఎప్పుడూ సత్యాన్ని సమర్థి

స్తారు. లాల్ ఎలాంటివాడో మీకు తెలుసు. నిశ ఆ ఇంటికి వెళ్తే ఆమెగతి ఏమౌతుందోకూడా మీరు ఊహించగలరు. మీ లాంటి తండ్రికి కొడుకునైన నేనుకూడా వాడి ఆకర్షణకులోనై రాక్షసుణ్ణి అయ్యాను. నిశ పాపం! అమాయకురాలు."

రాజదేవ్ మౌనంగా వింటూ వుండి పోయాడు.

ఇప్పుడు తనేం చెయ్యాలో అతడికి తట్టడంలేదు. రామ్ ఒక కందకం నుంచి బయటపడి మరో కందకంలో దూకేందుకు సిద్ధంగా వున్నాడా? అందుకే నిశకు పెళ్ళికాలేదని అబద్ధం చెప్తున్నాడా? రామ్ రెండో కందకంలోకి దిగేశాడనిపించింది రాజదేవ్‌కి.

అది కందకం అని తనెందు కనుకోవాలి. రామ్ ఎంచుకొన్న కొత్త మార్గం కాకూడదా? రాజదేవ్ రామ్ కళ్ళల్లోకి చూశాడు.

"రామ్. నిన్ను నేను పూర్తిగా అర్థం చేసుకొన్నాను. ఇప్పుడు మీ అమ్మ నిన్ను ముందులా చూడటం లేదు. చూసీ చూడనట్టుగా వుంటున్నది. ఆ విషయం నీకు తెలుసు. ఇంటి విషయం కూడా నీకు తెలుసు. వెళ్ళు. వెళ్ళి మీ అమ్మకు చెప్పు" అన్నాడు సానుభూతి పూర్వకంగా.

లలిత కొడుకు అభిప్రాయం అర్థం చేసుకుంది. కాని నిశను ఉమేశ్‌తో పంపకుండా ఈ ఇంట్లో వుంచు కోవడానికి వీల్లేదన్నది. రామ్ తల్లి కాళ్ళు పట్టుకొని ఏడ్చాడు. అయినా లలిత మనసు కరగ లేదు.

ఉమేశ్ తయారై నిశను పిల్చాడు.

నిశ లలిత గదిలోకి పరిగెత్తు కొచ్చింది. లలిత కాళ్ళకు చుట్టుకు పోయి భోరున ఏడ్వసాగింది. లలిత విసుగ్గా తన కాళ్ళను లాక్కున్నది.

"అమ్మా! మీకు ఇద్దరు కూతుళ్ళున్నారు. నన్ను మూడో కూతురుగా భావించండి. ఉమేశ్‌తో వెళ్ళడానికి నేను సిద్ధంగానే వున్నాను. కాని అతనితో బయటికి వెళ్ళే ముందు మీ సమక్షంలో మా ఇద్దరికీ పెళ్ళి జరిపించండి." అన్నది నిశ.

లలిత కరుణ హృదయం ద్రవించింది. పరమార్థమే ఆమె ధర్మం. కాని ఆమెకు తన కొడుకు మీద నమ్మకం లేదు.

"మీ ఇద్దరికీ పెళ్ళి చెయ్యడానికి నేనెవర్ని?" అన్నది లలిత. ఆ మాట అని మనసులోనే ఎంతో బాధపడింది.

"ఒక తల్లి ఒక తల్లిగానే నేను మిమ్మల్ని చూశాను. వరసకు కూడా మీ కుటుంబంలోని వ్యక్తినే. నా పెళ్ళి జరిపించే బాధ్యత మీకు వుంది. ఉమేశ్ ఇక్కడే నిల్చుని వున్నారు. ఆయన్నే అడగండి. మా ఇద్దరి మధ్యలో భార్యా భర్తలకు మధ్య వుండే సంబంధం ఏదైనా ఇంత వరకూ వుందేమో అడగండి." ఆవేశంగా అన్నది నిశ.

ఉమేశ్‌కు నిశ అలా ఎందుకు మాట్లాడు తుందో అర్థం కాలేదు కాని ఆమె భయం కొంతవరకు అర్థం అయింది.

"పిన్నీ. నిశను రెండు మూడు రోజులు ఇక్కడ వుండనివ్వండి. ఈ లోపల నేను పెళ్ళి ఏర్పాట్లు చేసుకొనివస్తాను". అని చర చరబయటికి వెళ్ళి పోయాడు. సామానును కూడా అక్కడే వదిలేసి వెళ్ళిపోయాడు.

లాల్ నారాయణ్ ఇంటికి వెళ్ళిపోయాడు.

ఉమేశ్ పది రోజులైనా తిరిగి రాలేదు.

రామ్ నిశకు దూరం దూరంగా వుంటున్నాడు. పగలంతా ఎక్కడెక్కడో తిరిగి రాత్రికి ఇంటికి వస్తాడు. తోచినంత తిని తన గది లోకి వెళ్ళిపోయి తలుపులు బిగించు కుంటాడు. ఇంట్లో ఎవరితోనూ మాట్లాడడు. అందర్నీ తప్పించుకొని తిరుగుతున్నాడు.

రాజదేవ్ ఏదైనా అడిగితే ముభావంగా సమాధానం చెప్తాడు. అన్నం కూడా పెట్టమని అడగడు. అన్నం తినడానికి పిలిస్తే ఇష్టం అయితే వెళ్తాడు. లేకుంటే గదిలో తలుపులు మూసుకొని పడుకుంటాడు.

ఒక రోజు తండ్రి కొడుకుని పిల్చాడు. తండ్రి ఎదురుగా వచ్చి నిలబడ్డాడు రామ్.

"నీకు ఏమైందిరా?"

"ఏమైంది? ఏమీ కాలేదు".

"మరి పగలంతా ఎక్కడ తిరుగు తున్నావ్?"

"ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాను. ఇవ్వాళ్ళే ఉద్యోగం ఖాయం అయింది. రేపటి నుంచి ట్రైనింగుకు వెళ్ళాలి.

"ఏం ఉద్యోగం?"

"ఇన్‌స్పెక్టర్ ఉద్యోగం."

రాజదేవ్ మనసులోనే కొడుకుని చూసుకొని గర్వపడ్డాడు. ఉద్యోగం కోసం రామ్ తన సహాయాన్ని కూడా కోరక పోవడం తండ్రికి ఎంతో ఆనందాన్ని కలిగించింది.

"బి.ఏ. పూర్తి చేస్తే బాగుండేదిగా? మరొక సంవత్సరమేగా?" అన్నాడు రాజదేవ్.

"వచ్చే సంవత్సరం ప్రైవేట్‌గా రాస్తాను. నన్ను నమ్మండి."

"నిన్ను పూర్తిగా నమ్ముతున్నాను రామ్. నువ్వు పూర్తిగా మారిపోయావని నాకు తెలుసు. అది సరే. ఇన్‌స్పెక్టర్ అంటే ఏ శాఖలో?"

"పోలీసులోని ఒక ప్రత్యేక శాఖలో. ఈ శాఖలో పని చేసేవాళ్లు దేశ సరిహద్దుల్లో పని చెయ్యాలి. చాలా బాధ్యతతో కూడిన ఉద్యోగం" రామ్ నవ్వుతూ చెప్పాడు.

# 6

ఒకరోజు సాయంకాలం ఉమేశ్ నిశను తీసుకెళ్ళడానికి వచ్చాడు. రామ్ ఇంట్లో లేడు. రాజదేవ్ ఆఫీసులోనే వున్నాడు. లలితకు లగ్న పత్రిక ఇచ్చాడు. నిశకు కూడా చూపించాడు. లలితతో అందర్నీ తీసుకొని రమ్మని చెప్పాడు. పెళ్ళి ఆరోజే.

లలిత నిశను అతడితో పంపించింది.

వాళ్లు వెళ్లిన రెండు గంటల తర్వాత రామ్ ఇంటికి వచ్చాడు. రాజదేవ్ ముందే వచ్చాడు. ఏదో అనుమానం కలిగింది రాజదేవ్‌కు ఇది మోసమేమో ననిపించింది. ఏం చెయ్యాలో తోచక వరండాలో అశాంతిగా పచార్లు చేస్తున్నాడు.

రామ్‌కు నిశ వెళ్ళిపోయిన విషయం వినగానే ఎంతో బాధ కలిగింది. లాల్ నారాయణ్ ఇంట్లో ఏమేమి జరుగి వుంటుందో రామ్‌కు బాగా తెలుసు. నిశను కూడా ఆ కుళ్ళు జీవితంలోకి దింపితే?

మొదటి పరిచయంలోనే రామ్‌కు నిశ స్వభావం అర్థం అయింది. ఆమెలో ఒక సాధ్విని చూశాడు. నీచత్వాన్ని బొత్తిగా భరించలేదు. మురికి పనుల్నీ, మురికి అలోచనల్నీ భరించే శక్తి ఆమెలో లేదు. ఆడంబరాలు కోరుకొనే తత్వం కాదు. ధనపిపాస అసలేలేదు. రామ్ ఆలోచిస్తున్నాడు.

ఒకవేళ ఇతర ఆడపిల్లలతో ప్రవర్తించినట్టు లాల్ ప్రవర్తిస్తే నిశ బ్రతుకదు. ఆత్మహత్య చేసుకుకోకుండా వుండదు.

నిశ దినచర్యచూసి మొదట మొదట రామ్‌కు చాలా ఆశ్చర్యంగా వుండేది అందరికంటే ముందు నిద్రలేచి స్నానం చేసేది. ఇంటి పనిలో మునిగిపోయేది. పిల్లలకు స్నానం చేయించడం, వాళ్ళను తయారుచేసి

స్కూలుకు పంపించడం, టిఫెన్‌చేసి బాక్సుల్లో పెట్టడం మొదలైన పనులు చేసేది. కొంచెం సమయం కుదిరితే చదువుకుంటూ కూర్చునేది హేరామన్, నందిని ఆమెకు చదువుచెప్పేవాళ్ళు. ప్రారంభంలో ఆమెలోని చురుకుతనం రామ్ కామేచ్ఛకు ఉద్దీపనగా పనిచేసింది. కాని ఇప్పుడు ఆమె గుణాలకు రామ్ పుజారి అయ్యాడు. రామ్ నిశను తను ప్రేమిస్తు న్నట్లుగా ఉమేశ్ ప్రవేశంతో గ్రహించాడు.

నిశ అసహాయతను తల్చుకొని రామ్ వ్యాకులచిత్తుడయ్యాడు.

"రామ్! నా కళ్ళలోని ఆవేదన నీకు అర్థంకావడం లేదా? ఈ కళ్లే కాదు నా శరీరంలోని అణువణువూ నిన్ను గొంతెత్తి పిలుస్తోంది. నా మనసులో నువ్వే. నా శరీరంలోని అణువణువులోనూ నీ అస్తిత్వమే. నీకంతా తెలుసు. లాల్ నారాయణ్ నరరూప రాక్షసుడని కూడా తెలుసు. అతడి దృష్టిలో ఆడదంటే అంగడి బొమ్మని నీకు తెలుసు. అయినా నువ్వు ఇంట్లో ఆలోచిస్తూ కూర్చున్నావా? నీకూ లాల్ నారాయణ్‌కూ భేదం ఏమిటి? ఇద్దరూ ఒక్కటే..."

రామ్ త్రుళ్ళిపడ్డాడు. ఎదురు నిల్చుని నిశ ప్రశ్నిస్తున్నట్టుగా అన్పించింది. చివ్వున లేచి తల్లిదగ్గరకు వెళ్ళాడు.

"అమ్మా! నువ్వు చేసింది మంచి పని కాదు. నువ్వు ఏం చేశావో తెలుసా? ఆవును కసాయివాడికి అప్పగించి నిశ్చింతగా కూర్చున్నావు. నేను ఆ కసాయి దుకాణానికి వెళ్తున్నాను. నిశ ఇంకా బ్రతికివుంటే తీసుకొస్తాను. లేకపోతే......" వాక్యం పూర్తి చెయ్యకుండానే రామ్ చర చర బయటికి వెళ్ళిపోయాడు.

లాల్ నారాయణ్ ఇంట్లో అడుగుపెట్టిన రామ్‌కు తల తిరిగినంత పనైంది. డ్రాయింగ్ రూంలో ఎవరూ లేరు.

"ఉమేశ్ పహల్వాన్ బాబుగారి బెడ్‌రూంలో వున్నారు" అని నౌకరు చెప్పాడు.

"ఆ అమ్మాయి ఎక్కడ? మీ బాబుగారు ఎక్కడ?"

"నాకు తెలియదు సాబ్."

రామ్ బెడ్ రూంలోకి వెళ్ళి చూశాడు.

ఉమేశ్ మంచం మీద స్పృహలేకుండా పడివున్నాడు. బెడ్ పక్కగా వున్న బల్ల దగ్గర రెండు కుర్చీలు వున్నాయి. బల్లమీద రెండు ఖాళీ సీసాలూ, రెండు ఖాళీ గ్లాసులూ వున్నాయి. రామ్‌కు చూడగానే అర్థం అయింది.

రాస్కెల్. ముందు ఉమేశ్‌కు బాగా తాగించాడు. తనేం చేశాడు? ముందు బాబూలాల్‌కు తాగించాడు. ఆ తర్వాత పారోను...లాల్‌గాడే తనకు ఈ ఉపాయం చెప్పింది. ఆ క్షణంలో అతడి మనసు గ్లానితో నిండిపోయింది.

నిశను కూడా...రామ్ ఆ ఆలోచనరాగానే ఔట్‌హౌస్‌కేసి పరుగు తీశాడు. బంగళా పక్కగా కొంత స్థలంలో లాన్ వుంది. ఆ తర్వాత రెండు గదుల అవుట్‌హౌస్ వుంది. అవుట్‌హౌస్ సమీపిస్తుండగానే నిశ కేకలు విన్పించాయి.

ఆమె ఇంకా జీవించే వున్నందుకు రామ్ గుండెలనిండా గాలి పీల్చుకున్నాడు.

రామ్ తలుపు గట్టిగా కొడ్తున్నాడు.

"ఎవరు?" కర్కశంగా లాల్‌నారాయణ కంఠం లోపల నుంచి ప్రశ్నించింది.

"నేనే! రామ్‌ను. తలుపు తెరువు."

ఏమనుకొన్నాడో ఏమో వెంటనే తలుపు తెరిచాడు. రామ్‌ను చూసి పెదవులపైకి నవ్వు తెచ్చిపెట్టుకొన్నాడు.

"చూడరా రామ్ దీన్ని! ఈ చెత్తముండ తనను సీతా, సావిత్రిగా మనం అనుకోవాలని నాటకం ఆడుతోంది. చచ్చిపోతాను కాని లొంగను అంటుంది. నువ్వు కూడా వచ్చావుగా? రా ఇద్దరం..."

లాల్ నారాయణ్ చెంప చెళ్లుమన్నది. కళ్ళముందు ఇంద్రధనస్సు రంగులు కన్పించాయి. ఏం జరిగిందో తెలుసుకొనే లోపలే రెండో దెబ్బ మెడమీద బలంగా పడింది. "అమ్మా" అంటూ నేలమీద కూలబడి పోయాడు లాల్.

నిశను చూశాడు రామ్. బ్లౌజ్ పూర్తిగా చిరిగిపోయింది. ఆమె సిగ్గుతో రెండు చేతులతో ఛాతీని కప్పుకొనే ప్రయత్నంలోవుంది. చీర పైట చెంగు పూర్తిగా చిరిగిపోయింది. ఆమె నెత్తి నుంచి రక్తం కారుతోంది. ఆమె కళ్ళు అచ్చంగా తను ఊహించినట్టే కన్పించాయి తనను నిలదీసి ప్రశ్నిస్తున్నట్టు వున్నాయి.

మంచం మీద వున్న దుప్పటి తీసి రామ్ నిశ భుజాలను కప్పివేశాడు.

నిశ ఒక్కసారిగా అతడ్ని పట్టుకొని నిండుకుండ బద్దలైనట్టు బావురుమన్నది. ఆ పరిస్థితిలో కూడా నిశ స్పర్శ అతడికి అలౌకిక అనుభూతిని కలిగించింది నారీ స్పర్శలో సృజనకు ప్రేరణ వుందని మొదటిసారిగా రామ్‌కు అన్పించింది

నిశ ఒక్కసారిగా రామ్‌ను వదిలేసి దూరంగా జరిగింది

"మీ రెందుకొచ్చారు ? నన్ను నా దురదృష్టానికి వదిలెయ్యండి. నా జీవితంలో ఎలా రాసి పెట్టి వుంటే అలా బ్రతుకుతాను. ఆ బ్రతుకు

బ్రతుకు కాదనిపిస్తే చస్తాను. చావడం కష్టం కాదు. బతకడమే కష్టం" అన్నది నిశ.

రామ్ తన చేత్తో ఆమె నోరు మూశాడు.

"చావు సంగతి మాట్లాడకు. పద నాతో" అన్నాడు.

"ఎక్కడికి?"

"ముందు బయలుదేరు చెప్తాను."

రామ్ నిశ భుజాలమీద చెయ్యివేసి బయటికి నడిపించుకొని వచ్చాడు. బయటికొచ్చి టాక్సీ ఆపి నిశను ఎక్కించి తను కూడా ఎక్కి ఆమె పక్కన కూర్చున్నాడు. దారిలో ఎవరూ మాట్లాడలేదు. ఎవరి ఆలోచనల్లో వాళ్ళుండిపోయారు.

రామ్ నిశను తల్లి దగ్గరకు తీసుకొనివచ్చాడు. లలిత ఇద్దర్నీ మరీ మరీ చూడసాగింది.

రామ్ ఒక్కసారి ఆమె కప్పుకొనివున్న దుప్పటి లాగేశాడు.

"చూడమ్మా. తల్లి ఒక బిడ్డను చూసినట్టుగా చూడు. మంచిదయింది నేను సమయానికి వెళ్ళాను. అసహాయ బాలికకు ఆశ్రయం ఇవ్వలేని సమాజ మర్యాద ఒక మర్యాదా? ఆ మర్యాదను కాపాడుకోవడంలోనే గౌరవం వుందా? తన శీల రక్షణకోసం ఈమెలా ఈ దేశంలోని ప్రతి యువతీ ప్రయత్నిస్తే ఏ చట్టాలూ అక్కర్లేదు. ఆడపిల్లలో ఆత్మ విశ్వాసం పెరగాలి." అనేసి రామ్ గది బయటికి వెళ్ళిపోయాడు.

రెండో రోజు ఉదయం రామ్ తండ్రి దగ్గరకెళ్ళాడు.

"నాన్నా, నేను ఇవ్వాల్టి నుంచి ఇంటికి రాను. ట్రైనింగ్ క్యాంప్ లోనే వుండిపోవాలి. కాని నిశ ఇక్కడే వుంటుంది. ఇప్పుడు ఆమెను ఈ ఇంట్లో నుంచి బయటికి పంపించడానికి వీల్లేదు" అని చరచర అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

రాజదేవ్ కొడుకు వెళ్ళిన వైపే చూస్తూ ఎంతోసేపు వుండి పోయాడు.

* * *

నాగాల గ్రామం రాజదేవ్ వచ్చి కొన్ని రోజులైంది.

డాక్టర్ కోసం పంపించిన వ్యక్తి ఇంకా తిరిగి రాలేదు. రాజదేవ్ ఆరోగ్యం రోజు రోజుకూ క్షీణిస్తోంది. కుడి మోకాలు నొప్పి భరించ లేనిదిగా వుంది. ఆ నొప్పి భరించలేని స్థితిలో అతడు స్పృహ తప్పి పోతాడు. ఆ స్థితిలో ఒక్కోసారి రెండేసి గంటలు వుండిపోతున్నాడు. చాలా బలహీనంగా అయిపోయాడు. చాలా చిన్నగా మాట్లాడ గలుగుతున్నాడు.

ఆ గ్రామంలో నాగాల నాయకుడి పేరు మెడోచి. అతడి ఇంట్లోనే వున్నాడు రాజదేవ్. మెడోచి వయసు ఏభయ్‌రెండేళ్ళు అయినా పాతిక ముప్పయ్ ఏళ్ళవాడిలా కన్పిస్తాడు. రాజదేవ్ బాధను చూస్తే అతడి చిన్న చిన్న కళ్ళు చెమ్మగిల్లుతాయి. మెడోచి మంచి వేటగాడు. యుద్ధ కౌశలం గలవాడు. అతడికి ఇద్దరు ఆడపిల్లలున్నారు. వాళ్ళకు పెళ్ళిళ్లు కాలేదు. ఒక అమ్మాయి పేరు చేనీ, రెండో అమ్మాయి పేరు డినో. ఒక అమ్మాయి వయసు ఇరవైరెండేళ్ళు, రెండో పిల్ల వయసు పదిహేడు సంవత్సరాలు. వాళ్ళిద్దరూ రామ్‌కు సేవలు చేస్తున్నారు. గౌరవర్ణంమీద నల్లటి ముంగురులు ఆటలు ఆడుతూ వుంటాయి మెడోచి భార్య ఆదర్శ గృహిణి.

పది రోజులు గడిచిపోయాయి. డాక్టర్ కోసం వెళ్ళినవాడు రాలేదు. మెడోచికి ఏం చెయ్యాలో తోచడంలేదు.

లాభంలేదు. మరి కొద్ది రోజులు వైద్యుడు రాకపోతే ఈయన బతకడు. మూర్ఛలు కూడా ఎక్కువగా వస్తున్నాయి. రాజదేవ్ బాధను

చూడలేక మెడోచి ఎక్కువగా బయట తిరగసాగాడు. క్షణం క్షణం వైద్యుని రాక కోసం నిరీక్షిస్తున్నాడు.

కనీసం అతడితో మాట్లాడటానికి ఆ ఇంట్లో ఎవరికీ హిందుస్తానీ రాదు. మెడోచికి ఒక ఆలోచన వచ్చింది.

అదే గ్రామంలో టేమ్‌జన్ అనే నాగా వున్నాడు. అతడి కూతురికి హిందుస్తానీ తెలుసు. ఆమె కొంత కాలం కొహిమాలో వుండి వచ్చింది. ఆమె పేరు నోరసింగ్.

మెడోచి సమస్య విని సంతోషంగా రాజదేవ్‌ను తన ఇంటికి తీసుకు రావడానికి ఆమె తండ్రి అంగీకరించాడు. నోర్‌సింగ్ కూడా సంతోషించింది".

సాక్షాత్తు ఏసు క్రీస్తే తన ఇంటికి వచ్చాడనే భావం కలిగింది. రాత్రింబవళ్లు రాజదేవ్ సేవలో మగ్నమైపోయింది.

పన్నెండవ రోజు రాజదేవ్ ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. అలాగే ఒకటి రెండు రోజులు వైద్యం లేకుండా వుంటే అతడు బతకడనేది అర్థం చేసుకొన్నారు నాగాలు. ఏ నాగాలు ఘోర కీకారణ్యంలో క్రూరమృగాలతో పోరాడుతూ బతుకుతున్నారో, ఏ నాగాలు భారతీయ సైన్యంలో అలసట అనేది తెలియకుండా పోరాడుతున్నారో, ఆ నాగాలు ఢిల్లీ నివాసి అయిన తెలియని వ్యక్తి ఆరోగ్యం గురించి అంతగా కలత చెందడం, సేవలు చెయ్యడం, వారి హృదయాలు ఎంత నిష్కల్మషమైనవో తెలియజెప్తున్నది.

మెడోచి ఊరి బయటవున్న కాలి బాటలో నిలబడి వైద్యుని కొరకు వెళ్ళినవాడి కోసం చూస్తున్నాడు ఆత్రంగా. మెడోచి మంచి వేటగాడు. వేటగాని శ్రవణశక్తి చాలా ఎక్కువగా వుంటుంది. దూరంలో

అయిన చిన్న శబ్దం కూడా వినే అలవాటు వారి చెవులకు ఏర్పడు తుంది.

ఉన్నట్టుండి మెడోచి ముఖం సంతోషంతో వికసించింది.

మనుష్యులు చూపు మేరలో కన్పించకపోయినా, ఎవరో వస్తున్న చప్పుడు మాత్రం విన్పించింది. వైద్యుడు వస్తున్నాడని అర్థం చేసు కొన్నాడు. మెడోచి టేమజన్ వైపు చూశాడు

"అవును. జీపు చప్పుడు విన్పిస్తోంది మెడోచి నువ్వు వెళ్ళి డాక్టర్ వస్తున్నాడని మా అమ్మాయికి చెప్పు" అని అన్నాడు.

మెడోచి టేమజన్ ఇంటికి పరుగు పరుగున వెళ్ళాడు. "నోర్ సింగ్ జీపు వస్తోంది. అంటే డాక్టరు వస్తున్నాడన్నమాట" అన్నాడు.

నోర్‌సింగ్ ఆనందంగా బయటికి పరుగుతీసింది. జీపు అంత వరకూరాదు. కొంతఎత్తు ఎక్కుతూ డాక్టర్ కన్పించాడు. ఇద్దరు నాగాలు డాక్టరుగారి సామాన్లు తీసుకొని ఆయనను అనుసరిస్తున్నారు.

టేమజన్ నోర్‌సింగ్‌ను చూస్తున్నాడు. ఆయన మనసు చేదు చేదుగా అయింది.

"డాక్టర్ వచ్చాడు తల్లీ! నీ ఈ రోగి కూడా ఆరోగ్యవంతుడై వెళ్ళిపోతాడు" అన్నాడు తండ్రి ఆర్ద్రంగా.

నోర్‌సింగు తల దించుకుంది. చూపులు నేలను కొలుస్తున్నాయి.

"నాన్నా! నేను ఒక వీరుడి కూతుర్ని. నాకు మృత్యువు అంటేనే భయం లేదు. ఈ వచ్చేపోయేవాళ్ళ గురించి ఎందుకు బాధపడ్తాను" అన్నది.

ఫాదరీ డాక్టర్ గబగబా కొండ ఎక్కి పైకొచ్చాడు. ఆలస్యానికి కారణం అడిగే సమయం కూడా లేదు.

మెడోచి, టేమజన్, డాక్టర్ను రోగి దగ్గరకు తీసుకెళ్ళారు. డాక్టరు రోగిని పరీక్షించాడు. రోగి స్పృహలో లేడు. మెడోచిని డాక్టరు పక్క గదిలోకి తీసుకెళ్ళాడు.

"చాలా ఆలస్యం అయింది. మోకాలువరకూ కాలు కుళ్ళిపోయి విషం వ్యాపించింది. కాలు తీసెయ్యాలి. లేకపోతే ఆ విషం పైకి వ్యాపించి ప్రాణానికే ముప్పు వాటిల్లుతుంది.

మెడోచికి మతిపోయినట్టయింది. డాక్టరుకు ఏం సమాధానం ఇవ్వాలో అర్థం కావడం లేదు అంతలో టేమజన్, నోర్‌సింగ్ అక్కడికి వచ్చారు.

"త్వరగా నిర్ణయం తీసుకోండి. ఆలస్యం అయితే ప్రాణాపాయం. త్వరగా చెప్పండి." డాక్టర్ అన్నాడు.

మెడోచి తృళ్ళిపడి, డాక్టర్ ముఖంలో అయోమయంగా చూశాడు. టేమజన్ కొంత అనుభవం కలవాడు.

"ఈ అరణ్యంలో ఆపరేషన్ ఎలా చెయ్యగలరు? అవసరమైన సామాగ్రి లేదే? ఇతను ఎవరో మీకు తెలియదు. ఎక్కడ్నుంచి వచ్చాడో అంతకంటే తెలియదు. అతడికి ఏమైనా అయితే...?"

"ఎవరయితే నేం? కాలు తీసేస్తే బ్రతికే అవకాశం వుంది. ఆపరేషన్‌కు అవసరమైన సామాగ్రి అంతా తెచ్చాను. ఆపరేషన్ అతడ్ని బ్రతికించే ప్రయత్నంగానే చేస్తున్నాం."

డాక్టర్ చెప్పిన విధంగా జరిగింది. ఆపరేషన్ పూర్తి అయింది. ఆపరేషన్ చేసేందుకు అవసరమైన వెలుతురు కూడా లేదు. కాని డాక్టర్ పట్టుదలతో దీక్షగా చీకటి పడడానికి ముందే ఆపరేషన్ ముగించాడు.

మెడోచి కూతుళ్ళిద్దరూ, నోర్‌సింగ్ ఆపరేషన్ జరిగినంతసేపూ డాక్టర్ పక్కనే నిలబడి వున్నారు అవసరమైన వస్తువులు అందిస్తూ.

మెడోచి, టేమజన్ ఇంటి బయట అశాంతిగా పచార్లు చేస్తూ వుండిపోయారు.

రాత్రంతా ఎవరూ నిద్ర పోలేదు.

సూర్యోదయం అప్పుడే అయింది. బాలభానుని నులివెచ్చని కిరణాలు అరణ్యంలోని చెట్లనూ, చేమల్నీ గోముగా స్పృశించాయి.

రాజదేవ్ కళ్ళు తెరిచాడు.

నోర్‌సింగ్‌ను తన మంచం పక్కగా స్టూలుమీద కూర్చొని వుండడం చూసి ఆలోచనలో పడ్డాడు. ఆమెను అంతకుముందు ఒకటి రెండుసార్లు మెడోచి ఇంట్లో చూశాడు. ఇప్పుడు తను ఎక్కడున్నాడు. మెడోచి కూతుళ్ళు కన్పించరేం?

నోర్‌సింగ్ ఆరాధనాభావంతో అతడి ముఖంలోకి చూస్తూ తల నిమిరింది. రాజదేవ్ కన్నార్పకుండా ఆమెనే చూస్తున్నాడు. తను ఇంటికి వెళ్ళినట్టూ, నందిని తన పక్కన కూర్చుని సేవలు చేస్తున్నట్టూ అనుభూతి కలిగింది.

"ఇప్పుడు మీరు మెడోచి ఇంట్లో లేరు. మా ఇంట్లో ఉన్నారు. నా పేరు నోర్‌సింగ్. ఇప్పుడు ఎలా వుంది?" అని హిందూస్తానీలో అడిగింది.

పన్నెండు రోజుల తర్వాత రాజదేవ్ పెదవుల మీద చిరునవ్వు తళుక్కుమన్నది. కాలు నొప్పిలేదు. అతడికి కాలు తీసేసినట్టు తెలియదు.

"బాగానే వుంది. పెద్దగా నొప్పి లేదు. కొద్దిగా వుంది. దాహం వేస్తుంది" అన్నాడు రాజదేవ్.

నోర్‌సింగ్ జాగ్రత్తగా చంచాతో నోట్లో నీళ్ళు పోసింది. దాహం తీరింది. నోర్‌సింగ్‌ను చూస్తూ వుండిపోయాడు. ఎందుకో రామ్ గుర్తొచ్చాడు.

"ఫాదరీ డాక్టర్ వచ్చారు. ఆయనను పిల్చుకొస్తాను" అంటూ నోర్‌సింగ్ బయటికి వెళ్ళడానికి లేచి నిల్చుంది

రాజదేవ్ ఆశ్చర్యంతో "డాక్టర్ ఎక్కడ్నుంచి వచ్చాడు ?" అని అడిగాడు.

"కొహిమా నుంచి. ఆయనే పిల్లల్ని బ్రతికించాడు".

రాజదేవ్ ఆమె కేసి చూస్తుంటే నందిని పెద్దది అయిందనిపించింది. అతడి కళ్ళలో కృతజ్ఞత, వాత్సల్య భావాలు కదిలాయి. అప్రయత్నంగానే అతడి కుడి చెయ్యి ఆమె బుగ్గను నిమరసాగింది. రాజదేవ్ మాట్లాడలేదు కాని అతడి కళ్ళు పెద్దగా "నువ్వు నందినవి. నువ్వు నివేదితవు" అని చెప్తున్నాయి.

తను ఇంటికి దూరంగా లేడు. తనవాళ్ళ మధ్యనే వున్నాడు. ఇదంతా లలిత చేసిన పుణ్య ఫలమే.

ఈ భావాలన్నీ అతడి కళ్ళల్లో సూక్ష్మరూపాన్ని ధరించాయి. ఆయన రెప్ప వాల్చ కుండా నోర్‌సింగును చూస్తున్నాడు.

రాజదేవ్ ఆలోచనలో పడ్డాడు.

రామ్ కూడా ఈ ప్రాంతంలోనే జబ్బుపడ్డాడు. ఈ ప్రాంతంలోని వారే రామ్‌కు ప్రాణదానం చేశారు. తను వీళ్ళకు ఏం చేశాడు? వాళ్లు తనను ఎంతగానో సేవలు చేసి బ్రతికించారు. రాజదేవ్ గతంలోకి జారిపోయాడు.

లలిత జ్ఞాపకాలలో పడిపోయాడు.

లలిత ప్లూరసీ నుండి పూర్తిగా బయటపడకుండానే లాల్ నారాయణ్ పచ్చ కామెర్ల జబ్బుకు గురి అయ్యాడు. ఆ రోజుల్లో ఢిల్లీలో పచ్చ కామెర్ల వ్యాధి విజృంభించి వున్నది. లలిత లాల్‌కు తన అనారోగ్యాన్ని మర్చిపోయి సేవలు చేసింది. లలిత ఆరోగ్యం మరీ దెబ్బతినిపోయింది. లాల్ తల్లీ, చెల్లెళ్లు తీరిగ్గా ఆలస్యంగా వచ్చారు. పూర్తిగా తగ్గకుండానే చుట్టం చూపులా వచ్చి వెళ్ళిపోయారు. అయినా లలిత అదేమీ పట్టించుకోలేదు. లాల్ నారాయణ్‌కు దాదాపు జబ్బు తగ్గిపోయాక పుష్కర్ వచ్చాడు. అతడికి కూడ ఆ జబ్బు పట్టుకుంది. లలిత విసుక్కోకుండా బావగారికి కూడా సేవ చేసింది.

రాజదేవ్ పుష్కర్‌ను ఆసుపత్రిలో చేర్పించాలనుకొన్నాడు. అందుకు లలిత అంగీకరించలేదు.

"ఆయన మనకు అతిథిగా వచ్చారు. అంతేకాదు కుటుంబ పెద్ద కూడా. మీ అన్నయ్య. ఆయనకు జబ్బు చేస్తే ఆసుపత్రిలో పడేస్తారా?" అన్నది లలిత.

జబ్బులతో, రోగుల సేవలతో రాజదేవ్ విసిగి పోయాడు. అంత చేసినా బంధువుల సాధింపు తగ్గలేదు.

"ఇంటి పెద్దా? ఈ ఇంటి పెద్ద నాకు ఉద్యోగం లేక నానా బాధలు పడ్తున్నప్పుడు ఏం చేశాడు. నువ్వు ఊళ్ళో వున్నప్పుడు ఎంత గౌరవంగా చూశారు? నీకు జబ్బు చేస్తే దమ్మిడీ ఖర్చు పెట్టి వైద్యం చేయించాడా? పైగా ఎన్ని మాటలు అన్నారు? ఎప్పుడు బీద అరుపులు అరిచేవాడు. నా దగ్గిరేముంది అనేవాడు. ఆడపిల్లల పెళ్ళిళ్ళు అయ్యేంత వరకు ఉమ్మడి కుటుంబంలో వున్నాడు. ఆ తర్వాత వెంటనే వేరు

పడ్డాడు నా దగ్గరేముంది అంటూ ఎప్పుడూ ఏడ్చేవాడు. వేరు పడగానే అంత పెద్ద ఇల్లు కట్టడానికి డబ్బు ఎక్కడ్నుంచి వచ్చింది పొలం కొనడానికి డబ్బు ఎక్కడ్నుంచి వచ్చింది కాస్త మన పరిస్థితి బాగుండే సరికి కొడుకును మనమీదకు తోలాడు. ఈయన మన ఇంటి పెద్దా? పెద్దవాడిగా ఎప్పుడైనా తన కర్తవ్యాన్ని నిర్వర్తించాడా? ఈనాడు వడ్డీ వ్యాపారం చేస్తూ గ్రామాన్నే తన గుప్పిట్లో పెట్టుకొన్నాడు." అన్నాడు ఉద్రేకంగా రాజదేవ్.

లలితకు అన్నీ తెలుసు. కుంభీపాక నరకం అనే పేరు తను విన్నది. వివాహం అయి అత్తవారింటికెళ్ళాక అది ఎలా వుంటుందో స్వయంగా అనుభవించింది. అయినా లలిత మనసులో ఎవరిమీద ద్వేషం ఏర్పడలేదు. తన కర్మ ఫలంగా భావించింది. ఏనాడు ఏ పాపం చేశానో ఈనాడు అనుభవిస్తున్నాననుకొన్నది. పైగా తనే రాజదేవ్‌ను ఆ కుటుంబానికి కాకుండా చేశానని భావించేది.

లలిత చాలా ప్రశాంతంగా రాజదేవ్‌కు సమాధానం ఇచ్చింది.

"మీ అన్నయ్య చేసినట్టు ప్రతివాళ్లూ చేస్తే ప్రళయం వస్తుంది. ఈ సమాజం ఇలా వుండేది కాదు. ప్రతి మనిషీ కుటుంబం పట్ల, సమాజం పట్ల, దేశం పట్ల ఋణపడి వుంటాడు. రోగి స్వంతవాడైనా, పరాయి వాడైనా సేవ చెయ్యడం మానవ ధర్మం. ఆ ధర్మం తెలుసుకొన్నవాడే మానవుడు."

"నీకు జబ్బు పూర్తిగా తగ్గలేదు రోగుల సేవ ప్రారంభించావు. ఒకరి తర్వాత ఒకరి సేవ. ఇలా కొంత కాలం జరిగితే ఏమౌతుందో ఆలోచించావా? నువ్వు మళ్ళీ జబ్బుపడితే...?...

"ఆ జబ్బు పడితే? ఆగిపోయావేం? చచ్చిపోతానంటారు-ఓష్! అంతేగా? అందరం ఏదో ఒకరోజు పోవాల్సినవాళ్ళమే. ఇతరులకు సేవ చేస్తూ చేస్తూ చచ్చిపోవడంలోనే జీవిత సాఫల్యం వుంది.

"ఇతరుల సేవ తనవాళ్ళ సేవ తర్వాత చెయ్యి. నివేదిత చిన్న పిల్ల. టైఫాయిడ్ పడి లేచింది. దాన్ని చూసుకోవాలి ముందు."

తన వాళ్ళకు చేసుకోవడం సేవ ఎలా అవుతుంది. సేవలో స్వార్థం వుండదు. స్వార్థం లేకుండా చేస్తేనే దాన్ని సేవ అనాలి. ప్రతీకారం పశు ప్రవృత్తి. పరమార్థం మానవోచితం ........."

లలిత అన్నది భవిష్యవాణిలా మారింది. ఆమె అన్నది సత్యం. తను ఇతరుల వల్ల మానసిక వేదనకు గురి అయింది. ఆమెకు సహాయం అవసరం అయినప్పుడు ఎవరూ చెయ్యి అందించలేదు. అయినా ఆమె ఎవరిమీదా కసి పెంచుకోలేదు. పొరపాటున కూడా వాళ్ళు తనను వేధించారని అనదు.

అంతేకాదు తనకు చేతనైనంత సేవ వాళ్ళకు సంతోషంగా చేస్తున్నది. సేవ అనే పదానికి అర్థం తనకు లలితే చెప్పింది. తన వాళ్ళకు చేసుకోవడంలో ప్రత్యేకత ఏమీ లేదు. కష్టంలో ఉన్నప్పుడు ఆ వ్యక్తి తనవాడా పరాయివాడా అని ఆలోచించడం మానవత్వం కాదు. పశుత్వం. ఇతరుల సుఖంకోసం చేసే కర్మే సేవకు అభివ్యక్తీకరణ.

రాజదేవ్‌కు ఒక్కొక్క ఘటన నిన్నా మొన్నా జరిగినంత స్పష్టంగా గుర్తున్నది.

లలితకు ప్రసవ వేదన కలిగినప్పుడు తను చాలా బీద స్థితిలో వున్నాడు. ప్రూఫ్ రీడర్‌గా వంద రూపాయలు నెలకు సంపాదించేవాడు.

రాజదేవ్ ఎంత సంఘర్షణకు గురి అవుతున్నాడో లలితకు తెలుసు. ఆమెలో అర్థం చేసుకోగల వివేకం వుంది. జీవిత భాగస్వామినిగా తన కర్తవ్యాన్ని తెలుసుకొన్న లలిత రాజదేవ్‌ను 'ఇది కావాలి, అది కావాలి' అని ఏనాడూ వేధించలేదు. మామగారు వున్నారు. బావగారు వున్నారు. తనను ఆదరిస్తారని భావించింది. మామగారు వృద్ధులు. ఆయనే స్వయంగా అసహాయ స్థితిలో వున్నాడు. అతడు ఆమెకు ఏమీ చెయ్యలేక పోయాడు.

లలిత గ్రామంలోనే రామ్‌ను ప్రసవించింది. ఆమెకు మందు ఇవ్వలేదు. బలమైన, బాలింతరాలికి అవసరమైన ఆహారం కూడా ఇవ్వలేదు. తన అదృష్టం బాగుండి లలిత ఏడు రోజులు బ్రతికివుంది అనుకొన్నాడు రాజదేవ్ ఆమెను పదమూడవ రోజు గ్రామం వచ్చి చూసి.

లలిత అస్థిపంజరంలా పడివుంది. కళ్ళు లోతుకు పీక్కుపోయి వున్నాయి. ముఖంలో స్పష్టంగా రక్తహీనత కన్పిస్తోంది. గాలీ వెలుతురూ రాని గదిలో, పాత బట్టలతో కుట్టిన పాతకాలపు పరుపు నేలమీద పరచి వుంది. దానిమీదే పడుకొని వుంది. గది గోడలు నల్లగా పొగచూరి వున్నాయి. గది మూలలో బూజు వేలాడుతున్నది. గది ఊడ్చి చాలా కాలం అయిందని చూడగానే తెలిసిపోతున్నది.

అది చూసి రాజదేవ్‌కు లలిత తన ఇంట్లోనే, తనవాళ్ళ మధ్యనే ఎలాంటి నికృష్టపు జీవితాన్ని గడుపుతోందో రాజదేవ్‌కు తెలిసింది. ఇంట్లో అందరూ వున్నారు. అన్న వున్నాడు వదిన వుంది. తండ్రి కూడా వున్నాడు. ఆమె స్థితిచూసి రాజదేవ్ గుండెలోకి బల్లెం దిగినట్టుగా విలవిలలాడిపోయాడు.

ఈరోజు తనకు, తన భాష కూడా తెలియనివాళ్ళు సేవ చేస్తున్నారు. తనకోసం బాధపడుతున్నారు. తనను మృత్యువు నుంచి కాపాడ

డానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నారు. ఇదంతా లలిత మంచితనమే తనకు ఈ రూపంలో అందుతుందనిపించింది

ఫాదరీ డాక్టర్ నాగా నాయకుడు టేమజన్‌తో రాజదేవ్ వున్న గదిలో ప్రవేశించాడు

"ఎలా వున్నారు?" డాక్టర్ అడిగాడు.

రాజదేవ్ రెండు చేతులూ ఎత్తి నమస్కరించాడు.

డాక్టర్ ఆ పక్కనే వున్న స్టూలుమీద కూర్చున్నాడు.

రాజదేవ్ రెండు చేతులూ పట్టుకొని "మీకు తెలుసా, నేనేం చేశానో?" అని ఆర్ద్ర కంఠంతో అడిగాడు.

"తెలుసు. నాకు జీవితాన్ని ప్రసాదించారు."

"జీవనదానం ఇచ్చింది నేను కాదు. మెడోచి, టేమజన్, వారి కుటుంబ సభ్యులు ఇచ్చారు. నే నేం చేశానో మీకు తెలియదు."

"ఏం చేశారు?" ఆశ్చర్యంగా అడిగాడు.

డాక్టర్ ఆలోచిస్తూ వుండిపోయాడు.

"చెప్పండి డాక్టర్ మీరు ఏం చేశారు?"

"నీ కుడి కాలును మోకాలు వరకు తీసేశాను."

ఒక్కసారిగా రాజదేవ్ కళ్ళు మూసుకొన్నాడు. మనసు మీద సుత్తి దెబ్బలా తగిలింది డాక్టరు అన్నమాట కాని కొద్ది క్షణాల్లోనే తేరుకొన్నాడు. కళ్ళు తెరిచాడు. డాక్టర్ను చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

"మీరు మంచిపనే చేశారనుకుంటా. నా ప్రాణం కాపాడడానికే ఆ పని చేసి వుంటారు."

"అవును. నీ కాలు కుళ్ళిపోయింది. ఇంకా కొద్ది గంటలు ఆలస్యం అయితే పూర్తిగా కాలు కుళ్ళిపోవడమే కాక ప్రాణాపాయం కూడా వుండేది చాలా ఆలోచించే కాలు తీసేశాను. నోర్ సింగ్ మీ ప్రాణం కాపాడడానికి ఏదైనా చెయ్యమని ప్రోత్సహించింది. మీరు బాధ పడొద్దు. ఆర్టిఫిషియల్ కాలు పెట్టుకోవచ్చు. పెద్దగా ఇబ్బంది వుండదు. అభ్యాసం అయితే కర్ర సహాయం లేకుండా నడవగలరు. ఆ తర్వాత గుర్తు చేసుకుంటే తప్ప మీకు ఒక కాలు ఆర్టిఫిషియల్ అని కూడా అన్పించదు.

"మంచిపనే చేశారు. నేను ఎక్కడ తిరగాలి? జీవితమంతా పరుగులు తీస్తూనే వున్నాను. నా నుంచి నేనే పరుగులు తీశానేమో అనిపిస్తుంది ఇప్పుడు ఆ జీవితాన్ని తల్చుకుంటే. మంచిదే అయింది. ఇక పరుగులు తీయడం వుండదు."

బహుశా దుఃఖం అతిశయించినప్పుడు, సత్యం సాక్షాత్కరిస్తుందేమో?

జీవితమంతా దేనికోసమో పరుగులు తీసింది. ఇప్పుడు రాజదేవ్‌కు అర్థరహితంగా అన్పిస్తోంది. సమాజంలో పెద్ద స్థానం సంపాదించుకో గలిగాడు. పేరు ప్రతిష్ఠల్నికూడా సంపాదించుకున్నాడు. కాని మనశ్శాంతి మాత్రం పొందలేక పోయాడు. శాంతి బయట నుంచి వచ్చేదికాదు అంతఃకరణ నుంచి రావాలి.

రాజదేవ్‌కు అహంకారం లేకపోలేదు. ఆ అహంకారంతోనే కొన్ని సాధించగలిగాడు; కొన్ని పోగొట్టుకొన్నాడు. తన వ్యక్తిత్వాన్ని పది మంది గుర్తించాలనే ఆశ బయలుదేరింది. ఆ తర్వాత విశ్రాంతి ఎక్కడుంటుంది. జీవితంలోని సుఖ శాంతులను దానికోసం బలిదానం చేశాడు.

లలిత తను చేసిన పనులకు ప్రతిఫలం ఏనాడూ ఆశించలేదు.

లలిత ఎప్పుడైనా, ఏదైనా, ఎవరినుంచి అయినా ఆశించిందంటే అది తన భర్తనుంచే. ఈ కోరికలో కూడా స్వార్థం లేదు. ఆమె కోర్కెలో ఆత్మ సమర్పణ భావం ఉంది. అలౌకిక నిష్ఠ వుంది.

లలిత ఒక విషయంలో మాత్రం రాజదేవ్‌కు అర్థం కాలేదు.

రామ్‌ను అవసరమైన దానికంటే ఎక్కువగా ముద్దు చేసేది. సానుభూతి చూపేది. రామ్ చేస్తున్న భయంకరమైన పనులు చూచికూడా తెలిసీ తెలియనట్టే నటించేది. రాజదేవ్ రామ్‌ను దూరంగా ఉంచితే ఆమె అత్యంత దగ్గరగా తీసుకొనేది. కాని రామ్ చెడు మార్గం వదిలి మంచి మార్గంలోకి వచ్చాడు. రాజదేవ్‌కు దగ్గర అయ్యాడు. లలిత మాత్రం రామ్‌కు దూర దూరంగా వుంటూ వచ్చింది. అదే అతడికి అర్థం కాని పజిల్.

రామ్ నిశను ప్రేమించసాగాడు. నిశకు కూడా రామ్ మీద ఇష్టం ఏర్పడింది. రామ్ నిశను వివాహం చేసుకోవాలనుకున్నాడు. లలితకు అది సుతరమూ ఇష్టంలేదు.

ట్రైనింగ్ పూర్తి అయ్యాక రామ్‌ను "రావో" అనే దళంలో నియమించారు ఆ డిపార్ట్‌మెంటు కేంద్ర ప్రభుత్వానికి సంబంధించినది డ్యూటీ దాదాపు పోలీసుల డ్యూటీ లాంటిదే. అయితే 'రావో' దళం సరిహద్దుల్లో పనిచెయ్యాల్సివుంటుంది

తను డ్యూటీమీద వెళ్ళేముందే నిశను వివాహం చేసుకోవాలనుకొన్నాడు. అప్పుడు ఆమెకు ఆ ఇంట్లో ఒక స్థానం వుంటుందని భావించాడు రక్షణ కూడా వుంటుందని ఆశించాడు. తండ్రి ఈ వివాహానికి అడ్డు చెప్పడని తెలుసు. తల్లి అంగీకరించదేమోననే భయం పట్టుకుంది.

ఒక రోజు ధైర్యంచేసి తల్లితో చెప్పేశాడు.

లలితకు ఆశ్చర్యం కలగలేదు. అలాంటి క్షణం వస్తుందని ముందే తెలుసుకొన్నదానిలా విన్నది.

"ఈ పెళ్ళి నేను బ్రతికివుండగా జరగదు."

"ఏం? ఎందుకు జరగదు? నిశకు ఏం తక్కువైంది?"

"నిశకేం? నిశ చాలా మంచిపిల్ల. నీకే ఆ పిల్లను చేసుకొనే అర్హత లేదు."

దెబ్బతిన్న మూగజంతువులా తల్లిని చూస్తూ వుండిపోయాడు.

"నేను ఆ యోగ్యతను పొందే ప్రయత్నంలోనే వున్నానమ్మా. నీకు తెలియదా! నేను ముందు ఎలా ఉన్నాను? ఈరోజు ఎలా వున్నాను? భవిష్యత్తులో ఎన్నో సాధించాలనే దీక్షతో వున్నాను."

"నేను నీ భవిష్యత్తు గురించి చెప్పడంలేదు. నిశ ఈనాటి సమాజంలో ఇమడలేదు. మీ దాంపత్యం సుఖమయం అవుతుందనే నమ్మకం నాకు లేదు."

"ఈనాటి సమాజంలో ఇమిడే పిల్ల కావాలని నేను కోరుకోలేదు. నాకు నిశ కావాలి. అంతే. పైగా నువ్వు ఊహిస్తున్న సమాజంలో నాకు వుండాలని లేదు నిశను పల్లెటూరి గబ్బిలాయి అని సమాజం వేలు ఎత్తి చూపి అన్నా నేను లక్ష్యం చెయ్యను."

"మనిషి సమాజంలో వుండాలి. వుంటాడు. మొదట వ్యామోహంలో ప్రతి యువకుడూ ఇలాంటి మాటలే అంటాడు. కాని విని విని క్రమంగా మారిపోతాడు. భార్య బయటి ప్రపంచంలోకి రావడం కూడా ఇష్టం వుండదు. నాతో అనవసరంగా వాదించకు. ఈ వివాహానికి నేను అంగీకరించను."

రామ్ మౌనంగా గది బయటికి వెళ్ళిపోయాడు.

గడపలోనే నిశ నిల్చుని వుంది.

కద్దరి కళ్లూ కలిశాయి.

ఆమె కళ్ళల్లో విషాదం లేదు. క్రోధం లేదు. ఆక్రోశం అంత కన్నా లేదు. ఆ కళ్ళలో వున్న భావాన్ని అర్థం చేసుకోలేని రామ్‌కు మనసు పిండినట్టుగా అయింది.

నిశ కళ్ళల్లోని భావం ఏమిటి?

పరాజయభావమా లేక విజయం సాధించాననే గర్వమా ? అవమానం పొందిన భావమా ? తిరస్కారాన్ని గరళంలా మింగగా కళ్ళలో ప్రతిఫలించిన పరిణామమా ? ఏమిటి ?

బహుశా అన్ని భావాల మిశ్రమమేమో ?

నిశ పెదవుల మీద సన్న చిరునవ్వు విరిసింది.

ఆ చిరునవ్వు రామ్ వెనుకలోకి ఏదో పాకినట్టుగాఅయి దిగాలు పడిపోయాడు. ఏదో అజ్ఞాత భయంకూడా కలిగింది.

నిశ ముఖంలోకి చూసి మాట్లాడే సహనం అతడికి లేదు తల దించుకొని ఉసిగా కసిగా అక్కడ్నుంచి వెళ్ళి పోయాడు.

ఆ రాత్రే ఎవరికీ చెప్పకుండా నిశ ఎక్కడికో వెళ్ళిపోయింది.

రాజదేవ్ ఆమె కోసం చాలా వెదికాడు. వెతికించాడు.

రామ్‌కు పోస్టింగ్స్ వచ్చాయి. సరిహద్దు దళంలో చేరాలి. అయినా ఒక వారం సెలవు పెట్టి ఢిల్లీ అంతా పిచ్చివాడిలా నిశ కోసం తిరిగాడు. ఆమె కన్పించలేదు. సీతమ్మ వారిలా భూమిలోకి వెళ్ళిపోయిందా అనిపించింది రామ్‌కు.

నిశను వెతుక్కుంటూ ఉమేశ్‌ను కలవడానికి లాల్ నారాయణ్ ఇంటికి వెళ్ళాడు. ఉమేశ్ ఆ సమయంలో అక్కడే వున్నాడు. నిశ ఇల్లు విడిచి వెళ్ళిపోయినట్టు విన్న ఉమేశ్‌కు ఆశ్చర్యం కలిగింది. బాధగా అన్పించింది. ఉమేశ్ పెద్దగా తెలివైన వాడు కాడు. శారీరిక శక్తితో ప్రపంచాన్ని జయించగలననే నమ్మకం కలవాడు. ఆ శారీరక శక్తి పెంచుకొనే ప్రయత్నంలో బుర్ర ఏనాడూ ఉపయోగించలేదు. అతనికి పెళ్ళిచేసుకొనే ఉద్దేశ్యం కూడా లేదు.

నిశ పరిస్థితిని చూసి అతడికి జాలి కలిగేది. గ్రామం నుంచి పట్నం వచ్చే ముందు చాలా బాధపడ్డాడు. ఢిల్లీ లాంటి పట్నంలో శరీర వ్యాయామం ఎలా నిర్వహించాలనే ఆలోచన వచ్చింది. అతడికి గ్రామం విడిచి రావడం సుతరామూ ఇష్టం లేదు. లాల్ నారాయణ్ వెంటనే ఉద్యోగం ఇవ్వడం, అదీ అతడి శరీర సౌష్టవాన్ని దృష్టిలో పెట్టుకొని బాడీగార్డుగా ఇవ్వడం, అతడికి ఎంతో సంతృప్తిని కలిగించింది.

లాల్ నారాయణ్ సలహాతోనే నిశను ఉమేశ్ తీసుకెళ్ళాడు. రామ్‌లాల్ బారినుంచి నిశను రక్షించి ఇంటికి తీసుకొచ్చాడు.

"నువ్వు నిశను పెళ్ళి చేసుకున్నా వనుకున్నాను. పాపం? ఏమైందో? ఎక్కడెక్కడ ఎన్నెన్ని బాధలు పడ్తుందో?"

"ఉమేశ్ నిజం చెప్పు. నువ్వు నిశను ప్రేమిస్తున్నావా?" రామ్ ప్రశ్నించాడు.

"ఎందుకు ప్రేమించడం లేదు. ఆమె అంటే నాకు చాలా ప్రేమ. అందుకే ఆమెను మా అన్నయ్య బారి నుంచి రక్షించడానికి నేను పెళ్ళి చేసుకున్నానని చెప్పాను. ఆమెను పెళ్ళిచేసుకోవాలనే కోరిక నాకు లేదు. జిన్మాంతా బ్రహ్మచారిగా ఉండాలనేదే నా జీవిత లక్ష్యం. కేవలం నిశకు

రక్షణ కల్పించాలనే ఉద్దేశ్యంతో వివాహానికి సిద్ధపడ్డాను". ఉమేశ్ అన్నాడు తాపీగా నవ్వుతూ.

రామ్ నిశ కోసం వెదికి వెదికి వేసారిపోయాడు. డ్యూటీలో చేర డానికి బయలుదేరాడు. తల్లి దగ్గరకు వెళ్ళి అన్నాడు—

"అమ్మా ! నేను చెడు మార్గాల్లో నడిచినప్పుడు నీ ప్రేమ నాకు లభించింది. ఈ రోజు నాకు అర్థం అయింది. అది ప్రేమ కాదు. కేవలం జాలి మాత్రమే. ఈనాడు నేను సక్రమ మార్గంలో నడుస్తూ వుంటే నీ దయకు దూరం అయ్యాను. కర్తవ్యంలోని కాఠిన్యం నన్ను అశాంతికి గురిచెయ్యకుండా వుండాలని నేను భగవంతుడ్ని ప్రార్థి స్తున్నాను నా జీవితంలో ఇప్పుడు మిగిలింది కఠోరమైన కర్తవ్యం మాత్రమే. నాకు పెళ్ళి చెయ్యాలని కలలు కనకు. నిశకు తప్ప నా జీవితంలో మరొకరికి స్థానంలేదు".

రాజదేవ్‌కు బాగా గుర్తు. రామ్ పెళ్ళి అయిపోయిన ఒక సంవ త్సరం తర్వాత అతడికి హోటల్ అశోకలో నిశ కన్పించింది. ప్రమోద్ కూడా వున్నాడు. ప్రమోద్‌లాల్ రాజదేవ్ అన్న కొడుకు. ప్రమోద్ ఢిల్లీలో "స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్"లో ఆఖరు సంవత్సరం చదువుతున్నాడు. నిశ వేషం, నడక, మాట్లాడే తీరు చూసి రాజదేవ్‌కు మతిపోయినట్టే అయింది. గిరజాలజుట్టు చేతులులేని జాకెట్టూ. వీపు క్రింది భాగం సగానికి పైగా కన్పించే బ్లౌజు-ముందు చాలా కిందవరకూ కత్తిరిం చిన బ్లౌజు మెడ-దేవతావస్త్రం వంటి చీర. చీర కట్టిన విధానం కూడా అధునాతనంగా వుంది. బొడ్డు కిందకు కట్టింది. కుచ్చెళ్ళుమాత్రం నేలమీద జీరాడుతున్నాయి. పాలరాతి విగ్రహంలా మెరిసిపోతోంది నియాన్‌లైట్ల వెలుగులో.

చేతిలో డ్రింక్ గ్లాసు వుంది. రాజదేవ్‌ను చూడగానే గ్లాసువున్న ఆమె చెయ్యి వణికింది. ముఖం వెలవెలా పోయింది. చిత్రమైన చిరునవ్వు పెదవులమీదకు తెచ్చిపెట్టుకొని రాజదేవ్ దగ్గరకు వచ్చి వంగి నమస్కరించింది.

"మీరు...మీరు ఇలాంటి పార్టీలకు వస్తారా?" అని ఆశ్చర్యంగా అడిగింది నిశ.

"అప్పుడప్పుడు రాకతప్పదు."

"నేను పూర్తిగా ఇలాంటి పార్టీలకే వస్తాను" అతను అడక్కుండానే చెప్పింది.

పెదవులమీద చిరునవ్వు వున్నా, కళ్ళల్లో వేదన కొట్టొచ్చినట్టు కన్పించింది రాజదేవ్‌కు. ఆమె మాటలు చాలా కృత్రిమంగా వున్నాయి. నిశ పూర్తిగా మారిపోయింది.

నిశ స్థితి చూసిగానీ, అమె మాటలు వినిగానీ రాజదేవ్ ఆశ్చర్యపడలేదు. అతడి మనసులో ఏదో గుచ్చుకున్నట్టుగా బాధ పడ్డాడు. క్రమంగా గ్లాని బాధ స్థానాన్ని ఆక్రమించుకొన్నది.

నిశ ఇలా కావడానికి కారణం తనే. గ్రామం నుంచి ఆమెను తనే తీసుకొచ్చాడు. కాని సరైన రక్షణ కల్పించలేకపోయాడు. గ్రామం నుంచి వచ్చిన నిశ ఎంత అమాయకంగా వుండేది? ఎంత అందంగా వుండేది. సాదా వేషంలో అమాయకంగా కనిపించే నిశ, ఈ నిశ కంటే వెయ్యి రెట్లు అందమైనది. తను తండ్రి స్థానంలో వుండి నిశకు తన ఇంట్లో ఆశ్రయం ఇచ్చాడు. లలిత కూడా తల్లిలాగే ఆదరించింది.

నిశ ఓ పక్కగా నిల్చుని ఆలోచిస్తున్న రాజదేవ్‌ను చూసింది. అతడు ఏమి ఆలోచిస్తున్నాడో ఊహించుకో గలిగింది. తను నిజంగా ఎలా బ్రతుకుతుందో రాజదేవ్‌కు తెలియకూడదు. అంతేకాదు మళ్ళీ ఎవరి

దయమీద తను ఆధారపడకూడదు. ఎవరి సానుభూతి మీదా బ్రతకకూడదు.

రాజదేవ్ ఆమెను చూస్తూ తనకు తానే చెప్పుకుంటున్నట్టుగా చిన్నగా అన్నాడు-

"ఏదో జరిగి తీరుతుందనుకొన్నాను. కాని ఈ రకంగా తయారు అయ్యే అవకాశం వుందని కలలో కూడా ఊహించలేక పోయాను."

"జీవించడానికి ఇలాంటి అవకాశం మాత్రమే నా అదృష్టంలో రాసి వుందని నేనూ కలలో కూడా ఊహించలేదు." అన్నది నిశ.

రాజదేవ్ తల వంచుకొని అక్కడ్నుంచి దూరంగా వెళ్ళిపోయాడు. అతని స్థానంలో ప్రమోద్ వచ్చి నిలబడ్డాడు.

"నన్ను గుర్తించావా?" నవ్వుతూ అడిగాడు.

"ఎక్కడో చూసినట్టే వుంది." అన్నది కావాలనే.

"ఎక్కడ చూశానో గుర్తు రావడం లేదు." మళ్ళీ నిశ అన్నది.

నిశకు ఆ సమయంలో ఎవరితోనూ మాట్లాడాలని లేదు. ఏకాంతంలో మనసారా ఏడ్వాలని వుంది. ఆమెకు తన నుదురు పెద్దరాతి బండకు వేసి కొట్టుకోవాలని వుంది. నుదురు చిట్లి కారే రక్తంతో తన నుదుటిరాతను చెరిపేసుకోవాలని వుంది. భూత, భవిష్యత్, వర్తమానాలను నామరూపాలు లేకుండా తుడిచెయ్యాలని వుంది

"ఇంకా గుర్తు రాలేదా ?"

"జీవితం ఒకరి పరిచయం అనేది ప్రధానాంశం కాదు. ఎందరో పరిచయం అవుతారు. అందరూ గుర్తుండరు.

"అభినయం ఒక మంచి కళే. ఆ కళ తెలియని మనిషి సామాన్యుడిగా మిగిలిపోతాడు. అభినయ కళ తెలిసినవాడు సినీమా

నాయకుడవుతాడు. రాజకీయ నాయకుడవుతాడు. పెద్ద పెద్ద కుర్చీలు సంపాదిస్తాడు. ఒకోసారి అవతారమూర్తి ప్రశంసలు పొందుతాడు ముఖానికి ముసుగు తగిలించుకుంటే ఆ ముసుగులో వర్తమానం దాగిపో వచ్చును. కాని గతం దాగదు."

"ఈ ప్రపంచంలో బ్రతకాలంటే ముఖానికి ముసుగు చాలా అవసరం ప్రమోద్ గారూ! కేవలం బ్రతకడానికి మాత్రం బ్రతికే వాళ్ళకు భవిష్యత్తు ఒక మృత్యువులాంటిది. భవిష్యత్తుకు భయపడి అలాంటి వాళ్ళు వర్తమానంలోనే బ్రతుకుతారు."

"బ్రతికి వుండాలంటే రంగ స్థలం దిగాలి. ముఖానికి వున్నరంగు కడుక్కోవాలి. సరి. ఆ సంగతి వదిలెయ్యండి పదండి ఎక్కడికైనా బయటికి వెళ్దాం" అన్నాడు ప్రమోద్.

ప్రమోద్ మాటలు ఆమెకు సర్దాగా అన్పించాయి. రాజదేవ్‌ను చూసి బరువెక్కిన మనసు కొంచెం తేలిక పడినట్టు అన్పించింది. ఏది ఏమైనా గతాన్ని పాతిపెట్టడం మంచిదని భావించింది.

"నేను మా బాస్ కోసం చూస్తున్నాను. మీతో బయటికి వెళ్ళ లేను. మీరు కూడా బాబుగారితో వచ్చారుగా?" అన్నది నిశ.

నిశ రాజదేవ్‌ను బాబుగారు అనడం ప్రమోద్‌కు ఎంతో ఆనం దాన్ని కలిగించింది. లాల్, ప్రమోద్ ఒకే తల్లి బిడ్డలైనా స్వభావంలో ఆకాశపాతాళాలకున్నంత వ్యత్యాసం వుంది. ప్రమోద్ ధైర్యసాహసా లతోపాటు నిర్దిష్టమైన ఉన్నత ఆశయాలు గల యువకుడు. నిశ గురించి అనేక విషయాలు విన్నాడు. మొదటినుంచి నిశ అంటే అతడికి ఎంతో అభిమానం. ఆమె రూపం, ఆ వ్యక్తిత్వం అతడ్ని ఎంతగానో ఆకర్షిం చాయి.

నిశ చెయ్యి పట్టుకొని "బయటికి రానన్నావు. ఫర్వాలేదు. ఇక్కడే ఆ పక్కగా సోఫా వుంది. అక్కడ కూర్చుందాం పద. అవును, 'బాస్' అన్నావు. ఎవరా బాస్?" ప్రశ్నించాడు.

"ప్రస్తుతం మీరే బాస్‌లా ప్రవర్తిస్తున్నారు. గ్రామంలో ఉన్నప్పుడు మీరు..."

"గ్రామంలో ఉన్నప్పుడుకూడా ఇలాగే ప్రవర్తించాలని ఉండేది. నీ పిచ్చి భర్తను పిచ్చాసుపత్రిలో చేర్పించాలనీ, నీ బాసును షూట్ చెయ్యాలనీ, నిన్ను చెయ్యి పట్టుకొని ఇలాగే లాక్కెళ్ళాలని అనిపించేది. ఆ తర్వాత...ఆ తర్వాత ఏమీలేదు. నీ భుజాలమీద చేతులు పెట్టుకొని ఎదురుగా కూర్చుని, నిన్నే చూస్తూ వుండాలనిపించేది. నీ మాటలు వింటూ యుగాలు గడపాలని వుండేది. కాని నువ్వు అప్పుడు చాలా అసహాయస్థితిలో వున్నావు. ఇప్పుడు నీవు అసహాయవు కావు. కాని ఆ 'బాస్' ఎవరో తెలుసుకోవచ్చా?" అడిగాడు ప్రమోద్ నిశ మాటల్ని మధ్యలోనే ఆపి.

అప్పటికి ఇద్దరూ సోఫా దగ్గరకొచ్చారు.

ప్రమోద్ భావగర్భితమైన మాటలు వింటుంటే నిశకు ఏదో అనుమానం కలిగింది ఆమె ప్రమోద్‌ను సూటిగా ముఖంలోకి చూసింది. అలా కొద్ది నిముషాలు చూస్తూనే వుండిపోయింది.

ప్రమోద్ మాటల్లో నిజాయితీ అతడి ముఖంలో కళ్ళల్లో కన్పించింది. నిశ మనసుకు తుమ్మముల్లు గుచ్చుకున్నట్టుగా బాధ కలిగింది.

ఈ సత్యం బ్రాందీ గుటకలా మండించేది. ఉమేశ్, రామ్, ప్రమోద్......ఆమెకు ఏడ్వాలని వుంది. మనసు బరువుగా వుంది. జీవితం తనను దగాచేసింది. తనూ ఒక మనసున్న మనిషినేనని ఆ భగవంతుడే మర్చిపోయాడు.

నిశ సోఫా మీద వెనక్కు వాలి, బుర్రను తొలుస్తున్న ఆలోచనలను విదిలించి వేస్తుందా అన్నట్టుగా తల అటూ ఇటూ కదిపింది.

మా బాస్ ఎవరనికదూ మీరు అడుగుతున్నారు? ఆయన కోటీశ్వరుడు. మీరు చూస్తున్నది క్రొత్త నిశను. పాత నిశ ఆనాడే - బాబుగారి ఇంటి నుంచి పారిపోయి పటేల్ రోడ్డులో ఒక కారు కింద పడిన రోజే చచ్చిపోయింది."

ఆత్మహత్యా ప్రయత్నం చేశావా?"

"మరి ఏం చెయ్యను ఆ పరిస్థితుల్లో? నాకు జీవితంలో చెయ్యి అందించి రక్షణ కల్పించే వాళ్లు ఎవరున్నారు? ప్రతివాడి నోటినుంచి "ప్రేమ" అనే శబ్దమే విన్నాను కాని ఒక్కడూ చెయ్యిచాచి నన్ను అందుకోలేదు. మీ ఈ పవిత్ర భారత దేశంలో స్త్రీ ప్రధాన మంత్రిగా వున్నది. అద్వితీయ ప్రతిభా పాటవాలు, ప్రపంచ జ్ఞానం గల ప్రధాన మంత్రి. ఆమె సామాన్యురాలు కాదు. గొప్ప మేధావి. అయినా ఒక సాధారణ ఒంటరి స్త్రీకి ఈ దేశంలో రక్షణ లేదు. స్త్రీకి రక్షణ ఇవ్వడంలో, సంప్రదాయాలూ, సామాజిక మర్యాదలూ, అంతస్థులూ ఎన్నో అడ్డం వస్తాయి. నాకు జరిగిందేమిటి?"

"ఈరోజు నీకు రక్షణ దొరికిందన్న మాటేగా?" ప్రమోద్ నిశ కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

నిశ కళ్ళు మూసుకొని సోఫాలో వాలి కూర్చుంది.

ఆమె మూసి వున్న కనురెప్పల్నీ, కొంచెంగా విచ్చుకున్న పెదవులనూ, తన చేతితో చిన్నగా తాకాలనే కోర్కె కలిగింది ప్రమోద్‌కు.

నిశ కళ్ళు తెరిచింది కాని అతడి ముఖంలోకి చూడలేదు. దూరంగా దేన్నో చూస్తూ అన్నది- "నేను పూర్తి రక్షణలో వున్నానో లేదో నాకే తెలియదు. పట్టు దారం పట్టుకొని పెద్ద అగాధాన్ని దాటుతున్నానని అప్పుడప్పుడు నాకు అన్పిస్తూ వుంటుంది. అగాధానికి ఆవలివైపున ఏముందో నాకు తెలియదు. ఆ పట్టు దారం ఎప్పుడు పుటుక్కున తెగుతుందో, ఎప్పుడు లోతు తెలియని అగాధం లోకి పడిపోతానో తెలియదు. ఒకవేళ దారం తెగకపోయినా, నా చేతిలో పట్టుతప్పి నేను అగాధంలో పడిపోవచ్చు. మీరు నన్ను అభినయిస్తున్నానన్నారు. అది అభినయం కాదు. సంయమనం. పడిపోతాననే భయంతో తెచ్చిపెట్టుకొన్న జాగ్రత్త. బాబుగారి ఇల్లు వదిలాక నాకు చదువుకొనే అవకాశం చిక్కింది. తిండికీ, ఒక మనిషికి కావాల్సిన ప్రాథమిక అవసరాలకు ఇబ్బందిలేదు. ప్రాథమిక అవసరాలేమిటి విలాసంగా జీవితం గడిపే అవకాశం కూడా లభించింది.

కాని...కాని..." ఆగింది నిశ.

"ఊఁ చెప్పు! ఆగిపోయావేం?"

"ఇప్పుడు నేను సుఖంగా వున్నాను. అది ఎలాంటి సుఖమో చెప్పనా?"

"చెప్పు."

"మండు వేసవికాలంలో పట్టు రోజాయి కప్పుకొన్నట్టూ - ఎముకలు కొరికే చలిలో ఐసుగడ్డలమీద పడుకున్నట్టూ - సహారా ఎడారిలో నీళ్లు లేకుండా రుచికరమైన భోజనం చేసినట్టూ - ఇంటి నిండా బొమ్మలుండీ ఆడుకోవడానికి పిల్లలు లేనట్టూ - విన్నారా నా జీవితం ఎంత సుఖంగా గడుస్తోందో? మృత్యువుకు కూడా నా మీద దయలేదు. బ్రతికి ఇన్ని సుఖాలను అనుభవించమని వెళ్ళిపోయింది."

నిశ మాటలు విన్న ప్రమోద్ మనసులోని చాంచల్యం ఎగిరి పోయింది.

అతడికి ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో అర్థం కాలేదు. నిశకు ఈ స్థితిలో సానుభూతి చూపించడం అర్థంలేని పనిగా తోచింది.

"నేను సంవత్సరంగా ఢిల్లీలోనే వున్నాను. నిన్ను వెదుకుతూనే వున్నాను. నీకు అభ్యంతరం లేకపోతే నిన్ను అప్పుడప్పుడు కలుసు కుంటాను. నువ్వంటే నాకు చాలా ఇష్టం" అని అనగలిగాడు ప్రమోద్.

# 7

ఆ రోజు రాజదేవ్ ఒక్క క్షణం కూడా ఆ పార్టీలో ఉండలేక పోయాడు. మనసంతా చేదుచేదుగా అయింది. తల చెమటతో తడిసి పోయింది. చెమట బిందువులు చెవుల పక్కగా, నుదురుమీదుగా ఒక్కొక్కటే పడుతున్నాయి.

ఎంతో మంది పలకరిస్తున్నారు. వాళ్లెవరినీ గుర్తించే స్థితిలో లేడు. కళ్లకు కన్పిస్తున్నదేదీ కన్పిస్తున్నట్టుగా అనుభూతి కలగడంలేదు.

ప్రమోద్ కొరకు చుట్టూ చూశాడు. నిశతో కూర్చుని వున్న ప్రమోద్ అతని కళ్ళకు కన్పించలేదు. వెంటనే బయటికి వెళ్ళిపోయాడు.

రాత్రి చాలాసేపు నిద్ర పట్టక మంచం మీద ఒక పక్కనుంచి మరో పక్కకు మాటిమాటికీ కదులుతూ పడుకొన్నాడు. లలిత అతడ్ని గమనించింది.

"ఒంట్లో బాగా లేదా?" అని అడిగింది."

రాజదేవ్ తన మానసిక అశాంతిని లలిత గుర్తించిందని తెలుసు కొన్నాడు.

సాధారణంగా రాజదేవ్ మౌనంగావుంటే లలిత కారణం అడగదు. పైగా తన మీద విరక్తి కలిగిందనో, కోపం వచ్చిందనో భావించి అంతకంటే ఎక్కువ గాంభీర్యంగా వుంటుంది. వారి ఇద్దరి మనసులూ దారపు ఉండలో దారంలా చిక్కులు పడిపోయాయి. చిక్కు విడదీసే ప్రయత్నం రెండు వైపుల నుంచీ లేదు.

"నేను జీవితంలో ఇంకా ఎన్ని దారుణాలు చూడాల్సి వున్నయ్యో?" అన్నాడు.

లలిత విస్మయంగా భర్త ముఖంలోకి చూసింది.

"ఇవ్వాళ నిశను పార్టీలో చూశాను. చాలా ఘోరమైన దుస్తుల్లో వుంది. చేతిలో విస్కీ గ్లాసు వుంది." అని రాజదేవ్ లలిత ముఖంలోకి చూశాడు.

లలిత అతడి ముఖంలోకి చూడలేనట్టు కళ్లు కిందకు వాల్చుకుంది. లలిత ఏమీ మాట్లాడలేదు. మాట్లాడాలన్నా ఏం మాట్లాడగలదు?

లలిత తను ఎలాంటి తప్పు చేసిందో తెలుసుకొని బాధపడుతున్నదని భావించాడు రాజదేవ్.

ఆమె బాధతో పశ్చాత్తాప పడుతున్నదన్న భావం అతడికి సంతృప్తిని కలిగించింది.

ఆ పార్టీలో మాటలు కలిశాక ప్రమోద్ నిశను తరచుగా కలుసుకుంటున్నాడు.

నిశ కారుకింద పడి ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నించింది. డ్రైవర్ సడన్ బ్రేకు వెయ్యడం వల్ల కారు చక్రాలు ఆమెమీద ఎక్కలేదు. కారులో ఎనభయ్ ఏళ్ళ వృద్ధుకు వున్నాడు. అతడు కోటీశ్వరుడు. అతడి పేరు కపాడియా.

కోటీశ్వరుడైన కపాడియా రకరకాల ఆడవాళ్ళకు ఆశ్రయం యిచ్చి, తన ధనంతో ఆకర్షించి తన అధీనంలో వుంచుకుంటాడు. వారిని తన భార్యలుగా భావిస్తాడు.

నిశ కారు కింద పడలేదు కాని ఉసిగా వచ్చి రోడ్డుమీద పడటం వల్ల తలకు బాగా దెబ్బ తగిలి స్పృహ కోల్పోయింది. తల నుంచి రక్తం కారుతోంది. చీర మోకాళ్ళపైకి పోయి వుంది. కపాడియా ఆసుపత్రిలో చేర్పించాడు.

వారం గడిచింది నిశ బాగా తేరుకుంది. కపాడియా ఒక ఇంటికి తీసుకెళ్ళి "ఇది నీ ఇల్లు" అన్నాడు.

"నా ఇల్లా?" ఆశ్చర్యపోయింది నిశ.

సేఠ్ ఆమె భుజం తడుతూ అన్నాడు-"నా వల్ల నీకు కష్టం కలిగింది. నీ పాత జీవితం చచ్చిపోయిందనుకో. కొత్త జీవితం ప్రారంభం కాబోతోంది. నువ్వు నాకు తొమ్మిదవ భార్యగా వుండబోతున్నావు. ఇప్పటికి నాకు ఎనిమిది మంది భార్యలు వున్నారు. అందరికీ తలొక ఇల్లూ ఇచ్చాను. అలాగే నీకు ఈ ఇల్లు ఇస్తున్నాను. అంతేకాక నెలకు ఆరు వేల జీతం. రోజుకు వంద రూపాయలు బత్తా ఇస్తాను. ఇది తీసుకో."

"ఏమిటది?"

"ఇల్లు నీ పేరుమీద వ్రాసిన డాక్యుమెంటు. ఇందులోనే అన్ని విషయాలూ వ్రాసివున్నాయి. తర్వాత చదువుకో" అన్నాడు కపాడియా.

"నేను మీ భార్యను కాను. కాలేను." అన్నది దృఢస్వరంతో నిశ.

"ఆ విషయం నాకూ తెలుసు జీవితం మీద విరక్తితో ఆత్మహత్యకు తయారయ్యావన్న సంగతి కూడా నాకు తెలుసు. ఈ నీ జీవితం, నీ శరీరం నీది కాదు కనుక నీకు ఆత్మహత్య చేసుకునే హక్కు లేదు."

"మీరు నన్ను వివాహం చేసుకొని రక్షణ కల్పిస్తారా?"

"అవును. నీకు రక్షణ దొరుకుతుంది. నీ భవిష్యత్తుకు బాట వేస్తుంది నా సంరక్షణ. నేను నిన్ను శాస్త్రోక్తంగా పది మంది ముందు పెళ్లి చేసుకుంటానని భావించకు. అది నేను చెయ్యలేను. కాని నిన్ను నా సెక్రటరీగా నియమిస్తాను" అని నిశను కౌగలించుకొన్నాడు.

నిశ సునాయాసంగానే అతని పట్టువిడిపించుకొన్నది. కపాడియా రొప్పుతూ సోఫామీద కూలబడ్డాడు. నిశను చూస్తూ అదోలా నవ్వాడు.

కపాడియా అవస్థ చూసి నిశకు జాలి వేసింది. వెళ్ళి అతడి ప్రక్కన కూర్చుంది.

"నాకు తెలుసు - నువ్వు నవయువతివి. నేనా కాటికి కాళ్లు చాచు కొని వున్న వృద్ధుడ్ని. అయినా సమాజం ముందు నా ఓటమిని అంగీక రించడం ఇష్టం లేదు. నువ్వు చక్కగా అలంకరించుకొని నాతో పార్టీలకు రావాలి చూసేవాళ్లంతా నా అదృష్టానికి ఈర్ష్యపడాలి. ఈ వయసులోకూడా సేఠ్ కపాడియా కౌగిలిలో అందమైన యువతులు నలిగిపోతున్నారని అందరూ అసూయపడాలి. నువ్వు సర్వస్వతంత్రురాలివి. నీ కోరికలకు నేను అడ్డం రాను.

కపాడియా మాటలకు ఆమెకు కోపం రాలేదు.

అతడి హిపోక్రసీమీద అసహ్యం వేసింది. అయినా తన భావా లను పైకి కన్పించకుండా అణచుకొన్నది

అప్పట్నుంచి నిశ పెద్ద పెద్ద ధనవంతుల, ఆఫీసర్ల పార్టీలకు కపాడియాతో వెళ్ళసాగింది ఈమెకు ఇప్పుడు అలాంటి పార్టీలకు వెళ్ళ డానికి ఎలాంటి సంకోచం కలగడంలేదు. ఇంట్లో ట్యూటర్ను పెట్టు కొని ఇంగ్లీషు, హిందీ నేర్చుకోసాగింది. పార్టీలకు వచ్చే ఆడవాళ్ళను చూసి వేషభూషలు నేర్చుకుంది. కృత్రిమంగా ఎలా నవ్వాలో నేర్చుకుంది.

వయ్యారాలు నేర్చుకుంది. మగవాళ్ళను ఎలా ఆకర్షించాలో నేర్చుకుంది. అభినయ కళలో ప్రావీణ్యతను సంపాదించుకుంది.

ఆమెతో మాట్లాడిన ప్రతివాడూ ఆమెను తన ప్రేమికగా భ్రమ పడ్డాడు. కాని ఆమె ఎప్పుడూ ఎవరికీ చిక్కలేదు. ప్రతివాడిని తప్పించుకొనే తెలివితేటలు కూడా పెంచుకొన్నది. చిక్కినట్టేచిక్కి చిన్నగా జారిపోవడం ఆమెకు వెన్నెతో పెట్టిన విద్యగా అలవడింది. అయితే రెండు మూడు సార్లు ఆమె కాలు జారిందనే చెప్పాలి.

కాలు జారిన ప్రతిసారీ ఒంటరిగా కూర్చుని గంటలకొలదీ ఏడ్చేది. క్రమంగా మనసును జోకొట్టి నిద్రపుచ్చింది. వాచాలత్వం పెరిగింది. డ్రింక్స్ కూడా ఎక్కువ చేసింది.

నిశ చుట్టూ పువ్వు చుట్టూ తిరిగే భ్రమరాలలా మగవాళ్ళు తిరగసాగారు.

నిశ నుంచి తను ఆశిస్తున్నదేమిటో ప్రమోద్‌కు తెలియడం లేదు. ప్రమోద్‌కు నిశ గురించి అంతా తెలుసు. తనకు కావాల్సింది ప్రమోద్ ఇవ్వలేడని నిశకు తెలుసు. ప్రమోద్ చెయ్యాలనుకొన్నది ధైర్యంగా చెయ్యగలడనీ, ఎవర్నీ లెక్క చెయ్యడనీ నిశకు తెలుసు. అయితే తన జీవితంలో రామ్‌కు వున్న స్థానాన్ని అతడికి ఇవ్వలేనని కూడా ఆమె తరచుగా అనుకుంటూ వుంటుంది.

"నువ్విలా తరచుగా రావడం మంచిదిగా నీకు అన్పిస్తుందా?" ప్రమోద్‌ను ఒకరోజు నిశ అడిగింది.

"ఏం? నేను చాలా చెడ్డవాడ్నా?"

"కాదు. చాలా మంచివాడివి. వంశానికి గౌరవం తేగలవాడివి. ఎంతో భవిష్యత్తు వున్నవాడివి. నాలాటి చెడు స్త్రీ సహవాసంలో నీ బంగారు భవిష్యత్తు ఏమైపోతుందోనని నా భయం."

"స్వాతంత్ర్య పోరాటంలో ఎందరో యువకులు తమ బంగారు భవిష్యత్తును కోల్పోయారు. జీవితాలే పోగొట్టుకొన్నారు. ఎవరెస్టు శిఖరం అధిరోహించే ప్రయత్నంలో ఎందరో యువకులు మంచు గడ్డలుగా మారిపోయారు. భవిష్యత్తు గురించి కలలు కనడం జీవితం కాదు. ఒక లక్ష్యం కోసం, ఒక ధ్యేయం కోసం ఎన్ని కష్టాలనైనా ఎదుర్కోవడమే జీవితం. నేను త్వరలోనే ఎం.ఏ. పరీక్ష రాస్తాను. నేను ప్రథమ శ్రేణి విద్యార్థిని. నాకు ఉద్యోగం తేలిగ్గా దొరుకుతుంది. అప్పుడు నిన్ను నేను పెళ్ళి చేసుకొంటాను." అని ప్రమోద్ ఆమెను తన బాహు బంధంలో బంధించాడు.

ఆమె పెనుగులాడలేదు. ఆ బంధంలో ఇమిడిపోయింది. అతడి ఛాతీమీద తల ఆనించి కళ్ళు మూసుకుంది. ఆమెకు భోరున ఏడ్వాలనిపించింది. కాని ఏడవలేదు. చిన్నగా అతని బాహుబంధాన్ని తొలగించుకుంది.

"అలా జరగడానికి వీల్లేదు ప్రమోద్. నేను నిన్ను పెళ్ళి చేసుకోలేను" అన్నది నిశ.

"నన్నెందుకు పెళ్ళి చేసుకోలేవో తెలుసుకోవచ్చా?"

"నాకు నీ భార్య అయ్యే యోగ్యత లేదు. పైగా నిన్ను నేను ప్రేమిస్తున్నానో లేదో నాకే తెలియదు."

"అంటే...నేనంటే నీకు ఇష్టంలేదా?"

"నువ్వంటే నాకు చాలా చాలా ఇష్టం. అందుకే నిన్ను మోహపాశంలో బంధించడం నాకు ఇష్టంలేదు. నేనొక అభిశప్త స్త్రీని. చరిత్రహీనను."

"అది నీ భ్రమ. శంకర్ భయంకరమైన జబ్బుతో చచ్చిపోయాడు. రామ్ పథభ్రష్టుడైన ప్రతిభావంతుడు నీ ప్రేమ అతడికి

కర్తవ్యాన్ని బోధించింది. నువ్వు అభిశప్తవుకాదు. చరిత్రహీనవు అంతకంటేకాదు. నిన్ను ఈ స్థితికి తెచ్చినవాళ్ళే చరిత్రహీనులు. గంగ మురికికాలవలో ప్రవహించినంతమాత్రాన తన పవిత్రతను కోల్పోదు."

"కాని ప్రమోద్! ఒక స్త్రీగా నా హృదయంలోని ప్రేమనంతా రామ్‌కు ఇచ్చేశాను. నా హృదయం నా దగ్గర లేదు. రామ్‌ను నేను మర్చిపోను. మర్చిపోలేను. అతడు నాకోసం వనవాసం వెళ్ళాడు. భారత సరిహద్దుల్లో ఎక్కడెక్కడ ఎలా తిరుగుతున్నాడో తెలియదు. నన్ను వివాహం చేసుకోవాలనే ఉద్దేశ్యంతో రామ్ చదువు వదిలేసి ఉద్యోగంలో చేరాడు."

ప్రమోద్ మౌనంగా వుండిపోయాడు. ఆమెకు ఏం సమాధానం ఇవ్వాలో తెలియలేదు. అయినా ప్రమోద్ ఆమె దగ్గరకు వస్తూనే వున్నాడు. పెళ్ళి చేసుకోమని అర్థిస్తూనేవున్నాడు. నిశ సమాధానాలు కూడా ఇస్తూనే వుంది.

ప్రమోద్ ఎం.ఏ. పాసయ్యాడు. ఆదే సమయంలో భారతదేశపు పశ్చిమ సరిహద్దులో యుద్ధమేఘాలు కమ్మాయి. పాకిస్తాన్ సేనలు అకస్మాత్తుగా ఆక్రమణచేశాయి.దేశప్రేమగల యువకులంతా సైన్యంలో చేరుతున్నారు. ప్రమోద్ కూడా సైన్యంలో చేరాడు. 1965 సెప్టెంబరు 6 వ తారీఖున పశ్చిమ సరిహద్దులోని అనేక ప్రదేశాలకు పాకిస్తాన్ సైన్యం చొచ్చుకొని వచ్చింది. కాని భారత సైన్యం చాలా ధైర్య సాహసాలతో వారి ఆక్రమణను ఎదుర్కోవడమేకాక, వారిని వెనక్కు తరమడంలో విజయం సాధించింది పదహారు రోజులు జరిగిన ఆ భయంకర యుద్ధంలో, హేమకరన్, బర్కి, డొగరాయి, దేరాబాబానానక్, ఖియాల్‌కోట్‌దగ్గిరి కుందనపూర్ సంఘర్షణలో భారతీయ సైన్యం అద్వితీయ యుద్ధ నైపుణ్యాన్ని చూపించింది. విజయం సాధించింది.

అయితే ఈ విజయ సాధనలో అనేక మంది భారతీయ యువకులు మరణించారు. అందులో ప్రమోద్ ఒకడు.

ప్రమోద్‌కు చనిపోయాక అశోకచక్రం లభించింది. కాని నిశ లభించలేదు.

ప్రమోద్ మరణవార్త విన్న నిశ బుర్రలో పర్వతాలు బద్ద లయ్యాయి హృదయంలో మహారణ్యాలు తగలబడ్డాయి.

ప్రమోద్ బంగారు భవిష్యత్తును కాపాడటం కొరకే నిశ అతడితో వివాహాన్ని తిరస్కరించింది. ప్రమోద్ త్యాగమయ జీవితం ఆమెకు ఒక కొత్త మార్గం చూపింది. నిశ పార్టీలకు వెళ్ళడం మానేసింది. కపాడియా ఆమె ఇంటికి వస్తే బాగా తాగించి, తినిపించేది. తాగిన మత్తులో వున్న అతడ్ని డ్రైవర్ చేత కార్లో పడేయించి ఇంటికి పంపించేది. తన వృద్ధాప్యం ఎదుటి మనిషి అనుభవంలోకి రాకుండా ఉత్సాహంగా తాగేవాడు కపాడియా. తాగుతూ తాగుతూ మత్తుగా నిద్ర లోకి జారిపోయేవాడు. ఒకరోజు నిశ ఇంట్లో కారులోకి ఎక్కించిన కపాడియా నిద్ర నుంచి మళ్లీ మేల్కొలేదు. కపాడియా మృత్యువు సంచలనాన్ని కలిగించింది. అతడి బంధువులు నిశ అతనికి విషం ఇచ్చిందని ఆరోపించారు.

కాని పోస్టు మార్టం రిపోర్టులో ఆ ఆరోపణ రుజువు కాలేదు. సమాజం దృష్టిలో ఆమె వితంతువు అయింది. నిశ విరక్తిగా నవ్వు కుంది. పోనియ్‌లే నవ్వుకోవడానికి అవకాశం దొరికింది అనుకొని మళ్ళీ నవ్వుకుంది ఇక పార్టీలకు వెళ్ళాల్సిన అవసరం కూడా లేదని తేలిగ్గా నిట్టూర్చింది...

రాజదేవ్ గతాన్ని గురించి ఆలోచిస్తూ ఈ జీవితంలో పొందే దానికంటే పోగొట్టుకొనేది ఎక్కువ అనుకొన్నాడు.

నిశకు జీవితం ఇచ్చిందేమిటి?

రామ్ ఈ ప్రాంతాలకు వచ్చి చాలా పోగొట్టుకొన్నాడు. నాగా అమ్మాయితో పరిచయం అయింది. ఆ అమ్మాయి పేరేమిటి? తనకు గుర్తు రావడం లేదు. కాని ఇంగ్లీషు శబ్దంలా గుర్తుంది. కాని శబ్దం ఏమిటో స్పష్టంగా తట్టడం లేదు.

టేమజన్ కుమార్తె నోర్‌సింగ్, రాజదేవ్ మంచం పక్కనే కూర్చుని అతడి ముఖంలోని భావ పరివర్తనను చూస్తూ వుంది.

రాజదేవ్ కొంతసేపు కళ్ళు మూసుకొని ఏదో ఆలోచిస్తాడు. మరికొంతసేపు ఇంటి కప్పుకేసి చూస్తూ ఆలోచిస్తాడు. ఒకసారి అతడి పెదవులమీద చిరునవ్వు తొణికిసలాడితే, మరోసారి కనుబొమలు రెండూ దగ్గరగా ముడుచుకుంటాయి. ఒకోసారి అతని శరీరంలోని నరాలన్నీ దేనికొరకో బిగిసిపోయినట్టుగా కన్పిస్తుంది. విషాదమేఘాలు తరచుగా అతడి ముఖాన్ని కమ్ముకుంటూ వుంటాయి.

"చాలా బాధగా వుందా?" నోర్‌సింగ్ అడుగుతుంది

రాజదేవ్ ఆమె కంఠం విని ఒక్కసారిగా కళ్లు తెరుస్తాడు. "అబ్బే లేదు మోకాళ్లో కొద్దిగా నొప్పి వుంది అంతే" చిరునవ్వుతో సమాధానం ఇస్తాడు.

"ఇల్లు జ్ఞాపకం వచ్చిందా?" నోర్‌సింగ్ అతని తల నిమురుతూ ఒక రోజు అడిగింది.

రాజదేవ్ నోర్‌సింగ్ ఎర్రటి పెదవులమీద అలవోకగా మెరిసిన చిరునవ్వు చూశాడు. ఎర్రటి పెదవుల వెనకగా కన్పించే తెల్లటి దంత పంక్తిని చూస్తుంటే, సూర్యాస్తమయ సమయంలో ఎర్రరంగు పులుము కొన్న పడమటి ఆకాశాన మెరుపు మెరిసినట్టు అన్పిస్తుంది.

తన తలను నిమురుతున్న నోర్‌సింగ్ చెయ్యి పట్టుకొని "ఏం? ఇది నా ఇల్లు కాదా? నువ్వెవరు, నేనెవరు? నీకు నేనేం ఇచ్చానని ఇంత సేవ చేస్తున్నావ్? నీలాంటి అమృతహృదయం పక్కన వుండి సేవలు చేస్తుంటే ఇల్లు గుర్తెలా వస్తుంది?" అన్నాడు.

"మిమ్మల్ని గమనిస్తూనే ఉన్నాను. ఎప్పుడూ ఏదో దీర్ఘాలోచనలోనే ఉంటారు."

"నేను ఆలోచించడంలేదు. గతం నా కళ్లముందు కదులుతూ ఉంటుంది. ఇంకెంతకాలం నేను ఇక్కడ ఉండాలి? డాక్టర్ ఏం చెప్పాడు?"

"చూశారా మరి? అందుకే మీరెప్పుడూ ఇంటి గురించి ఆలోచిస్తూ ఉంటారన్నాను."

"కానేకాదు. నేను జీవితమంతా ఏదో చేస్తూనే ఉన్నాను ఇలా చాలాకాలం ఏమీ చెయ్యకుండా మీచేత సేవలు చేయించుకొంటూ పడుకుంటే నాలో స్వార్థం ప్రవేశిస్తుందేమోనని భయపడుతున్నాను."

"ప్రేమ ఎప్పుడూ స్వార్థాన్ని ప్రేరేపించదు. అది కర్తవ్య బోధ చేస్తుంది జీవితానికి గమనాన్ని ఇస్తుంది."

"నువ్వు చెప్పేది నిజమే కావచ్చు. అదే నా భయం కూడ. ఎవరెవరికోసం నేను జీవితమంతా పరుగులు తీశానో వాళ్ళంతా నా మనసును గాయపర్చారు. మీ నిస్వార్థ సేవ చూస్తుంటే నా కర్తవ్యాన్ని మర్చిపోతానేమోనని భయంగా ఉంది. ఆదిసరే. గాయం పూర్తిగా మానిందనుకొంటాను." అన్నాడు మాట మారుస్తూ.

"దాదాపు మానిపోయినట్టే. కట్టు విప్పడానికి మరో నాలుగైదు రోజులు పట్టవచ్చును. క్రచెస్ సహాయంతో నడవడం అలవాటుపడటానికి మరో వారం పది రోజులు పట్టొచ్చు. నన్ను కూడా మీతో తీసుకెళ్తే

వీలయినంత త్వరగా పంపించే ఏర్పాటు చేస్తాను." నోర్‌సింగ్ కిలకిల నవ్వింది.

ఆమె కిలకిలలు కొండమీది ఇంట్లో నుంచి బయటికి వచ్చి కొండ మీదుగా జారి లోయలోకి పడిపోయినట్టుగా అన్పించింది రాజదేవ్‌కు.

ఆమె నవ్వులో శారీరక, మానసిక కాలుష్యాన్ని కడిగివేసే శక్తి వుంది. సత్యం, శివం, సుందరం ఆ నవ్వులో రాజదేవ్‌కు కన్పించాయి. ఆ నవ్వు వెనక వున్న భావం భాషకు అందనిది. వేద ఉపనిషత్తుల పరి భాష కూడా బంధించలేనిది, దానిని ఆపగలిగిన వాడికి బ్రహ్మ స్థానం ఇవ్వవచ్చు.

అకస్మాత్తుగా రాజదేవ్ ముఖంలో విషాద ఛాయలు అలము కొన్నాయి. మానవుడిలో మహా మానవుడు కాగలిగే శక్తి వుంది. కాని మానవుడు దానవుడుగా మారటా డెందుచేతనో? అలాంటివాడు అమృత భాండాన్ని విష భాండంగా మారుస్తాడు.

రాజదేవ్ నోర్‌సింగ్ గడ్డం పుణికి పుచ్చుకొని అన్నాడు–"నువ్వు చాలా అమాయకురాలివి. మనుష్యుడు పుట్టుకతో సహజ సుందరంగా పుడ్తాడు. క్రమంగా జీవితంలో పయనించడం నేర్చుకుంటాడు. అతడి ప్రయాణ వేగాన్ని సమాజం సహించదు. అది జడప్రాయమైనది. మానవుడి చుట్టూ అనేక వలయాలను సృష్టిస్తుంది. అతడి మార్గం అనేక శిలలను ఏర్పరుస్తుంది. ఆ శిలలవల్ల జీవితంలో పయనిస్తూ ఎన్నో ఎదురు దెబ్బలకు గురి అవుతాడు. నువ్వు నా క్రచెస్‌గా ఉండాలని ప్రయత్నిస్తే ఎదురు దెబ్బ తినాల్సి వస్తుంది."

"ఎదురు దెబ్బలా..." ఏదో అనబోయి తండ్రిని చూసి ఆగి పోయింది నోర్‌సింగ్.

నోరా్‌సింగ్‌కు తను ఢిల్లీ వెళ్ళాలనుకుంటున్నట్టు తండ్రికి తెలియడం ఇష్టం లేదు. తండ్రి చాలా బాధ పడ్తాడని ఆమెకు తెలుసు.

"చూడు నాన్నా, గాయం మానుతున్నా ఆయన మానసికంగా పూర్తిగా కోలుకోలేదు ఏదేదో అర్థం పర్థం లేకుండా గొణుగుతున్నారు" అన్నది.

నోర్‌సింగ్ మాటలకు రాజదేవ్ నవ్వాడు.

"మీ అమ్మాయి నాకు క్రచ్చెస్‌గా ఢిల్లీ వస్తానంటుంది చాలా అమాయకురాలు. క్రచ్చెస్ కర్రతో తయారౌతుంది."

"మంచిమాటే అన్నది. పది పదిహేను రోజుల్లో నాకు ఢిల్లీ వెళ్ళాల్సిన పని వుంది. నాగాలాండ్ గురించి చర్చలు జరగబోతున్నాయి. అదీ కాక ఢిల్లీలో నాకు వేరే పని కూడా ఉంది" అని తండ్రి కూతురి ముఖంలోకి వాత్సల్య పూరితంగా చూశాడు.

నోర్‌సింగ్ తల వంచుకొని కూర్చుంది. రాజదేవ్‌కు విషయం అర్థం కాలేదు. నోర్‌సింగ్ దేనికొరకో బాధపడుతున్నట్టు గ్రహించాడు. ఆమెకు వ్యధను కలిగించిన ఆ కథ ఏమిటో వినాలని ఉంది.

రాజదేవ్ నోర్‌సింగ్‌ను కళ్ళార్పకుండా కొద్ది క్షణాలు పరికించి చూశాడు. ఆమె భుజం మీద చెయ్యి వేశాడు.

చేమజన్ నవ్వుతూ అన్నాడు - "మా పిల్ల పిచ్చిదైపోయింది. మీరొచ్చిన దగ్గర్నుంచి ఇల్లు వదిలి బయటకు వెళ్ళలేదు. మీ సేవలో మునిగిపోయింది. మీకు పథ్యం పెట్టేందుకు స్వయంగా వంట చేస్తోంది. తల్లిని చెయ్యినివ్వడం లేదు."

రాజదేవ్ నోర్‌సింగ్‌ను చూస్తూ అన్నాడు - గత జన్మలో ఈమె నాకు తల్లి అయి ఉండాలి ఈమెను చూస్తుంటే నందినీ, నివేదితే

కాకుండా లలిత కూడా గుర్తొస్తున్నది. ఈ అమ్మాయి నవ్వు అచ్చం లలిత నవ్వులాగే ఉంటుంది."

టేమజన్ ముఖంలో విషాద రేఖలు స్పష్టంగా కన్పించాయి. అతడు చరచర బయటికి వెళ్ళిపోయాడు.

రాజదేవ్ అనకూడని మాట ఏదో అన్నట్టుగా భావించాడు. ఆమె సాన్నిధ్యంలో తనకు ఒక రకమైన సంతోషం కలుగుతూ ఉంటుంది.

ఇరవైనాలుగు, ఇరవైఐదు ఏళ్ళ యువతిని అంత దగ్గరగా స్పృశించి యుగాలయినట్టుగా ఉంది. ఆమె అందాన్ని చూస్తూ సృష్టి, స్థితి, లయ అంటే ఇదేనేమో అన్పించసాగింది. ప్రతి స్త్రీలోనూ ఈ మూడు గుణాల శక్తి నిబిడీకృతమై ఉంటుంది

అకస్మాత్తుగా రామ్ కరుణామయ గాథ గుర్తొచ్చింది.

రామ్ దాదాపు ఐదేళ్ళ తర్వాత యుద్ధభూమి నుంచి తిరిగి ఇంటికి వచ్చాడు. అనేక దుర్గమ ప్రదేశాల్లో తిరిగి తిరిగి ఇల్లు చేరాడు.

స్వేనసాంగ్ - భయంకరమైన అరణ్యం. ఒక నాగా ఇంట్లో దాదాపు ఆరు నెలలు ఉండాల్సివచ్చింది. రామ్ కొద్దిరోజులుండాలని వెళ్ళాడు. కాని విరోచనాలు, కడుపునొప్పి జబ్బు పట్టుకుంది. ఒక నాగా నాయకుడు రామ్‌ను తన ఇంటికి తీసుకెళ్ళాడు. అతని పేరు రాజదేవ్‌కు గుర్తులేదు. ఆ నాయకుడి కూతురు రామ్‌కు సేవలు చేసింది. అచ్చం తనకు నోర్సింగ్ చేస్తున్నట్టుగా-

ఆమె పేరు? గుర్తురావడంలేదు. పేరు...ఆవా...కాదు ఓవా... కాదు-ఆఁ గుర్తొచ్చింది. ఆ పిల్లపేరు ఓవెన్. రామ్‌కు సేవ చేస్తూ చేస్తూ ఆ పిల్ల రామ్‌కు తన మనసునే ఇచ్చేసింది. రామ్‌ను అమితంగా ప్రేమించ సాగింది.

రామ్‌కు విరోచనాలు తగ్గగానే మలేరియా పట్టుకుంది ఆరునెలల దాకా పూర్తి స్వస్థత చేకూరలేదు.

నాగాజాతి తెగల ఆచారాలూ, జీవిత విధానం, అలవాట్లూ, నమ్మకాలూ అధ్యయనం చెయ్యాల్సిన పని రామ్‌కు అప్పగించడం జరిగింది. ఆవో, లోథా, సేమా, రెంగమా మొదలైన తెగల జీవిత విధానం, ఆచారాలూ, నమ్మకాల గురించి బాగా తెలుసుకున్నాడు.

ఈసారి రామ్‌కు కొహిమా నుంచి ఒంటరిగా, కాలినడకన స్వేనసాంగ్ జిల్లా వెళ్ళి అక్కడి విషయాలు రహస్యంగా సేకరించమని అధికారుల నుంచి ఆదేశాలు అందాయి. రామ్ నాగాజాతి రహస్యాలను తెలుసుకోవడానికి వచ్చినట్టు ఎవరూ పసికట్టకూడదు. అక్కడి వనస్పతిని పరిశీలించడానికి వచ్చినట్టుగా అక్కడివారు భావించేలా నమ్మించాలి. చాలా గురుతరమైన బాధ్యతను అప్పగించారు.

రామ్ అరణ్యంలో నడిచి నడిచి నాగాల ఒక గ్రామం చేరే మార్గంలో జబ్బుపడ్డాడు. విరోచనాలు పట్టుకొన్నాయి. భరించలేని కడుపునొప్పి. మధ్య మధ్య ఆగుతూ ఎలాగైనా గ్రామంచేరే ప్రయత్నం చేశాడు. చాలా నీరసించిపోయిన రామ్ గ్రామం పొలిమేర దాటకుండానే స్పృహతప్పి పడిపోయాడు.

రామ్ కళ్ళు తెరిచేసరికి ఒక పద్దెనిమిదేళ్ళ యువతి రామ్ చేతులూ, కాళ్లూ మాలిష్ చేస్తున్నది. చల్లబడిన అరికాళ్లలోకీ, అరచేతులలోకి వేడిని తెప్పించే ప్రయత్నం చేస్తోంది. అతడు ఆమెను ఆ పని నుంచి వారించాలనుకొన్నాడు. కాని మాట్లాడే ఓపిక లేదు.

రామ్ కొంచెం తేరుకోగానే, నాగా యువతి అతని భుజాలకిందగా చేతులువేసి చిన్నగా నడిపిస్తూ-దాదాపు ఈడ్చుకుంటూ గ్రామంలోకి చేర్చింది. తన ఇంటికి తీసుకొచ్చింది. ఇల్లు చేరగానే అతడు మళ్లీ మూర్ఛపోయాడు.

ఆరోజు మంచంపట్టిన రామ్ మూడు నెలల తర్వాత లేచి కూర్చున్నాడు.

"నీలో ఇంత సేవాభావం ఎక్కడ్నుంచి వచ్చింది. మీ నాన్న పెద్ద వేటగాడు. పైగా కయ్యానికి కాలుదువ్వుతాడు" అన్నాడు రామ్ ఒక రోజు ఓవెన్‌తో.

ఓవెన్ హాయిగా నవ్వింది.

"మా నాన్న మంచి వేటగాడు. వీరుడు. లక్ష్యసాధనకోసం ప్రాణాలను సైతం లక్ష్యపెట్టని యోధుడు. మా నాన్న ఒక ఆదర్శవంతుడైన భర్త. ప్రేమించగల తండ్రి" అన్నది ఓవెన్.

"నువ్వు మీ నాన్నను విభిన్నరూపాలలో చూడగలిగిన వివేకవతివి. మరి నాలో ఏం చూసి నాకు ఇంత సేవ చేశావు?"

ఓవెన్ కొద్ది క్షణాలు రామ్ ముఖంమీద చూపులు నిలిపి పరిశీలనగా చూసింది.

"ఒక యువతి ఒక యువకుడిలో ఏం చూస్తుంది? నిన్ను చావు బ్రతుకుల మధ్య చూసిన నాకు మరో ఆలోచన రాలేదు నిన్ను బ్రతికించుకోవాలనే కోరిక తప్పించి. ఈరోజు నిన్నీవిధంగా చూస్తుంటే నా జీవితం ధన్యం అయిందనిపిస్తోంది."

ఓవెన్ చివర వాక్యం విని రామ్ మనసులో బాధపడ్డాడు. బాధగా కళ్లు మూసుకున్నాడు. నిశ రూపం మొండికత్తిలా హృదయాన్ని కోస్తున్నట్టుగా విలవిలలాడాడు.

"హే భగవాన్! మళ్లీ నాకు ఇదేం పరీక్ష పెట్టావ్? నాలో ఇలాంటి పరీక్షలకు నిలబడే శక్తిలేదు. నేను అసమర్థుడుగా ఇంతవరకూ

బతికాను. ఈరోజు కూడా అసమర్థుడినే. నన్ను రక్షించు భగవాన్" రామ్ మనసులో భగవంతుడ్ని వేడుకున్నాడు.

ఓవెన్ చూపులు రామ్ ముఖంమీదే నిలిచిపోయాయి. రామ్ ముఖంలో కన్పించిన విషాదం ఆమెను కలవర పెట్టింది. గాభరాగా లేచి రామ్ మంచం దగ్గరకు వచ్చింది. అతడి మీదకు వంగి భుజాలు పట్టుకొని కుదిపింది. ఆమె స్పర్శ అతడికి అనిర్వచనీయమైన అనుభూతిని కలిగించింది. కళ్ళు తెరిచాడు. ఓవెన్ అతడి మీదకు వంగి వుంది.

"ఏమైంది? ఒంట్లో బాగా లేదా? మాట్లాడవేం?" ఆత్రుతగా ప్రశ్నించింది.

రామ్ తన మనసును అదుపులో పెట్టుకున్నాడు. తన రెండు అరచేతుల మధ్య ఓవెన్ ముఖాన్ని పొదివి పట్టుకొన్నాడు. చిరునవ్వుతో తనకు ఏమీ కాలేదన్నట్టు తల ఊపాడు. లేచి కూర్చోవడానికి ప్రయత్నిస్తున్న రామ్ ఊహించలేని విధంగా ఓవెన్ బాహుబంధంలో ఒదిగిపోయాడు. ఆలా వారు ఎంతసేపు ఉండిపోయారో వారికే తెలియదు. ఓవెన్ అనిర్వచనీయమైన ఆనందానుభూతిలో తన అస్థిత్వాన్నే కోల్పోయింది. రామ్ గతంలోకి పడిపోయి అందులో నుంచి బయట పడడానికి తనలో శక్తినంతా కూడదీసుకుంటున్నాడు.

రామ్‌కు చాలావరకు స్వస్థత చేకూరింది. వీలైనంత త్వరగా అక్కడ్నుండి వెళ్ళిపోవడం మంచిదని భావించాడు. ఎక్కువ రోజులుండి, ఓవెన్‌ను ఇంకా ఎక్కువ దుఃఖానికి గురిచెయ్యడం అతడికి ఇష్టం లేదు. ఓవెన్ పవిత్ర ప్రేమ నుంచి విముక్తుడు కావాలని కోరుకుంటున్నాడు. ఓవెన్‌కు నిజం చెప్పకుండా దాచడం చాలా పెద్ద అపరాధంగా భావించసాగాడు అహరహం మానసిక సంఘర్షణతో సతమతమైపోతున్నాడు.

ఓవెన్ తన పవిత్ర ప్రేమతో, సేవతో, తనను ఋణగ్రస్థుణ్ణి చేసింది. కాని ఆ ఋణం తీర్చుకోవడం కల్పనలో కూడా సంభవంకాదు. తను వచ్చింది ఎందుకు? ఎవరి రహస్యాలను తెలుసుకోవడానికి దొంగలా ఏ ప్రదేశంలో ప్రవేశించాడో వాళ్లే తన ప్రాణాలు కాపాడారు. రామ్, మనసును ఎవరో గట్టిగా పిండేస్తున్నట్టు బాధపడ్డాడు.

తను ఏం తెలుసుకోవడానికి వచ్చాడు ? వాళ్లనుంచి తనకు లభించిందేమిటి? ప్రేమ, కరుణ, దయ, త్యాగం మాత్రమే తనకు వారిలో కన్పించాయి.

రామ్ ఓవెన్‌కు అన్నీ చెప్పేయ్యాలని అనేకసార్లు అనుకొన్నాడు. కాని చెప్పలేకపోయాడు. అది తెలిస్తే ఓవెన్ చాలా బాధ పడ్తుందేమో? ఆమె తండ్రి? అతడు కోపంతో తనను ఏం చేస్తాడో. తనకు ఏమైనా పర్వాలేదు. కాని ముందు ముందు ఈ ప్రాంతానికి వచ్చిన వారి మీద నాగాల నమ్మకం పూర్తిగా తుడిచేసి పాపం చేసిన వాడౌతాడు తను. అందుకే చెప్పకూడదని నిశ్చయించుకొన్నాడు.

రామ్‌కు రాజకీయాల మీదే అసహ్యం వేసింది. అసలు ఇవన్నీ ఎందుకు జరుగుతున్నాయి? ఎవరి సంతృప్తికొరకు జరుగుతున్నాయి. వీటివల్ల లాభపడేది ఎవరు? ఎవరు గెలుస్తారు? ఎవరు ఓడిపోతారు? ఈ జయాపజయాలలో ఎవరు బలి అవుతున్నారు?

భారతదేశం రెండు ముక్కలు అయింది.

అయినా ఒకరితో ఒకరు పోరుతూనే వున్నారు. ఈ యుద్ధాల వల్ల ఎవరు నష్టపోయారు?

రామ్ వాకింగుకు ఉదయం, సాయంత్రం ఊరి బయటకు అడవుల్లోకి వెళ్తున్నాడు. త్వరగా ఆరోగ్యం కుదుటపడాలంటే నడక మంచి

దన్నారు. రామ్ ఎక్కడికెళ్ళినా ఓవెన్ అతడితోనే వుంటుంది. వాకింగుకు కూడా అతడి వెంట నీడలా వెళ్తున్నది. ఆమె రకరకాల కబుర్లు చెప్తూ, తను కిలకిల నవ్వుతూ, రామ్‌ను నవ్విస్తూ సమయం తెలియకుండా గడిచిపోయేలా చేస్తున్నది.

ముఖ్యంగా తను రామ్‌ను ఏ స్థితిలో చూసిందీ, తను అతడ్ని ఎలా భుజాలమీదుగా చేతులు వేసి ఊరిదాకా నడిపించుకెళ్ళిందీ చెప్తూ వుంటుంది. చెప్పడమే కాదు, చేసి చూపించి కిలకిల నవ్వుతుంది. ఆమె నవ్వు కొండరాళ్ళను కొట్టుకొని తిరిగి వెనక్కు వస్తుంది. ఆ ప్రతిధ్వనిలో రామ్ మునిగిపోడు. కాని తృప్తి పడ్తాడు.

రామ్ నడిచి నడిచి కాసేపు ఏ చెట్టుకిందో కూర్చుంటే ఓవెన్ అతడి ఒడిలో తల పెట్టుకొని పడుకుంటుంది. రామ్‌కు ఎలా వారించాలో తెలియడం లేదు. ఆమెలో అనవసరమైన ఆశల్ని క్షణక్షణం పెంచుతున్నానేమోననే భయం పట్టుకుంది. తను చేస్తున్నది తప్పు. ఎలాగైనా నిజం చెప్పాలి.

రామ్ వస్తూ వస్తూ తల్లితో "అమ్మా గుర్తుంచుకో. నిశకు తప్ప నా మనసులో మరో స్త్రీకి చోటు లేదు" అని ఇల్లు వదిలాడు. ఆ మాటల్ని మరువలేకుండా వున్నాడు. ఇల్లు వదిలేప్పుడు అలా అనకపోతే ఓవెన్ ప్రేమను స్వీకరించివుండేవాడేమో !

రామ్ చాలా మంది యువతులతో తిరిగాడు. అది కేవలం తాత్కాలిక కామదాహం తీర్చుకోవడానికే.

ఇక్కడ ఓవెన్ ప్రేమ ఒక అమృత సాగరంలా అతడి శరీరాన్నీ, మనసునూ కూడా ముంచేసింది.

రామ్ ఏమైనా సరే ఓవెన్‌కు నిజం చెప్పాలని నిర్ణయించుకున్నాడు. తను నిజం చెప్పినా ఆమె నమ్మకపోతే ఎలా అనే ప్రశ్న ఎదురైంది. అంత నమ్మినా ఓవెన్‌కు షాక్ అవుతుంది. ఆ షాక్‌లో ఏం చేస్తుందో ?

ఓరోజు సాయంకాలం వాకింగుకు ఓవెన్‌తో కలిసి తను మొదటి సారిగా కలుసుకొన్న ప్రదేశానికి వెళ్ళాడు రామ్. ఇద్దరూ ఆ ప్రదేశంలో కూర్చున్నారు. రామ్‌ను విశ్రాంతి తీసుకోమని అతడి తలను తన ఒడిలో పెట్టుకున్నది రామ్ పడుకొని ఆమె ముఖంలోకి చూస్తున్నాడు.

ఎలా అంత అప్రియమైన సత్యాన్ని చెప్పాలో అర్థం కావడం లేదు. ఓవెన్ అతడికి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా ఉల్లాసంగా అనేక కబుర్లు చెప్తోంది ఆమె అంత ఉత్సాహంగా వున్నప్పుడు అంత కటువైన విషయం చెప్పడం న్యాయం కాదని తోచింది.

కాని చెప్పక తప్పదు. ఎలా మొదలు పెట్టాలి? ఎక్కడ్నుంచి మొదలు పెట్టాలి. ఆమె ఏదో చెప్తూనే వుంది. అతడికి ఆమె చెప్పేది అర్థం కావడం లేదు. కేవలం అతడి చెవులు శబ్దాలను వింటున్నాయి. కాని మనసు ఆ శబ్దాల అర్థాలను తెలుసుకొనే పరిస్థితిలో లేదు.

"హే భగవాన్! ఈ జీవితాన్ని తీసేసుకో. నాది అర్థం లేని జీవితం. ప్రపంచంలో ప్రతి వస్తువు యొక్క ఉనికికి ఓ సార్థకత వుంది. కాని నా జీవితానికి సార్థకత లేదు. నేను ఎవరికీ ఏమీ ఇవ్వలేని అసమర్థ ప్రాణిని." లోలోపల అనుకొన్నాడు.

"నేను ఏం చేశాను. పుట్టి అమ్మనూ నాన్ననూ బాధ పెట్టాను. పెరుగుతూ తల్లిదండ్రులకు అంతులేని వ్యధను కలుగజేశాను. వారి సంతోషం కొరకు ఒక్క మంచి పని చెయ్యలేదు. నిశ నా జీవితంలో

వెలుగులా ప్రవేశించింది. నా మార్గాన్నే మార్చి వేసింది ఆ వెలుగు. కాని... నేను నిశకు ఏం ఇవ్వగలిగాను? నిశ ప్రేమను భద్రంగా అందుకో గలిగానా? ఆమెకు రక్షణ కల్పించగలిగానా? చెడ్డపనులకు తల్లిదండ్రుల గురించి ఆలోచించని తాను, ఒక మంచిపని చెయ్యడానికి, నిశను వివాహం చేసుకోవడానికి తల్లి అనుమతిని ఎందుకు కోరాను కోరాను సరే. ఆమె కాదంటే నిశను వదిలేశాను. ఇప్పుడు ఓవెన్. ఈమెను స్వీకరించలేను. హే భగవాన్! ఏమిటి నాకీ పరీక్ష?" మనసులోనే మథన పడ్తున్నాడు.

అకస్మాత్తుగా రామ్ మనసులో ఏదో భళ్ళున పగిలినట్టు అయింది. కళ్ళవెంట నీరు కారిపోతున్నది.

అంతవరకూ తన ధోరణిలో కలకల కబుర్లు చెప్తూ పోతున్న ఓవెన్ చూపులు రామ్ ముఖం మీద నిలిచాయి.

ఒక్కసారిగా ఆమె పెదవుల్ని ఎవరో బలవంతంగా బంధించినట్టు అయింది. వెర్రిదానిలా కొంత సేపు చూస్తూ వుండిపోయింది.

"ఏమైంది? ఎందుకు ఏడుస్తున్నావ్? నిన్ను బాధపెట్టే మాట ఏదైనా అన్నానా? నావల్ల ఏదైనా బాధకలిగిందా? నా మీద ఒట్టు-నిజం చెప్పు. ఎందుకేడుస్తున్నావ్" ఓవెన్ అమితంగా బాధపడిపోతూ ప్రశ్నించింది.

రామ్ మాట్లాడ లేదు.

"చెప్పు రామ్. ఏమైంది. నువ్వు చెప్పకపోతే నేను ప్రాణం వదిలేస్తాను. కాని నువ్వు ఏడవడం నేను చూడలేను".

ఓవెన్ అలా అనగానే రామ్‌లోని దుఃఖం కట్టలు తెంచుకొన్నది. రామ్ వెక్కి వెక్కి ఏడవసాగాడు. ఓవెన్ అతడ్ని పసి బిడ్డలా లాలించి బుజ్జగించ సాగింది. అతడి కన్నీళ్ళు తుడుస్తోంది. అతడ్ని గట్టిగా

పట్టుకొని, అతడి తలను తన హృదయానికి గాఢంగా హత్తుకుంది. వరద తీసింది. హృదయం తేలిక పడింది.

రామ్ లేచి కూర్చున్నాడు.

"ఓవెన్ నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు గదూ? నేను కూడా నిన్ను ప్రేమిస్తున్నాను. అందుకే నిన్ను ఓవెన్ అని పిలుస్తున్నాను. ఒక్క రోజు కూడా నీ అసలు పేరుతో పిలవలేదు. నా మనసులో నీ కున్న స్థానం మరొకరికెవరికీ ఇంతవరకూ లభించలేదు కాని నీ పవిత్ర ప్రేమను పదిలం పర్చుకోలేని అభాగ్యుణ్ణి. నా ప్రియమైన ఓవెన్ - నీ విషయంలో భగవంతుడు నన్ను క్షమించడని నాకు తెలుసు."

"నువ్వేమంటున్నావో నాకు అర్థం కావడం లేదు. నేను చేస్తున్న దేదీ కావాలని చేస్తున్నదికాదు కావాలని ఎవరూ ఎవర్నీ ప్రేమించ లేరు".

"నేను ఇక్కడ్నుంచి వెళ్ళి పోతాననుకో - అప్పుడు నువ్వేం చేస్తావ్?"

ఓవెన్ తృళ్ళి పడి రామ్ కళ్ళల్లోకి చూసింది.

"నేను వెళ్ళక తప్పదు. వెళ్ళాలి ఓవెన్. కాని నీ అనుమతి లేనిదే నేను వెళ్ళను-వెళ్ళలేను." మళ్ళీ అన్నాడు.

"నువ్వేమంటున్నావో నాకు అర్థం కావడం లేదు". ఆమె కంఠం కంపించింది.

"నువ్వు నా దృష్టిలో ప్రేమదేవతవు నీ ప్రేమ అమలినమైంది. అది అలాగే వుండాలి. నీవు నా జీవితంలో ప్రతిధ్వనివి. నిన్ను పొందా లనే ఆరాటం నాకు జన్మంతా ఉంటుంది. కాని నిన్ను పొంది నీ ప్రేమను మలినం చెయ్యలేను."

రామ్ చెప్పదల్చుకొన్నదేదో ఆమెకు స్పష్టంగా తెలియడంలేదు. అయినా కొంతవరకు ఊహించుకోగలిగింది.

"నువ్వు చెప్పదల్చుకున్నదేదో సూటిగా చెప్పు. తిప్పి తిప్పి చెప్పక్కర్లేదు. నేను ఏమిటో నాకు తెలుసు. నువ్వేమీ చెప్పక్కర్లేదు" అతడి రెండు భుజాల్నీ పట్టుకొని ఊపుతూ ఆవేశంగా అన్నది.

"నేనొక శాపగ్రస్తుణ్ని ఓవెన్. నేను ఇక్కడ్నుంచి వెళ్ళక తప్పదు."

"అదే? ఎందుకు తప్పదని అడుగుతున్నాను. సూటిగా చెప్పు."

"నేను నిజం చెప్తున్నాను. నేను భారత ప్రభుత్వంలో ఉద్యోగిని. ఇంటలిజెన్స్ డిపార్టుమెంటులో ఉన్నాను. ఇక్కడకు నేను ప్రభుత్వం ఆజ్ఞను పాటించే వచ్చాను. మీ రహస్యాలు తెలుసుకోవడానికి వచ్చాను. దానిలోనే జబ్బుపడ్డాను. ఆ తర్వాత జరిగిన విషయాలు నీకు తెలిసినవే. ఈ ఇంట్లో అనుభవించిన సుఖం, ఆత్మీయతా నా స్వంత ఇంట్లో నాకు లభించలేదు. మీ తల్లిదండ్రులు నా తల్లిదండ్రులకంటే మిన్నగా నన్ను ఆదరించి ప్రేమించారు."

"అది సరేలే. నువ్వు ఏ శాఖలో పనిచేస్తే నాకేంలే. విను నేను చెప్పేది. నువ్వు ఇక్కడ్నుంచి వెళ్ళకతప్పదంటే వెళ్ళు. నేనూ నీతోనే వస్తాను. ముందు మా అమ్మా, నాన్నా అందుకు అంగీకరించరు. కాని నేను పట్టుపడితే కాదనే శక్తి మా అమ్మా నాన్నకు లేదు. వారు నా సుఖంకోసం ఏ త్యాగం అయినా చేస్తారు. నీతో వెళ్ళడానికి అనుమతి వాళ్ళు ఇచ్చితీరాలి."

ఈ రోజు ఏమైనాసరే అన్ని విషయాలు ఓవెన్‌కు చెప్పెయ్యాలని నిర్ణయించుకొనే రామ్ ఇంటినుంచి బయలుదేరాడు.

రామ్ ఆమె తల నిమురుతూ "ఓవెన్, నేను నీ వాడిని కాలేను. నన్ను క్షమించు." అతి కష్టం మీద అన్నాడు.

ఓవెన్ కళ్ళప్పగించి చైతన్యం లేని బొమ్మలా చూస్తూ వుండి పోయింది. ఆమె అలా ఎంతసేపు వుండిపోయిందో ఆమెకే తెలియదు.

చిన్నగా మనసును కూడదీసుకుంది. రామ్ ముఖంలోకి సూటిగా చూసింది.

"పర్వాలేదు రామ్. నేను నువ్వనుకొన్నంత నీచురాల్ని కాదు. నేనంటే ఇష్టంలేని వారి మెడలో డోలుగా వ్రేలాడడం నేను చెయ్యను. చెయ్యలేను. నువ్వు నన్ను ప్రేమించమని బలవంతం చెయ్యను. ప్రేమలో బలవంతం వుండదు."

"అంతమాట అనకు ఓవెన్. నువ్వంటే నాకు చాలాఇష్టం. నువ్వు లేని ఈ జీవితం ప్రాణం లేని శవప్రాయమైంది. నా అసహాయతకు కారణం నువ్వంటే ఇష్టం లేక కాదు. నేను ఒకరికి మాట ఇచ్చివున్నాను. వచన బద్ధుడ్ని."

ఆ తర్వాత రామ్ ఓవెన్‌కు నిశ గురించి అన్ని విషయాలూ వివరంగా చెప్పాడు. చిన్నతనం నుంచి తను ఎలాంటి జీవితాన్ని గడిపాడో కూడా చెప్పాడు.

కథ పూర్తిగా విన్నది ఓవెన్.

ఆమె పెదవుల మీద చిరునవ్వు తొణికిసలాడింది. ఆ చిరునవ్వులో ప్రపంచంలోని విషాదమంతా ఒక చోటికి చేరిందా అని అన్పించింది రామ్‌కు, ఆ హృదయం ఆక్రందిస్తున్నది. మనసులో ఏవేవో తగలబడుతున్నాయి. బుర్రలో పర్వతాలు బద్దలౌతున్నాయి. అయినా ఆమె క్రోధంతో అరవలేదు బాధతో ఏడవలేదు. నవ్వింది. విషాదంగా నవ్వింది.

"అలాగే రామ్-నువ్వు ఇంటికి వెళ్ళిపో-నువ్వు వెళ్ళే వరకు నిశ నీ కొరకు ఎదురు చూస్తూ వుంటుందో లేదో నాకు తెలియదు. కాని నేను

మాత్రం నీ కొరకు జీవితాంతం ఎదురు చూస్తూ ఇక్కడే వుంటాను. అందుకు మా అమ్మా నాన్నా, మా సమాజం అనుమతి ఇస్తుందనే అను కుంటున్నాను. నేను నీ దాన్ని. ఓవెన్ అనే పేరుతో మరొకరెవరూ నన్ను పిలవకూడదు. పిలవ నివ్వను".

ఈ విషయాలన్నీ రామ్ యుద్ధ భూమి నుంచి తిరిగి వచ్చాక తండ్రికి చెప్పాడు.

అకస్మాత్తుగా నోర్‌సింగు రాముడి ఓవెన్ కాదుకదా అనే సందేహం వచ్చింది. కాదు. కాదు. ఆమె ఈమె కాదు. ఆరేళ్ళు నాగ యువతి వివాహం లేకుండా ఒక పరదేశి కోసం ఎదురుచూస్తూ కూర్చుంటుందా?

రాజదేవ్ తన అనుమానాన్ని నోర్‌సింగుతో అనకపోవడం మంచిదే అయింది. క్రచ్చెస్ సహాయంతో బయటికి ఇంట్లోకి తిరుగు తున్నాడు. ఇంకా చాలా బలహీనంగా వున్న రాజదేవ్ నోర్‌సింగ్ పట్టుదలవల్లే మరికొంత కాలం వుండడానికి నిశ్చయించుకొన్నాడు. పదిహేను రోజుల క్రితమే వెళ్ళడానికి ప్రయాణం అయి విరమించు కొన్నాడు.

పర్వ దినాలలో నాగాలంతా ఒకచోట చేరి నృత్యం చేస్తారు. పాటలు పాడ్తారు. ఇప్ప సారా తాగుతారు. ఆ రోజు కేవలం రాజదేవ్‌కు స్వస్థత చేకూరిందనే సంతోషంతోనే ఈ ఉత్సవం ఏర్పాటు చేశారు.

రెండు మూడు వందల గజాల దూరంలో వున్న మెడోచి ఇంటి ముందు నృత్యం జరుగుతోంది. నోర్‌సింగ్ కూడా తన్మయత్వంతో నృత్యం చేస్తోంది. రెండు గంటలు గడిచాయి. రాజదేవ్ అలసిపోయాడు. నోర్‌సింగ్‌ను తన దగ్గరకు పిల్చాడు.

"నేను బాగా అలసిపోయాను. ఇంటికి వెళ్ళి పడుకుంటాను" అన్నాడు రాజదేవ్.

"అలాగే! పదండి. మిమ్మల్ని ఇంటి దగ్గర వదిలివస్తాను" అంటూ ఆమె కూడా అతడితో బయలుదేరింది. రాజదేవ్‌కు క్రచ్చెస్‌తో నడవడం బాగా అలవాటు అవలేదు. అందుకే నోర్‌సింగ్ ఇంటివరకు వచ్చింది. అతడ్ని ఇంట్లోకి పంపించి "రెండు గంటల్లో వస్తాను" అని చెప్పి నోర్‌సింగ్ ఉత్సవంలో పాల్గొనడానికి వెళ్ళింది.

రాజదేవ్ మంచంలో పడుకొని నోర్‌సింగ్‌ను గురించి ఆలోచించ సాగాడు.

నోర్‌సింగే ఓవెన్ అని తనకు అన్పిస్తోంది నాగాజాతివారు ఆడ పిల్లలకు అనేక పేర్లు పెడ్తారు.

రాజదేవ్ మంచం దిగాడు. అశాంతిగా క్రచ్చెస్ ఆధారంతో గదిలో పచార్లు చెయ్యసాగాడు. ఒక్కసారిగా చంక కిందవున్న క్రచ్చెస్ జారిపోయింది. పడిపోయివుండేవాడే పక్కనే గోడ లేకపోతే. గోడను ఆనుకొని చిన్నగా కిందకు జారి కూర్చున్నాడు.

గోడ పక్కగా బల్లమీద పెట్టివున్న వెదురుబద్దలతో తయారు చేసిన పెట్టె అతడి చెయ్యి తగిలి కింద పడింది. పెట్టెలోని వస్తువులన్నీ చిందరవందరగా పడిపోయాయి. కింద కూర్చుని రాజదేవ్ ఒక్కొక్క వస్తువే పెట్టెలోకి సర్దసాగాడు.

సామాను సర్దుతూ వుండగా ఒక ఫోటో కన్పించింది. ఆ ఫోటో చూసి రాజదేవ్ స్తంభించి పోయాడు. ఒళ్ళంతా చెమట్లు పట్టినట్టు అయింది.

"హే భగవాన్! ఎంత పని జరిగింది? నన్ను ఇక్కడ కెందుకు చేర్చావ్ భగవాన్. ఈమే ఓవెన్. రాముడి కోసం తపస్సు చేస్తున్న తపస్విని ఈమే." అతి కష్టం మీద సామానంతా సర్ది పెట్టెను యథా స్థానంలో ఉంచాడు.

రాజదేవ్‌లోని శక్తినంతా ఎవరో సిరంజితో లాగేసినట్టుగా అయింది. తడుముకుంటూ వెళ్ళి మంచానికి అడ్డం పడ్డాడు.

తండ్రీ కొడుకులతో ఆడుకుందనిపించింది రాజదేవ్‌కు.

నిశ ఇంటినుంచి పారిపోయిందనీ, రామ్ వెదికి వెదికి వేసారి పోయాడనీ నోర్‌సింగుకు చెప్పకూడదని నిశ్చయించుకొన్నాడు. అలా చెప్తే ఆమె తనతో ప్రయాణమై ఢిల్లీ వస్తానంటుందని అతడికి తెలుసు. ఆమె అలా నిర్ణయించుకుంటే ఆపే శక్తి తనకు లేదనీ తెలుసు. ఆమెను వెంటబెట్టుకొని ఒకవేళ తీసుకెళ్తే ఏం జరుగుతుందో కూడా తెలుసు. నిశకు పట్టిన దుర్గతే ఈ పిల్లకు పడ్తుంది.

రెండు గంటల తర్వాత నోర్‌సింగ్ రాజదేవ్ గదిలోకి వచ్చింది. రాజదేవ్ నిద్రపోతున్నట్టు నటించాడు. ఆమె వంగి రాజదేవ్‌ను చూసింది. నిద్రపోతున్నట్టు భావించి శబ్దం చెయ్యకుండా వెళ్ళిపోయింది.

రాజదేవ్ ప్రయాణానికి ఏర్పాట్లన్నీ జరిగాయి. టేమజన్ నాగా ఉద్యమ నాయకుడు. ఆయన రాజదేవ్ వెళ్ళడానికి జీపు ఏర్పాటుచేశాడు.

రాజదేవ్ జీపు ఎక్కాడు. డ్రైవర్ సీటులో ఫాదర్ ఆర్చర్ కూర్చున్నాడు. కొహిమా వరకు ఫాదర్ తీసుకెళ్ళి వదలడమే మంచిదని భావించాడు టేమజన్. అందువల్ల నాగా విప్లవ కారులవల్ల రాజదేవ్‌కు ప్రమాదం వుండదు ఫాదర్‌ను దాదాపు నాగాలు అందరూ ఎరుగుదురు.

రాజదేవ్ వెళ్ళిపోతున్నప్పుడు నోర్‌సింగ్ ఏడ్చింది. ఆమె దుఃఖం చూసిన తండ్రి కళ్ళల్లో కూడా నీరు తిరిగింది.

రాజదేవ్ హృదయంలో ఒక తుఫానే రేగినట్టు అయింది. తను తనకు ప్రాణదానం చేసిన వాళ్ళకు నిజం చెప్పలేని అసమర్థుడు. కారణం–అందు వల్ల ఆ పిల్లకే అన్యాయం జరుగుతుందని భయం. రాజదేవ్ ఎదురు తిరుగుతున్న మనసును జోకొట్టి నిద్ర పుచ్చడానికి ప్రయత్నించాడు.

కన్నీళ్ల కడసారి వీడ్కోలు తీసుకొని జీపు ఎక్కి కూర్చున్నాడు రాజదేవ్.

జీపు వెళ్తున్న వైపే చూస్తూ నిలబడిపోయింది నోర్‌సింగ్.

జీప్‌లో వెళ్తూ వెళ్తూ "నేను ఢిల్లీ వెళ్ళగానే రామ్‌ను ఇక్కడకు పంపిస్తాను. నోర్‌సింగ్‌కు అన్యాయం జరగకూడదు."పదే పదే మనసులో అనుకొన్నాడు రాజదేవ్.

# 8

రాజదేవ్ విదేశాలకు బయలుదేరిన రెండో రోజు ఉదయం అన్ని పత్రికలలో విమానం కూలిపోయిన వార్త వచ్చింది అది చదివి అందరూ బాధపడ్డారు.

కొందరు గగ్గోలుగా పేర్లు తెలుసుకోవడానికి విమానాశ్రయానికి పరుగులు తీశారు. విమానంలో ప్రయాణిస్తున్న వారంతా మరణించి ఉంటారనీ, ఏ ఒక్కరూ బతికి బయటపడే ఆస్కారం ఎంతమాత్రం లేదని పత్రికలు రాశాయి.

భారతదేశంలో ప్రఖ్యాతిచెందిన ఒక హిందీ దినపత్రిక సంపాదకుడు రాజదేవ్ కూడా అదే విమానంలో ప్రయాణిస్తున్నాడనే వార్త ప్రముఖంగా వచ్చింది.

లలిత లేచి కాలకృత్యాలు తీర్చుకుందో లేదో టెలిఫోన్ మోగింది. ఆ సమయంలో హీరామన్ వున్నాడు. రామ్ సంవత్సరంపైగా అయింది ఢిల్లీ వదిలివెళ్ళి.

"ఎవరూ?" హీరామన్ అడిగాడు.

"నేను లాల్‌ను. ఇవ్వాళ పేపరు చదివావా. పాన్-అమెరికన్-వే-విమానం కూలిపోయిందట అందులోనే బాబాయి కూడా వెళ్ళాడుగా? ఎవరూ బ్రతికివుండే ఆశ ఏమాత్రంలేదని కూడా రాశారు."

హీరామన్ నిలువెల్లా వణికిపోతున్నాడు. అతడి ముఖం తెల్ల కాగితంలా అయింది.

లలిత కొడుకు ముఖంలోకి చూసింది. ఏదో వినరాని వార్తే వచ్చిందని భావించింది.

"ఏమైందిరా బాబూ!"

హీరామన్ మాట్లాడే స్థితిలో లేడు.

లలిత అతడి చేతిలోనుంచి ఫోన్ అందుకొన్నది. "హల్లో ఎవరూ?" అన్నది.

"పిన్నీ, నేను లాల్‌ను. నువ్వు ధైర్యంగా వుండాలి. విధిని తప్పించుకోవడం ఎవరితరమూకాదు. మానవుడు నిమిత్తమాత్రుడు."

"ఏమిటి? సరిగ్గా చెప్పు. ఏం జరిగింది?" విసురుగా అడిగింది లలిత.

లాల్‌నారాయణ్ దుర్ఘటన గురించి చెప్పాడు.

మౌత్‌పీస్ లలిత చేతిలో నుంచి జారి నేలమీద పడింది.

కళ్ళు తిరిగి పడిపోతున్న తల్లిని హీరామన్ పట్టుకొన్నాడు. చిన్నగా మంచం మీదకు చేర్చాడు.

హీరామన్ తల్లి దగ్గర కూర్చుండిపోయాడు. చిన్నవాడు. మతి పోయినట్టయింది. ఏం చెయ్యాలో దిక్కు తోచడం లేదు. ఆఫీసు వాళ్ళంతా వచ్చారు, టెలిఫోన్లు వస్తున్నాయి. ఆఫీసుకు సంబంధించిన ఒక వ్యక్తి టెలిఫోన్ దగ్గర కూర్చున్నాడు.

ఆఫీసు వాళ్లూ, పత్రికల్లో పనిచేసేవాళ్లూ, ఎడిటర్లూ, రాజదేవ్ స్నేహితులూ ఒక్కొక్కరే గదిలోకి వచ్చి లలిత దగ్గర తమ దుఃఖాన్ని ప్రకటించి వెళ్ళిపోతున్నారు.

లాల్ నారాయణ్ వచ్చే పెద్దమనుష్యులను పరామర్శిస్తున్నాడు. పెద్ద పదవిలో వున్నవాళ్ళను అణకువగా ఆహ్వానిస్తున్నాడు. వాళ్ళంతా వెళ్తూ వెళ్తూ తమ సానుభూతిని లాల్ నారాయణ్‌కు తెలియజేసి వెళ్తున్నారు ఆ ఇంటి పెద్దరికం అంతా లాల్ నారాయణే వహిస్తున్నాడు.

లలిత మూర్తీభవించిన శోక దేవతలా కూర్చుని వుంది. కాని ఆమె అంతరాంతరాల్లో ఏదో చెప్తోంది- "రాజదేవ్ నిన్ను వదిలి వెళ్ళ లేదు. వెళ్ళడు" అని. సానుభూతి చెప్పడానికి వచ్చినవాళ్ళను ఆమె పట్టించుకోవడం లేదు. పెద్దగా ఏడవడం కూడా లేదు.

ఆమె కుటుంబంలోని వారు అనేక నాటకాలు ఆడటం చూసింది. అనుభవించింది. జనం రావడం, సానుభూతి వచనాలు పలకడం, రెండు నిమిషాలు ముఖం మీద తెచ్చిపెట్టుకొన్న విషాద రేఖలతో నిల్చుని, తిరిగి వెళ్ళిపోవడం - అంతా ఓ పెద్ద నాటకంగా కన్పించ సాగింది. ఒక్కొకరు ఒక్కో రకమైన పాత్ర.

సాయంత్రం అయేసరికి నందిని అత్తవారింటి నుంచి వచ్చింది. బయటి జనం తగ్గిపోయారు. నందిని, నివేదిత తల్లిని పట్టుకొని ఏడుస్తున్నారు.

లలిత మొదటిసారిగా మాట్లాడింది.

"ఎందుకు ఏడుస్తారు. మీ నాన్న చచ్చిపోలేదు. అలా జరగదు. నేను జీవితమంతా మంచి పనులే చేశాను. భగవంతుడు నన్ను ఇలా శిక్షించడు. నేను ఎప్పుడూ ఎవర్నీ బాధపెట్టలేదు. అందరూ పెట్టిన

బాధల్ని మౌనంగా భరించాను నా దుఃఖం మరొకరు పంచుకోవాలని కూడా ఏనాడూ ఆశించలేదు. నేనే ఇతరుల దుఃఖాన్ని పంచుకొన్నాను. నేను వితంతువును కాను. నా విశ్వాసం అదే. అదే. నేను వితంతువును కాదు."

తల్లి మాటలు విని పిల్లలు ముగ్గురూ తృప్తి పడ్డారు.

దుఃఖాతిరేకంలో తల్లికి మనస్థిమితం తప్పిందేమోనని భయ పడ్డారు పిల్లలు. పిల్లలు ఏడుపు మాని ఆమెకు సేవలు చెయ్యసాగారు. లాల్‌నారాయణ్ డాక్టర్‌కు ఫోన్‌చేసి పిలిపించాడు. డాక్టరు లలితకు మత్తు ఇంజక్షన్ ఇచ్చాడు.

ఒక వారం తర్వాత దుర్ఘటనకు గురిఅయిన విమానం, భారత బర్మా సరిహద్దుల సమీపంలో నాగాలాండ్ అడవుల్లో పడిపోయిందనే వార్త వచ్చింది. ప్రయాణీకులు, అందరూ మరణించారని స్పష్టంగా రాశారు. రాజదేవ్ గురించి వ్రాయడమే కాకుండా అతడి కాలిపోయిన శరీరం మీద అతడి కోటు పడివుందని వ్రాశారు.

లలిత శూన్యంలోకి చూస్తూ కూర్చోవడం మినహా ఎవరికేసి చూడదు. ఎవరి మాటలూ వినదు. శూన్యంలో దేన్నో వెదుకుతున్నట్టు ఉంటాయి ఆమె చూపులు.

రాజదేవ్ శరీరంగా భావించిన మాంసంముద్ద కోటుతోసహా ఢిల్లీ చేరింది. అప్పటికి రాజదేవ్ అన్న పుష్కర్ ఢిల్లీ చేరాడు. దహన సంస్కారాలు ముగిశాయి. అసలు సమస్య ఇప్పుడే ప్రారంభం అయింది. లలిత పాటించవలసిన విధులను ఆమెకు చెప్పే ధైర్యం ఎవరికీ లేదు. ఆ పని పుష్కర్‌కు అప్పగించారు బంధుమిత్రులు.

పుష్కర్ లలిత దగ్గరకు వచ్చి వేదాంతసారం విన్పించసాగాడు.

"ఈ శరీరం క్షణభంగురం. ఎప్పటికైనా ఇది నశించేదే. కాక పోతే కాస్త ముందూ వెనకా-అంతే. రాజదేవ్ పేరుప్రతిష్ఠల్ని సంపాదించుకొనిపోయాడు. పదిమందిచేత గుర్తించబడిపోయాడు. అందుకు నువ్వు గర్వించాలి. శరీరానికి ప్రాముఖ్యత యేముంది. ఇది ఒక వస్త్రం లాంటిది. జీర్ణవస్త్రాన్ని వదిలేస్తాం. అలాగే శరీరం ఆత్మను వదిలి వెళ్ళిపోతుంది. పైగా రాజదేవ్ తన వెనక ఎంతో కీర్తిని వదిలివెళ్ళాడు. నువ్వన్నట్టుగా రాజదేవ్ చచ్చిపోలేదు అమరుడయ్యాడు" అన్నాడు పుష్కర్.

లలిత మీద తన ఉపదేశాల ప్రభావం కించిత్ కూడా పడలేదని పుష్కర్‌కు అర్థం అయింది లాభంలేదని అసలు విషయాన్ని సూటిగా చెప్పాడు-

"భయంకరస్థితిలో వాడు పోయాడు. పోయిన పది రోజులకు కాని దహనసంస్కారం జరగలేదు. మనం హిందువులం. ఉన్నత కులానికి చెందినవాళ్ళం. నువ్విలా మొండికి వెయ్యడం బాగాలేదు. నువ్వు ఇప్పుడు వితంతువవు. బొట్టు తీసెయ్యాలి, గాజులు తీసెయ్యాలి. ఇంకా కొన్ని కర్మకాండలు నిర్వహించాలి. మొండితనం వదిలెయ్."

లలిత ముఖం జేవురించింది. కళ్ళల్లో క్రోధం స్పష్టంగా కన్పిస్తోంది. నిటారుగా తల ఎత్తి బావను చూసింది.

"ఇవ్వాల్టి వరకు నేను కుటుంబ పెద్దల దగ్గరే కాదు పిన్నల దగ్గర కూడా నోరు తెరిచి మాట్లాడలేదు. ఎన్నో మాటలు అన్నా, ఎన్ని రకాల అవమానించినా మిమ్మల్ని పల్లెత్తు మాట అనలేదు. ఇవ్వాళే నోరు తెరిచాను. దయచేసి ఇక ఈ నాటకంలో మీ పాత్ర చాలించండి

నేను విధవను కాను. సధవను నా భర్త చచ్చిపోలేదు ఎవరిదో తలా, కాళ్లూ లేని శరీరాన్ని, బాగా కాలిపోయిన మాంసం ముద్దను దహనం చేశారు. ఆ మాంసం ముద్ద నా భర్తది అంటున్నారు. మీరంతా నన్ను పిచ్చిదాన్ని చేస్తున్నారు. మీకు పిచ్చెక్కింది కనీసం ఆలోచించరేం? శరీరం అంతా కాలిపోయింది. తలా, కాళ్లూ నామ రూపాలు లేకుండా పోయాయి అలాంటప్పుడు ఆ కోటు ఎలా కాలకుండా వుంది. ఆ కోటులో కాగితాలు సహితం కాలకుండా ఎలా వున్నాయి? మీ అందరికీ ఓ నమస్కారం. నన్ను వదిలెయ్యండి. నా జోలికి రాకండి" నిప్పులు కక్కింది లలిత.

పుష్కర్ కూడా మొండిగానే వున్నాడు. హీరామన్ చేత శ్రాద్ధ కర్మలు చేయించాడు. లలిత విషయంలోనే కారాలు మిరియాలు నూరు తున్నాడు.

నిశ ఎక్కడ్నుంచి వచ్చిందో, వచ్చినప్పట్నుంచీ లలితను నీడలా కనిపెట్టుకొని వుంది.

నిశను చూసి పుష్కర్‌కు వళ్ళు మండిపోయింది. ఎలాగైనా ఆమెను ఆ ఇంటి నుంచి వెళ్ళగొట్టాలని నిర్ణయించుకొన్నాడు. నిశను అనేక రకాలుగా అవమానించడానికి పుష్కర్ వెనకాడటంలేదు. అయినా నిశ అతడి మాటల్ని నిర్లక్ష్యంగా కొట్టేస్తున్నది. దానితో అతడిలో కసి పెరగసాగింది.

రామ్ ఎందుకు రాలేదు? యుద్ధభూమి నుంచి సెలవు దొరకలేదా? ఎలాంటి కుటుంబం ఎలా అయిపోయింది? నిశ మనసులోనే బాధ పడ సాగింది

ఒకరోజు పుష్కర్ లలిత దగ్గరకు వచ్చి అన్నాడు-

"ఇలా ఎన్నాళ్ళు జరుగుతుంది? రామ్ అతాపతాలేదు హీరామన్ పసివాడు. నివేదిత పెళ్ళికి ఎదిగి కూర్చుంది ఇంట్లో" అని లలిత ముఖంలోకి పరిశీలనగా చూశాడు.

నిశ లలిత పక్కన మౌనంగా కూర్చుని వుంది.

"నువ్వు బయటికి వెళ్ళు. నేను ఆమెతో కొన్ని కుటుంబ విషయాలు మాట్లాడాలి" అన్నాడు నిశతో పుష్కర్.

"నిశ పరాయిది కాదు. ఈ కుటుంబానికి చెందిన పిల్లే" అన్నది లలిత.

లలిత మాటలకు నిశ విస్మయం చెందింది. మనసు ఆనందంతో ఉప్పొంగింది. కళ్ళల్లో కన్నీరు ఉబికింది. పెదవుల మీద లీలగా హాస్య రేఖ కదిలింది.

లలిత అలా అనడం పుష్కర్‌కు చాలా కోపం తెప్పించింది.

"నీ ఇష్టం. కాని నువ్వు ఈ ఇల్లు ఖాళీ చెయ్యాల్సివుంటుంది. ప్రెస్‌కు వెళ్ళాను. రాజశేఖర్ ప్రావిడెంట్ ఫండ్‌లో లక్షన్నర జమ అయి వుందట. వాళ్ళను అవసరమైన ఫారాలను పూర్తిచేసి ఇవ్వమన్నాను. నువ్వు సంతకం చేశాక ఆ డబ్బు వస్తుంది."

"ఈ పనులన్నీ చెయ్యమని మీకెవరు చెప్పారు?" లలిత కంఠం తీవ్రంగా వుంది.

పుష్కర్ పకపక నవ్వాడు. లలిత పుష్కర్ ముఖంలోకి చూసింది. అతడి నవ్వులో ఏదో గూఢార్థం వున్నట్లుగా తోచింది.

"కుటుంబ పెద్దను. కొన్ని పనులు పూర్తి చెయ్యాల్సినవాడిని. నాకు ఒకరు చెప్పేదేమిటి! నాకు తప్పుతుందా? రామ్ ఇక్కడ వుంటే నీకు ఈ కష్టం తప్పేది పాపం!"

"పెదనాన్నా! నేను వచ్చాను. అమ్మకు ఇక ఏ కష్టం వుండదు." రామ్ గదిలో ప్రవేశిస్తూ అన్నాడు.

ఒక్కసారిగా వెళ్ళి తల్లిని చుట్టుకుపోయాడు. లలిత ఒక్కసారిగా భోరుమన్నది. ఇన్ని రోజులుగా అణచుకొన్న బాధ ఒక్కసారిగా కరగి కన్నీరై ప్రవహించింది. అంతవరకూ లలితకు తను అడవి జంతువుల మధ్య ఇరుక్కుపోయినట్టు వుంది. ఒక్కసారిగా ఆ వాతావరణం నుంచి గాలీ వెలుతురూవున్న ప్రదేశంలోకి వచ్చి నిలబడ్డట్టుగా అనిపించింది రామ్ రాకతో. అన్ని మృగాలూ పారిపోయాయి

పుష్కర్ అక్కడ్నుంచి చిన్నగా జారుకున్నాడు.

ఎంతో కాలం తర్వాత కన్పించిన రామ్‌ను కుశలప్రశ్న కూడా అడగలేదు. తన ప్లానంతా తల్లకిందులైనందుకు నీరు కారిపోయాడు.

లాల్‌నారాయణ్ మాత్రం పినతండ్రి మృత్యువును ఆధారం చేసుకొని మంత్రులనూ, కార్యదర్శులనూ కలిసి కొన్ని పనులు చేయించుకొన్నాడు. రాజదేవ్ ప్రఖ్యాత పత్రికా సంపాదకుడు. అకాల మృత్యువు వాతపడ్డాడు. ఆ సాకును ఉపయోగించుకొని, రాజదేవ్ కుటుంబం కోసం అని చెప్పి ఇంపోర్టు లైసెన్సు కూడా సంపాదించుకున్నాడు.

భాగ్యవాదం, జన్మజన్మాంతర కర్మవాదం మనిషిలో భగవంతు డంటేనూ, ధర్మం అంటేనూ భయం కలిగిస్తాయి. ఆ భయంవల్ల మాన వుడు వివేకంతో అడుగు ముందుకు వేస్తాడు. వివేకంలేని జ్ఞానం నిరర్థక మైనది.

వివేకం త్యాగం నుంచీ, బాధ్యత నుంచీ ఉదయిస్తుంది. ఆ రెంటి మీదా నమ్మకం ఉన్నవాడే వివేకవంతుడు.

వివేకం, జ్ఞానంలేని వ్యక్తి ప్రతిదాన్నీ కర్మ ఫలితంగా భావి స్తాడు. కర్మ ఎలావుంటే అలా జరుగుతుందంటూ క్రియాశీలతను కోల్పోతాడు.

రామ్ ఆగమనంతో పుష్కర్ వేసిన ప్లానంతా తలక్రిందులై పోయింది. హీరామన్‌ను హాస్టల్లో వుంచి, నివేదితతో లలితను గ్రామం తీసుకెళ్ళాలని నిర్ణయించుకొన్నాడు. నాలుగైదు రోజులు మౌనంగా ఉండి పోయాడు.

ఒకరోజు రామ్ బయటికి వెళ్ళాడు.

వారం పది రోజుల్లో రామ్ డ్యూటీకి వెళ్ళాల్సివుంటుందని పుష్కర్‌కు తెలుసు

పుష్కర్ లలిత దగ్గరకెళ్ళి అన్నాడు - "రామ్ ఇంకా చాలా చిన్నవాడు. ఇప్పట్నుంచే వ్యవసాయపు లావాదేవీలలో చిక్కుకోవడం మంచిదికాదు. వాడి మనసుకు బాధ కలిగితే ఉద్యోగం సరిగా చేసుకో లేకపోవచ్చును."

లలిత మౌనంగా వింటున్నది. పుష్కర్ ఏం చెప్పాలనుకుంటు న్నాడో ఆమె ఊహకు అందలేదు

"మా నాన్నగారు రాజదేవ్ భూమిని వడ్డీ వ్యాపారి దగ్గర తనఖా పెట్టారు. వడ్డీ పెరిగిపోతున్నది. డబ్బు చెల్లించి వీలైనంత త్వరగా ఆ భూమిని తనఖా నుంచి వదిలించుకోవడం మంచిది."

పుష్కర్ మాటలు విన్న లలితకు ఎత్తునుంచి ఒక్కసారిగా భూమి మీద ఎవరో పడేసినట్టుగా అయింది. దిమ్మెరపోయి చూసింది. ఆమెకు వ్యవసాయం ఉమ్మడిగానే చేస్తున్నారని, తమకు రావాల్సిన పంటను కూడా పుష్కర్ తినేస్తున్నాడన్న విషయం కూడా తెలుసు.

అన్నను లెక్కలు అడగడానికి రాజదేవ్‌కు అతడి సంస్కారం అడ్డు వచ్చింది ఏనాడూ తన వాటా గురించి అన్నను ప్రశ్నించలేదు. నందిని వివాహానికి మాత్రం పుష్కర్ ఎనిమిది వేలు రాజదేవ్‌కు ఇచ్చాడు.

"నువ్వంతగా ఆలోచించాల్సిందేమీలేదు సేఠ్ అసలు ఇస్తే చాలు వడ్డీ అక్కర్లేదంటున్నాడు. అసలు ఇరవై ఐదు వేలు ఇస్తే చాలు. నందిని పెళ్లికి ఎనిమిది వేలు వడ్డీకి తీసుకొన్నాను. దానికి మాత్రం వడ్డీ ఇవ్వక తప్పదు మొత్తం నలభై ఐదు వేలు సరిపోతుంది. ఋణం నుంచి విముక్తి దొరికాక సుఖంగా బ్రతకవచ్చు" అన్నాడు పుష్కర్.

లలిత సమాధానం ఇవ్వలేదు. కళ్ళెత్తి తీక్షణంగా చూసింది ఆమె చూపులు "నువ్వు నా భర్తతో ఒకే రక్తం పంచుకొని పుట్టిన వాడివేనా?" అని నిలదీసి ప్రశ్నిస్తున్నట్టుగా ఉన్నాయి.

ఆమె చూపుల అర్థం స్పష్టంగా తెలియకపోయినా పుష్కర్ మనసులో ఏదో భయం ప్రవేశించింది.

"బాధపడకు. నీ పొలం నేను చూసుకుంటాను వ్యవసాయం బాధ్యత నేను తీసుకుంటాను. వ్యవసాయం కూడా ఇండస్ట్రీలా తయారైంది. కొంత డబ్బు ఖర్చు పెట్టాల్సి వుంటుంది. అది మాత్రం నువ్వు చేస్తే చాలు. రెండు మూడేళ్ళు కొంచెం ఎక్కువ ఖర్చు పొలం మీద చెయ్యాల్సి వుంటుంది" అన్నాడు.

పుష్కర్ గిర్రున వెనక్కు తిరిగి బయటికి వెళ్ళిపోయాడు.

"పెదనాన్నా, మీరొక విషయం చెప్పడం మర్చిపోయారు" వెనకనుంచి నిశ అన్నది.

ఆగి గిర్రున వెనక్కు తిరిగి నిశను విస్మయంగా చూశాడు పుష్కర్.

"వ్యవసాయం చేయించడానికి ఎంత ఖర్చు అవుతుందో మీరు చెప్పలేదు. ఇరవై ముప్ఫయ్ వేలయినా అవుతుందనుకొంటాను. మొత్తం బాబుగారు ప్రావిడెంట్ ఫండు రూపంలో జమచేసిన డబ్బుకంటే ఎక్కువ వుండదనుకొంటాను." అన్నది నిశ.

పుష్కర్ నిశను చూపులతో కొలుస్తున్నట్టుగా ఆపాద మస్తకం గుర్రుగా చూశాడు.

ఎంత ధైర్యం? ఈ నిశ పూర్వపు నిశ కాదు.

"ఇది మా కుటుంబానికి సంబంధించిన విషయం. ఈ విషయాల్లో బయటివాళ్లు కలుగజేసుకోవడం మంచి విషయం కాదని తెలుసుకో." కోపంగా అన్నాడు.

"నేను ఇంతకు ముందే చెప్పాను. మళ్ళీ చెప్తున్నాను. నిశ పరాయి పిల్లకాదు. ఈ కుటుంబంలోని పిల్లే!

"ఈ కుటుంబంలోని పిల్లా? నీకేమైనా మతిపోయిందా?"

"ఇంకా పోలేదు. నిశ నాకోడలు." తక్కున అనేసింది లలిత.

ఆమాట వినగానే పుష్కర్ విసురుగా బయటికి వెళ్ళిపోయాడు.

నిశ విస్మయంగా లలితను చూస్తూ వుండిపోయింది.

తను ఏమి విన్నది ? తన చెవులు తనను మోసం చెయ్యడం లేదు కదా?

నిశ కళ్లలో నీరు గిర్రున తిరిగింది.

లలిత చిరునవ్వుతో నిశను చూసింది తన పైటకొంగుతో నిశ కన్నీరు తుడిచింది.

"నిశా! జీవితంలో నేను తెలిసి చేసిన పాపం ఒకే ఒక్కటి. దానికి ఇప్పుడు ప్రాయశ్చిత్తం చేసుకొంటున్నాను."

నిశకు ఆనందం. దుఃఖం ఒకేసారి పెల్లుబికాయి చిత్రమైన అనుభూతి. భరించలేని అనుభూతి. రెండు చేతులతో ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది

లలిత నిశను దగ్గరకు తీసుకొని గుండెకు హత్తుకున్నది.

కష్టం వంటరిగా రాదు అనే సామెత వుంది

కష్టాలు రావడం ప్రారంభిస్తే ఒకదాని వెంట ఒకటి వస్తూనే ఉంటాయి. రామ్ రెండు వారాలలో డ్యూటీకి వెళ్ళాలి.

బంగ్లాదేశ్ యుద్ధం సందర్భంగా లీవు క్యాన్సిల్ చేసుకొని వెంటనే వచ్చి డ్యూటీలో చేరాల్సిందిగా ఆజ్ఞ జారీ అయింది. అప్పుడే లలిత అన్న ముఖేశ్ వచ్చాడు.

"చెల్లెమ్మా ! నేను వచ్చాగా ? నీకొచ్చిన భయం ఏమీ లేదు-రామ్‌ను వెళ్ళనివ్వు. దేశ రక్షణ బాధ్యత నేటి యువకుల భుజాలమీద వున్నది" అన్నాడు.

రామ్ వెళ్ళిపోయాడు.

ప్రెస్‌వాళ్ళు ఇల్లు ఖాళీ చెయ్యవలసిందిగా కోరారు. పుష్కర్, అతడి సుపుత్రుడు లాల్‌నారాయణ్ కుట్ర పన్ని లలిత ఢిల్లీ వదిలి వెయ్యాల్సిన పరిస్థితుల్ని సృష్టించారు.

హీరామన్‌ను హాస్టల్లో వుంచారు. లలిత హీరామన్ చదువు పూర్తి అయ్యేవరకు ఢిల్లీలోనే అద్దె ఇంట్లో ఉండాలని భావించింది. రామ్ త్వరలో వస్తాడని ఆమె ఆశ. అంతేకాదు, ఒకరోజు రాజదేవ్ తప్పక వస్తాడని ఆమె గాఢ నమ్మకం-అందుకే ఢిల్లీ వదిలివెళ్ళడం ఇష్టంలేదు.

కాని లలిత గోడు పట్టించుకొనే నాథుడు లేడు. ఆమె అన్న ముఖేశ్ కూడా పుష్కర్‌నే సమర్థించాడు.

"ఏదో ఒక రోజు నువ్వు రాజదేవ్ పుట్టిన ఊరికి వెళ్ళి ఉండాల్సిన దానివే. అందులోనే నీ పరమార్థం ఇమిడివుంది వాస్తవం నుంచి ఎంత కాలం పారిపోయి బ్రతుకుతావు? పుష్కర్ ఎవరు? నీ భర్త అన్నగారు. వాళ్లు నీ శత్రువులు కారు. గ్రామానికి వెళ్ళి వ్యవసాయం చూసుకో." అని సలహా ఇచ్చాడు ముఖేశ్.

ముఖేశ్‌ను చూడగానే లలితకు కొండంత ఆశ కలిగింది. తన కష్టసుఖాలను అర్థం చేసుకోగల తన అన్న వచ్చాడని సంబరపడింది. కాని తీరా ముఖేశ్ ఇచ్చిన సలహా విని ఆమెకు సుడిగుండంలో చిక్కుకు పోయినట్టుగా అయింది

లలిత ఏదో ఆశతో నిశ వంక చూసింది.

"నాకు పెద్ద ఇల్లే వుంది. కాని అందులో వుండటం నాకే ఇష్టం లేదు. అలాంటి చోటుకు మిమ్మల్నెలా తీసుకెళ్లగలను? భగవంతుడు ఎందుకు మనల్నిలా పరీక్షిస్తున్నాడో అర్థం కావడం లేదు. ఎక్కడ్నుంచి వచ్చామో అక్కడికే నెట్టేస్తున్నాడు. పదండి. నేనూ మీతోనే వస్తాను. అక్కడ మీ పరిస్థితులు అధ్వాన్నంగావుంటే తిరిగి వచ్చేద్దాం. అప్పుడు నా ఇల్లు ఉండనే వుంది. అప్పుడు మీరు నాతో వచ్చివున్నా ఎవరూ నిందించడానికి వీలుండదు" అన్నది నిశ.

లలిత నిశతో గ్రామం చేరింది. గ్రామంలో జనం రకరకాలుగా చెప్పుకోసాగారు.

"లలిత ఒక వేశ్యను వెంటబెట్టుకొని వచ్చిందట."

"అంతేకాదు. దాన్ని తన కోడల్ని చేసుకుంటుందట"

"దాని టక్కులు చూస్తేనే వళ్లు మండిపోతుంది" నిశ గురించి ఇలా తలోక మాటా అనసాగారు.

నిశకు ఇప్పుడు ఇరవై ఏడేళ్ళు నిండాయి. పూర్తిగా వికసించిన నందివర్ధనం పువ్వులా వుంది ఆమె సౌందర్యం చూసి గ్రామీణ స్త్రీలు ఈర్ష్య పడసాగారు.

ఒకరోజు ఒక స్త్రీ నిశ వినేట్టుగా మరో స్త్రీతో అన్నది- "ఎన్ని కుటుంబాలు కూల్చిందో ఇంతవరకూ? ఇక్కడ ఇంకెన్ని కుటుంబాలకు నిప్పు అంటిస్తుందో?"

ఒకరోజు పుష్కర్ భార్య లలితను ఎత్తిపొడుస్తూ అన్నది- "నిశ పాదం పెట్టిన చోటల్లా వినాశనమే అవుతుంది. నీ పాదం అలాంటిదే అత్తగారింటికి వస్తూనే అత్తను మింగేశావు. పెళ్ళి చేసుకొని నీ భర్త అనేక కష్టాలకు గురి అయ్యాడు. నీకు నిశమీద అంత అభిమానం ఎందుకూ? నీ బుద్ధీ ఆమె బుద్ధిలాంటిదే. అందుకే నిశను కోడల్ని చేసుకోవాలని కోరుకుంటున్నావ్."

పుష్కర్ మనసంతా రాజదేవ్‌కు ఆఫీసు నుంచి అందాల్సిన డబ్బు మీదే వుంది ఢిల్లీ వెళ్ళి అవసరమైన డాక్యుమెంట్సూ, సర్టిఫికెట్లూ ఇచ్చి వచ్చాడు.

బొంబాయి నుంచి ఆర్డరు రాగానే లక్షన్నర రూపాయలకు చెక్కు పంపిస్తామని ఆఫీసు మేనేజర్ చెప్పాడు. చెక్కు కొరకు ఎదురు చూస్తున్నాడు పుష్కర్. లలితను కానీ, నిశను కానీ ఎవరైనా ఏదైనా అంటే పుష్కర్ వారిమీద విరుచుకుపడ్తున్నాడు. ఒకరోజు భార్య రెక్క బట్టుకొని ఆమె గదిలోకి లాక్కెళ్ళి "మళ్ళీ ఆమె జోలికి వెళ్ళావో ఏం చేస్తానో చూడు." లలితకు విన్పించేలా అరిచాడు.

"వీళ్ళ మాటలు పట్టించుకోకు. మూర్ఖులు. గ్రామ ప్రజల గురించి నీకు తెలియంది ఏముంది. నిశను నువ్వు వెంట తీసుకొని రావడం, భర్త చనిపోయినా నువ్వు సధవగానే వుండిపోవడం గ్రామస్తులకు మింగుడు పడని విషయాలు. కొంత కాలం ఓపిక పడ్తే వాళ్ళే వాగి వాగి మానేస్తారు " అన్నాడు పుష్కర్ లలిత దగ్గిరకొచ్చి.

డబ్బు చేతికి అందేంత వరకూ లలితతో విరోధం తెచ్చుకో కూడదని పుష్కర్‌కు తెలుసు ఆమెను నమ్మించడానికే అతడు ఆమె పక్షం వహిస్తున్నట్టుగా నటిస్తున్నాడు.

లక్షన్నర రూపాయల చెక్కు వచ్చింది.

నిశ, లలిత దగ్గరకొచ్చి నిలబడి ఏదో చెప్పాలని ప్రయత్నిస్తూ వుంది.

"ఏమిటి నిశా? ఏదో చెప్పాలనుకుంటున్నట్టున్నావ్. సందేహం ఎందుకు చెప్పు."

"ఆంటీ అంకుల్ బ్రతికి ఉన్నారనే గదా మీ నమ్మకం."

"అవును." విస్మయంగా నిశను చూసింది మళ్ళీ తనకు తానే చెప్పుకుంటున్నట్టుగా చిన్నగా అన్నది—

"ఆయన శవం అని పట్టుకొచ్చి దహనం చేసిన మాంసం ముద్ద ఆయనది కాదు కోటు మాత్రం ఆయనదే కోటు కాలిపోలేదు. అలాంటప్పుడు ఆయన శరీరం ఎలా కాలిపోతుంది? ఆయన బ్రతికే వున్నారు. ఏదో ఒకరోజు తప్పక వస్తారు."

"సరిహద్దులో యుద్ధం కూడా ముగిసింది. మీ పెద్ద అబ్బాయి కూడా పది పదిహేను రోజుల్లో వచ్చేస్తాడు. ఈ పరిస్థితుల్లో ఆ చెక్కు మీ బావగారికి ఎందుకివ్వాలి? కొద్ది రోజులు దాన్ని మీ దగ్గిరే వుంచుకోవడం క్షేమం అని నా ఉద్దేశ్యం."

లలిత నిశ ముఖంలోకి పరిశీలనగా చూసింది.

"నిశా నువ్వు మానసికంగా కూడా బాగా ఎదిగిపోయావు. నువ్వు చెప్పేది వాస్తవమే. అసలే ఈ ఊళ్లో మనల్ని అందరూ శత్రువులుగా చూస్తున్నారు. అవమానిస్తున్నారు. ప్రస్తుతం మనల్ని సమర్థిస్తున్నది ఆయన ఒక్కడే. ఈ చెక్కు ఇవ్వలేదనుకో అతడు కూడా మన మీద

శత్రుత్వం వహిస్తాడు. అలాంటి పరిస్థితుల్లో మనం ఈ ఊళ్లో వుండ గలమా?"

"అవును ఆంటీ. డ్రాఫ్టు ఇవ్వకపోతే ఈ ఊళ్లో ఉండటం అసంభవం కాని డ్రాఫ్టు ఇచ్చిన మరు క్షణమే మనం ఈ ఊరిని వదలాల్సి వుంటుంది. దాని కోసమే ఆయనగారు మన మీద అంత ఆప్యాయత ఒలక పోస్తున్నారని మీకు తెలియదా ఆంటీ?

"కాని డ్రాఫ్టు ఇవ్వకుండా ఎంతకాలం తప్పించుకోవడం? పుష్కర్ పెన్షన్ తెచ్చుకోవడానికి పాట్నా వెళ్ళారు. ఎల్లుండి తిరిగి వస్తారు. రాగానే డ్రాఫ్టు అడుగుతారు. నేనేం చెయ్యాలి? ఇవ్వక ఎలా తప్పుతుంది?" సాలోచనగా అన్నది లలిత.

"ఆ డ్రాఫ్టు నాకివ్వండి. నేను ఒక చిన్న నాటకం ఆడతాను. ఆ నాటకంలో మా బావగారు ఎన్ని పాత్రలు ధరిస్తారో స్వయంగా చూడండి. కొందరు మంచివాళ్లు కూడా చెడుగా ప్రవర్తిస్తున్నారు. కారణం మీ బావగారంటే భయం వల్లనే. ఊళ్లో ఆడవాళ్లు రేపే పుకార్ల వెనక మీ బావగారి హస్తం వుంది. ఈ డ్రాఫ్టు నేను ఇవ్వాళే హీరామన్‌కు రిజిస్టర్ పోస్టులో పంపిస్తాను. డ్రాఫ్టు ఆ అబ్బాయి పేరుమీదే వచ్చింది, అందుకే వాడికి పంపించానని చెప్పండి."

లలిత డ్రాఫ్టు తెచ్చి నిశకు అందించింది.

భయపడినట్టే జరిగింది.

పుష్కర్ పాట్నానుంచి వస్తూనే అర్జంటుగా లలితను డ్రాఫ్టు ఇవ్వమని అడిగాడు. డ్రాఫ్టు హీరామన్‌కు పంపడం జరిగిందని వినగానే, అంతవరకూ ముఖానికి తగిలించుకొన్న మాస్క్ లాగేశాడు.

"మీ ఇద్దరూ కలిసి నన్ను పిచ్చివాడ్ని చెయ్యాలనుకొంటున్నారా? నా కళ్ళల్లో దుమ్ముకొడ్తారా? అన్ని రికార్డులూ నీ పేరు మీద ఉన్నాయ్. డ్రాఫ్టు మాత్రం హీరామన్ పేరు మీద వచ్చిందా? ఆది అబద్ధం ఇప్పుడే లాల్‌నారాయణ్‌కు టెలిగ్రాం ఇస్తాను. వాడు డ్రాఫ్టుతో సహా హీరామన్‌ను కూడా ఇక్కడకు ఈడ్చుకొస్తాడు." పళ్లు పటపటకొరుకుతూ అన్నాడు పుష్కర్.

పుష్కర్ ఓసురుగా గది నుంచి బయటికి వెళ్ళాడు. బయటనుంచి పుష్కర్ పెద్ద పెద్దగా అరుస్తూ లలితనూ, నిశనూ సహించలేని తిట్లు తిడ్తున్నాడు. లలిత బేలచూపులు చూసింది. నిశ మాత్రం ముసిముసిగా నవ్వుకుంటూ కూర్చొంది.

సూర్యాస్తమయం అయింది.

ఇంటి ముందు జనం కోలాహలం లలితకు విన్పించింది

ఒక కంఠం స్పష్టంగా అరుస్తోంది– "ఊరి నుంచి ఆ కులటల్ని గెంటి వెయ్యండి. ఈ ఊళ్లో ఇలాంటి వేషాలు పనికిరావు."

మరొక కంఠం "వాళ్ళిద్దర్నీ చావగొట్టి ఊరిబయట పెంటకుప్పలో పారేయండి." అన్నది.

ఇంకో కంఠం – "పుష్కర్ నువ్వు ఆ ఆడవాళ్లను బయటికి నెట్టకపోతే నీ ఇల్లు తగలబెడ్తాం జాగ్రత్త" అన్నది.

లలిత నిలువెల్లా వణికిపోయింది.

గాభరాగా నిశకేసి చూసింది.

నిశ కూర్చొని ముసిముసిగా నవ్వుకొంటున్నది.

నిశ ఎందుకు నవ్వుతుందో లలితకు అర్థం కాలేదు.

"ఎందుకు నవ్వుతావ్? ఇప్పుడేం చెయ్యాలి. నేను చావడానికి సిద్ధంగా వున్నాను. కాని నివేదిత, హీరామన్ ఏమైపోతారు? నిశా నువ్వు పారిపో. ఎలాగయినా ఈ రాక్షసుల బారినుంచి తప్పించుకో. అప్పుడు నేను ప్రశాంతంగా చచ్చిపోతాను."

"ఇది కూడా ఒక నాటకమే. నిన్ను ఎవరూ చంపరు. కేవలం బెదిరిస్తున్నారు."

"ఎలా చెప్తున్నావ్?"

"ఏముంది? నువ్వు చచ్చిపోతే డ్రాఫ్టు పుష్కర్‌కు అందదు. నీ పిల్లలకు ఇస్తారు. అందువల్ల నిన్ను చావనివ్వడు. నిర్భయంగా వుండు ఆంటీ. ఈ నాటకమంతా అతడు ఆడిస్తున్నదే మనం భయపడి పోయి డ్రాఫ్టు ఇచ్చేస్తామని ఇంత హంగామా చేయిస్తున్నాడు."

"మీరు దయచేసి శాంతించండి నా మాట నమ్మండి. ఈ ఆడవాళ్ళిద్దర్నీ ఢిల్లీ పంపించేస్తాను. నాకు ఒక వారం సమయం ఇవ్వండి" పెద్దగా ప్రాధేయపడుతున్నట్టుగా అన్నాడు పుష్కర్.

నిశ మళ్ళీ ముసిముసిగా నవ్వుకుంది.

రోజూ ఈ నాటకం జరుగుతూనే వుంది.

ఎనిమిదవ రోజు హీరామన్‌ను తీసుకొని లాల్‌నారాయణ్ వచ్చాడు. పుష్కర్ హీరామన్‌ను డ్రాఫ్టు తనతో తెచ్చాడో లేదో అడిగి తెచ్చినట్టుగా తెలుసుకొన్నాడు. అప్పుడుగాని పుష్కర్ ముఖం వికసించ లేదు.

హీరామన్‌ను ఎంతో ప్రేమగా ఇంట్లోకి తీసుకొచ్చాడు.

ఢిల్లీ చేరిన రాజదేవ్‌కు, తన భార్యను బలవంతంగా తన అన్న ఊరికి తీసుకెళ్ళినట్టు తెలిసింది. ఆఫీసులో డ్రాఫ్టు లలిత పేర పంపించి నట్టు తెలిసింది. హీరామన్ హాస్టల్లో ఉన్నాడని ఆఫీసు మేనేజర్ చెప్పాడు. రాజదేవ్ తిన్నగా హాస్టల్‌కు వెళ్ళాడు లాల్‌నారాయణ్ వచ్చి కుర్రాణ్ణి ఊరికి తీసుకెళ్ళాడని హాస్టలువాళ్ళు చెప్పారు.

లాల్‌నారాయణ్ ఇంటికి వెళ్ళాడు. అక్కడ ఉమేశ్ ఉన్నాడు. ఉమేశ్ రాజదేవ్‌ను చూసి గాభరాగా లేచి నిల్చున్నాడు.

"బా...బా...బాయ్...మీ...మీరా? మీరు బతికే వున్నారా? ఇక్కడ మీ దహన సంస్కారాలూ, శ్రాద్ధకర్మలు కూడా చేసేశారు. పిన్నిమాత్రం మీరు బతికివున్నారనీ, తిరిగి వస్తారనీ అనేది పుష్కర్ బాబాయి పిన్నిని వితంతువులా ఉండాలని పట్టుపట్టాడు.

ఉమేశ్ నిషాలో ఉన్నాడు.

రాజదేవ్ బ్రతికి తిరిగి రావడం అతడికి సంతోషాన్ని కలిగించింది. ఎంతో ఆవేశంతో అన్ని విషయాలూ చెప్పాడు. పుష్కర్, లాల్‌నారాయణ్ కలిసి ఆడుతున్న నాటకం గురించి కూడా చెప్పాడు.

రాజదేవ్ జీవితంలో చాలాసార్లు మోసపోయాడు. అయినా ఎవరి మీదా అతడు ప్రతీకారం తీర్చుకోలేదు ఎవరిమీదా అతడి మనసులో కసి లేదు. పాపపుణ్యాల మీద అటల విశ్వాసం వుంది పాపం చేసినవాడు దాని ఫలితాన్ని అనుభవిస్తాడనీ, ఆ పైవాడే అంతా చూసుకుంటాడనీ అతడి దృఢ విశ్వాసం. పాపం చెయ్యనివాడికి, న్యాయంగా బ్రతికేవాడికి ఎప్పుడూ అన్యాయం జరగదనే నమ్మకం కూడా కలవాడు. అందుకే లాల్‌నారాయణ్‌ను క్షమించి వదిలేశాడు.

ఇప్పుడు అతడి నమ్మకాలన్నీ తారుమారైనాయి.

లలిత ఏం పాపం చేసిందని ఇంత శిక్ష వేశాడు భగవంతుడు? తన, పరాయ అనే భేదం లేకుండా అందర్నీ ప్రేమించింది. అందరికీ సేవ చేసింది. సహాయం చేసింది. ఏనాడూ ఎవరి నుంచి ప్రతిఫలం కూడా ఆశించలేదు. అలాంటి త్యాగమయికి ఇంత దారుణశిక్ష ఎందుకు పడింది.

తన జబ్బును లక్ష్యపెట్టకుండా అందరికీ సేవలు చేసింది. ఇతరులకోసం తన డబ్బును మంచినీళ్లలా ఖర్చు చేసింది. ఆమె చేసిన పుణ్యానికి లభించిన ప్రతిఫలం ఇదా?

లాల్‌కూ, వాడి తండ్రికీ ఎంత సేవ చేసింది? అంతా బూడిదలో పోసిన పన్నీరే అయింది.

రాజదేవ్ అక్కడ్నుంచి ఆఫీసుకు వెళ్ళాడు. అతడ్ని చూచి ఆఫీసులో అందరూ ఆనందాతిరేకంతో కౌగలించుకొన్నారు. కొందరి కళ్లు చెమ్మగిల్లాయి.

"మీ అన్నయ్యే నీకు రావాల్సిన లెక్కలన్నీ చూసి డబ్బు సెటిల్ చెయ్యమని ఒకటే తిరిగాడు. అందువల్లనే ఇల్లు ఖాళీ చేయించాల్సి వచ్చింది. రూల్సు ప్రకారం ఒకసారి అన్ని లెక్కలూ తేల్చేశాక ఇల్లు ఆఫీసు స్వాధీనంలోకి వచ్చేస్తుంది. పైగా అధికారులకు మీ శ్రీమతి తొందర పెడుతుందనే భావం కలిగించారు" అన్నాడు మేనేజరు.

"మీరేం బాధ పడకండి. ఇప్పుడే ఆ డ్రాఫ్టును క్యాన్సిల్ చెయ్యమని బ్యాంకుకు రాస్తాను. ముందుగా ఫోన్ కూడా చేస్తాను. మీరు

పత్రిక ఛీఫ్ ఎడిటర్. అయితే మీ శ్రీమతి ఎలా వున్నారో ఒక్కసారి వెళ్ళి తెలుసుకు రావడం మంచిదని భావిస్తున్నాను" అన్నాడు మేనేజర్.

"నేను ఇవ్వాళే ఊరికి వెళ్తున్నాను."

"రైల్లో వెళ్తే ఆలస్యం అవుతుంది. పాట్నా నుంచి ముజఫర్ పూర్ వరకు ప్లేన్‌లో వెళ్ళండి. రేపు సాయంకాలానికల్లా ఊరు చేర్తారు."

"అలాగే చేస్తాను. ఈ లోగా లాల్ నారాయణ్‌తో ఏనాడో తేల్చుకోవలసిన కొన్ని విషయాలున్నాయ్, అవి ఈ రోజు పూర్తి చేసుకుంటాను" అన్నాడు రాజదేవ్

అంతలో టెలిఫోన్ మ్రోగింది.

మేనేజర్ సంతోషంగా "మీ అబ్బాయి రామ్ ఫోన్. ఢిల్లీ వచ్చాడట. మీరే మాట్లాడండి" అని అందించాడు.

రాజదేవ్ రామ్‌ను వెంటనే బయలుదేరి ప్రెస్ దగ్గరకు రమ్మని చెప్పి ఫోన్ పెట్టేశాడు.

రతనపూర్ గ్రామంలో దాదాపు వంద మందికి పైగా రాజదేవ్ ఇంటిముందు నిలబడి అరుస్తున్నారు.

ఆ గుంపులో ఒక వైపు ఆడవాళ్ళు కూడా అరుస్తూ నిల్చుని వున్నారు.

హీరామన్ రెండు చేతులతో దర్వాజా పట్టుకొని వాకిలికి అడ్డంగా నిలబడ్డాడు. లాల్ నారాయణ్ హీరామన్‌ను లాగడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ ప్రయత్నంలో రెండు మూడు సార్లు వెనక్కు పడ్డాడు.

పుష్కర్ ముందుకు వచ్చాడు. అతడ్ని చూసి జనంలోని కొందరు ముందుకు అడుగులు వేశారు.

అంతలో వెనకనుంచి కొన్ని కంఠాలు "మోటారు బండి వస్తోంది. మోటారు బండి వస్తోంది" అని అరిచాయి.

ఆ ఊరికి ఆ రోజుల్లో కారు రావడం అంటే అసామాన్య విషయం. జనంలో కుతూహలంతోపాటు భయం కూడా చోటు చేసుకొన్నది. కారులో పోలీసులు వస్తున్నారేమోననే అనుమానంతో కొందరు చిన్నగా తప్పుకోసాగారు. జనం పల్చబడుతున్నారు.

కారు జనం ముందుకొచ్చి ఆగింది.

కారులో నుంచి ముందుగా దిగిన ఉమేశ్‌ను చూడగానే జనంలో అలుముకున్న భయం మాయమైంది. అంతలోనే క్రచ్చెస్ ఆధారంతో కారు దిగిన రాజదేవ్‌ను చూశారు.

జనం కళ్ళప్పగించి చూడసాగారు.

రాజదేవ్ చిన్నగా కర్ర మోగుతూ వుండగా జనం వైపుకు నడిచాడు.

చాలా మందికి తాము చూస్తున్నది నిజమో కలో అర్థం కావడం లేదు.

మృత్యు దేవతను చూసినట్లు అందరూ భయ భ్రాంతులై నిలబడి పోయారు.

రాజదేవ్ ముందుకు నడుస్తుంటే జనం పక్కకు తప్పుకొని మార్గం ఇస్తున్నారు.

హీరామన్ ఒక్క పరుగులో తండ్రిని చేరుకొన్నాడు.

రాజదేవ్ కొడుకును బుజ్జగింపుగా పొదివి పట్టుకొని తలమీదా, వీపుమీదా ప్రేమగా నిమిరాడు. తల్లిని రక్షించడానికి అంతవరకు హీరామన్ ఐరన్‌మేన్‌లా గడపలో నిలబడివున్నాడు. రాజదేవ్ వెనుతిరిగి జనాన్ని చూశాడు. చాలా మంది అప్పటికే వెళ్ళిపోయారు. ఉన్నవాళ్ళు కూడా జంకుతూ నిలబడ్డారు.

"పిన్ని ఒక వేశ్యను తన కోడల్ని చేసుకున్నది. దాన్ని ఈ ఊరిలో ఉంచడానికి వీల్లేదంటున్నారు ఊరివాళ్ళు" లాల్‌నారాయణ్ అన్నాడు.

రాజదేవ్ లాల్‌నారాయణ్ కేసి చూడలేదు. జనంవైపు తిరిగి అన్నాడు.

"అవును. నిజమే. కళంకం క్యాన్సర్ జబ్బులాంటిది. అది సమాజాన్ని తినేస్తుంది. క్యాన్సర్‌కు చికిత్స లేదు. ఆ భాగాన్ని కోసి పారెయ్యాల్సిందే. అయితే సమాజానికి కళంకం ఎవరనేదే పెద్దప్రశ్న."

రాజదేవ్ మాటలకు సమాధానం ఎవరూ ఇవ్వలేదు. అతడ్ని చూసేసరికే పుష్కర్ గొంతు ఎండిపోయింది. గొంతులో నుంచి శబ్దం కూడా రావడంలేదు.

"నిశ కులట. వితంతువు అయివుండీ ఉమేశ్‌ను తన వలలో వేసుకొని పెళ్ళి చేసుకున్నది" అన్నాడు లాల్‌నారాయణ్.

"నిశ నన్నేమీ తన వలలో వేసుకోలేదు. అసలు మేమిద్దరం పెళ్ళి చేసుకోలేదు. మా అన్నయ్య బారినుండి తప్పించుకోవడానికే పెళ్ళి చేసుకున్నామని అబద్ధం చెప్పాం. ఈ గ్రామ పిశాచాల నుంచి రక్షణకోసం ఢిల్లీ వెళ్లిపోయాం." ఉమేశ్ మాటలు విని జనంలో కలకలం బయలుదేరింది.

అప్పటికి పుష్కర్ తేరుకున్నాడు.

"ఎంత పతిత్తు మాటలు చెప్తున్నావురా? ఇది కపాడియాకు ఉంపుడుగత్తెగా బతకలేదూ? ప్రమోద్‌ను కూడా వలలో వేసుకొనే ప్రయత్నం చెయ్యలేదూ? రామ్‌తో రాసలీలలు నడపలేదూ?" కసిగా ఉమేశ్‌ను చూస్తూ అన్నాడు.

రాజదేవ్ కోపంగా అన్న కేసి చూశాడు. కోపంతో అతడి కళ్లు నిప్పుకణికల్లా మండుతున్నాయి. తమ్ముడి చూపుల్ని తట్టుకోలేనట్టు పుష్కర్ తల పక్కకు తిప్పుకొన్నాడు.

"కోటీశ్వరుడైన కపాడియాకు నిశ పరిచయమయ్యేనాటికి ఎనభై ఏళ్ల వయసు. ఎనభై ఏళ్ల వృద్ధుడి ఆశ్రయంలో వున్న ఇరవై రెండేళ్ల యువతిని, అతడి ఉంపుడుగత్తెగా ఎవరూ ఊహించలేరు. మేమంతా కలిసి నిశ ఆత్మహత్యకు పాల్పడేస్థితిని కల్పించాం. అప్పుడే కపాడియా ఆమెను రక్షించాడు" ఓ క్షణం ఆగి పుష్కర్‌వైపు చూస్తూ అన్నాడు–

"ఇక ప్రమోద్. అంత సజ్జనుడు, త్యాగమూర్తి నీకు కొడుకుగా పుట్టడం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. అతనిలో మానవత్వం ఉంది. ఎదుటివారిని అర్థం చేసుకోగల వివేకం వుంది. కష్టంలో ఉన్నవారిని ఆదుకోగల హృదయం వుంది. ప్రమోద్‌ను ఆమె ఆకర్షించలేదు. ప్రమోద్ స్వయంగా ఆమెమీద ఆశలు పెంచుకొన్నాడు. ఆమె ప్రమోద్ క్షేమంకోరి అతడ్ని దూరంగా వుంచింది.

ఇక రామ్ విషయం – ఆఁ అవును. రామ్ అంటే ఆమెకు ఇష్టం. రామ్‌కు కూడా ఆమె అంటే ఇష్టం. ఒకర్నొకరు ప్రేమించుకొన్నారు. రామ్‌ను చెడుమార్గం నుంచి మళ్ళించి, సన్మార్గంలో నడిపించింది. ఆమె వల్ల సమాజానికి ఎలాంటి నష్టం కలగలేదు. తన స్వార్థ పూర్తికోసం

ప్రతి నిముషం ఇతర్లను ఎలా మోసం చెయ్యాలా అని చూసేవాడే సమాజానికి చీడపురుగు. తన స్వార్థంకోసం పొరుగువాడి కొంపలకు నిప్పంటించేవాడు సమాజానికి కళంకం. క్యాన్సర్ లాంటివాడు. చట్టాన్ని ధిక్కరించి సమాజ వ్యతిరేక పనులు చేసేవాడు సమాజానికి శత్రువు. అలాంటివాడు ఎవడో మీకు చెప్పమంటారా?"

మాట్లాడుతున్న రాజదేవ్ చూపులు జనాన్ని కొలుస్తున్నాయి.

లాల్‌నారాయణ్ చిన్న చిన్నగా జనం మధ్య నుంచి జారుకోవడాన్ని చూశాడు. అదే సమయంలో అక్కడకు వస్తున్న రెండు జీపుల మీద అతడి కళ్ళు నిలిచాయి. వాటికోసమే రాజనారాయణ్ ఎదురు చూస్తున్నాడు.

"ఇక నువ్వు తప్పించుకోలేవురా లాల్. వెనక్కు తిరిగిచూడు. పోలీసులు వస్తున్నారు" నువ్వు అనేక మంది అమాయక బాలికల శీలాన్ని దోచుకొన్నావు. ఎందరో నీవల్ల నాశనం అయ్యారు. ఆత్మహత్యలు చేసుకొన్నారు. తార్చుడు పని చేసి డబ్బు సంపాదించావు. నీ దాహం తీరలేదు. చివరకు లైసెన్సులు అమ్మి ప్రభుత్వాన్ని కూడా మోసగించావ్ అయినా నీ ఆకలి తీరలేదు నీ అబ్బ ఆకలి కూడా తీరలేదు. చివరకు నేను చచ్చానని భావించి, నేను నా భార్యాబిడ్డల కోసం కూడబెట్టిన ధనాన్ని కూడా మోసంతో లాక్కోవాలని చూశారు. కనీసం తమ్ముడి భార్య అని నీ తండ్రిగానీ. బాబాయి భార్య అని నువ్వు కానీ ఆలోచించారా? నా పిల్లల గురించి ఆలోచించారా?

మా నాన్న పోయి పద్దెనిమిదేళ్ళయింది నా పొలంలో వచ్చిన ఆదా అంతా ఎవరు అనుభవించారు? పొలం తాకట్టులో వుందనీ, దాన్ని విడిపించాలనీ నా భార్యతో చెప్పి నమ్మించి మోసం చెయ్యాలని చూస్తారా? మీరు మనుష్యులేనా? కాదు. నరరూప పిశాచాలు."

జీపులు వచ్చి ఆగాయి.



ఒక జీపులో నుంచి రామ్ దిగాడు.

లాల్‌నారాయణ్ పారిపోయే ప్రయత్నం చెయ్యలేదు.

"లాల్‌నారాయణ్ ఎవరు?" పోలీసు ఇన్‌స్పెక్టర్ అడిగాడు. జనంలోని కొందరు లాల్‌నారాయణ్‌కేసి చేతులు చూపించారు.

లలితకు రాజదేవ్ కంఠం విన్పించింది.



ఆనందాతిరేకంతో నిశను రెండు చేతులతో పట్టుకొని ఊపేస్తూ అన్నది— "నేను చెప్పలేదూ? ఆయన వస్తారని చెప్పలేదూ? అదుగో విను. అది ఆయన కంఠమే. ఆయనే మాట్లాడుతున్నారు. ఆయన వచ్చారు. వచ్చేశారు."



లలిత బయటికి పరుగుతీసింది.

తలుపు లోపలనుంచీ బయటినుంచీ కూడా బంధించబడింది. లలిత లోపలి గడియ తీసింది. తలుపు తెరచుకోలేదు.

లలిత తలుపు దబదబ బాద సాగింది.

రాజదేవ్ స్వయంగా తలుపు తెరిచాడు.

తలుపులు తెరచుకోగానే లలిత భర్త కాళ్ళ మీద ఒక్కసారిగా పడిపోయింది.

కుడికాలు స్థానంలో కచ్చెన్‌ను చూసి ఓ క్షణం దిమ్మెరపోయింది.

అకస్మాత్తుగా లేచి నిల్చుంది.

కుడి భుజంమీద చెయ్యివేసి "ఫర్వాలేదు. బాధపడకండి. నేను మీ గొంతు వినడానికి ఎంత పరితపించిపోయానో చెప్పలేను. కళ్ళల్లో వత్తులు వేసుకొని మీకోసం ఎదురుచూశాను. మీరు వస్తారని నాకు తెలుసు. నన్ను వదిలి ఎక్కడికీ వెళ్లరని తెలుసు. వచ్చారు" ఆనందాతిరేకంతో గొంతు పూడిపోయింది. కళ్లు చెమ్మగిల్లాయి.

బయటికి వస్తున్న లలితనూ, నిశనూ చూసి జనం తిరుగుముఖం పట్టారు.

"రామ్‌కోసం నువ్వు నిరీక్షించనక్కర్లేదు - వాడు కూడా వచ్చేశాడు - అడుగో అటు చూడు" నిశకు రామ్‌ను చూపిస్తూ అన్నాడు రాజదేవ్.

స మా ప్తం

